భారత గ్రంథమాల సం. ౮
గుంటూరు – 1

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము



మధ్వశ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్య విరచిత
లఘు టీకా వ్యాకరణవిశేష సహితము



ప్రకాశకుఁడు
చతుర్వేదుల పార్థసారథి
గుంటూరు

గుంటూరు లతా ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్సునందు
ముద్రింపబడినది

1972



చందాదార్లకు రు. 6—00 ఇతరులకు రు. 7—00

---

సంపాదకమహోదయులు :

కవిశేఖర పధ్వశ్రీ పశ్నైపూర్ణ ప్రజ్ఞాచార్యులు గారు

దర్శనాచార్య శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు

కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు

శ్రీ వంగల వేంకటరామశాస్త్రి గారు

శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు గారు

సంస్కృతోపాధ్యాయులు

గ్రంథ పరిశీలక మహోదయులు :

శ్రీ చతుర్వేదుల అమరేశ్వరశాస్త్రి గారు

శ్రీ ఆచార్య 'ధనకుధరం' గారు

---

# విషయసూచిక

## విరాటపర్వము – తృతీయాశ్వాసము



## విరాటపర్వము – చతుర్థాశ్వాసము

విరాటపర్వము – పంచమాశ్వాసము

శ్రీ

హరిహరనాథాయనమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము - తృతీయాశ్వాసము



త్వశివాత్వాలంబన
తత్త్వశ్లేషా త్మశబల ॥ తాసంగత
[1] ర్ప త్త్వాదికలీలా త్మ
[2] హత్తాహంకారభావ ॥ హరిహరనాథా. 1

### — ఉపకీచకులు ద్రౌపదిం దమయన్నశవంబుతోఁ గట్టి దహింపం గొనిపోవుట. —

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియెఁ బవనతనయుం డట్లు చని మహానసమందిరంబుపరిసరంబున శరీరప్రక్షాళనంబు సేసికొని యనులేపనంబున [3] నస్రగంధం బుడిపికొని కృతకృత్యుండై శయ్యాతలంబునఁ గూర్చుండె నిట యాజ్ఞసేనియు భీమసేనుం డింతప [4] వంటయింటికిం బోయి నిశ్చితంబున నుండునని నిశ్చయించి నర్తనశాల వెలువడి కావలివారలం బిలిచి. 2

క. నాపతు లసుగంధర్వుల
చేపడి మృతిఁ బొందె వీఁడె ॥ సింహబలుం డీ

---

1 క. గ. ర్ప త్త్వాదివిలాసా త్త. 2 చ హత్త్వాలంకార.
3 జ. విస్రగంధం, 4 గ. వంటకంబునింటికిం.

పాపాత్ముని( జూడు(డు దు
ర్వ్యాపారఫలంబు గాంచె • నని పలుకుటయున్. 3

ఆ. వారు సంభ్రమించి • వడి( [1]గోలదివియలు
గొనుచు నలివు మగుల( • గూడ(బాఱి
నృత్తశాల( జొచ్చి • రత్తఱి నాకల
కల మెఱింగి కీచ • కవ్రజంబు. 4

చ. కడువెసవచ్చి రూపఱిన • కాయము నున్న తెఱంగు( జూచి వి
ట్టడలు మనంబులం గదిరి • హా యనువారును జోద్యమంది బ్రమా
స్పడియెడువారు నగ్రజుని • పై( బడి మూర్ఛల( బొందువారు న
య్యెడ కరుగంగ నోర్వక మ • హిం బెఱచో( బలవించువారు నై. 5

వ. ఉన్నంత బంధుజనంబులు గూడంబాఱి కీచకశవంబు( గనుంగొని. 6

ఉ. మానవకోటి నిట్టివిసు • మానపు(బీను(గు లైనవారి నెం
దైనను గంటిమే యకట • యూఱడి వమ్మయి పోయె దుర్గయం
బైనబలంబు గావి తెరు • వై తన కిత్తఱి( దోడు [2]గాద యు
క్కైనిమనంబు గీడు పరి • కించునె క్రొవ్విన( జేటు దప్పునే. 7

తే. కరము లెయ్యవి శిరమేది • గాళ లెచట
జొచ్చెగంధర్వవరులచే( • జచ్చువార
లెల్ల నిట్టుల యగుదురో • యితనితోడి
యలుక( జేసిరొ యిది గడు • నక్కజంబు. 8

వ. అని వెండియు బహుప్రకారంబులం బలుకుచు శోకవిస్మయపరీతచేత
స... యున్నంత నొక్కయుపకీచకుండు నిజసహోదరులం జూచి.

క. మ... మంత [3]పసని పిలిచిన
విన నేర్చునె సింహబలు(డు • వేగమ యితనిం

1 అ. గాలుదివియలు. 2 చ. గాక, 3 జ. వసరి, చ. పనికి.

గొనిపోవఁగ వలయుంగా
కని యందఱుఁ దేర్చె ననున • యాలాపములన్. 10

ఉ. సూతులు దాని కియ్యకొను • చుం దమయన్నకు నగ్ని [1]యేర్చువా
రై తగ వాచరించునెడ • [2]నల్లన ద్రౌపది వీరిచందముల్
సూతముగాక యంచు నొక • చోఁ దమచేరువనున్నఁ గాంచి నం
జాతమహోగ్రకోపు లయి • చారునిలోచనఁ బట్టి క్రూరతన్. 11

క. పెదగేలు గట్టి పాపుఁ
బొద వగు నిది గాదె యితనిఁ • బొద వడఁగించెన్
గెడగూడ దీని నీతని
యొడలిపయిం బెట్టి కాల్చు • టుచితం బరయన్. 12

వ. అని విరాటుని కెఱింగించిచేయువారై యంతకు మున్న యావృత్తాంతం బంతయు విని సంక్షుభితహృదయుం డై యున్నయతనిపాలికిం బోయి.

తే. ఎల్లభంగుల సైరంధ్రి • నేము సింహ
బలునితోఁ జంపువారమై • తలఁచి నీకు
నెఱుఁగఁ జెప్పంగ వచ్చితి • మీవు నింత
వట్టు మున్నన మాకు నీ • వలయు ననిన. 14

వ. ఆతండును దనమనంబున నయ్యుపకీచకులచందంబు సూచి నేను వారించితినేనియు నుడుగం గలవారు గా రని యూహించి వారలం గలయం గనుంగొని యట్లకాక మీకుం బోలినతెఱంగు సేయుం డనిన నదియ యనుమతిగాఁ గైకొని సరభసంబునం జనుదెంచి. 15

ఉ. అంగజరాగమత్తుఁ డగు • నన్నకు నిమ్మెయి నైనఁ బ్రీతి సే
యంగలవార మీజఱభి • యాతనితోడన తీఱఁగాక యం

---

1 గ. యిచ్చు. 2 గ, వల్కాక.

చుఁ గొనిపోయి దైన్యమున • సూతునిపేనుఁగుమీఁదఁ బాండుపు
త్త్రింగనఁ బెట్టి కట్టిరి ద • యాపరివర్జితచిత్తవృత్తులై. 16

చ. అశుచియుఁ గష్టుఁడుఁ లఘువు • నైననిజాగ్రజుని మేనితోడ ని
త్యశుచియుఁ బుణ్యశీలయు నుదాత్తయు నాఁ జనునింతిఁ గొంచుఁ గ
ర్కశమతిఁ గీచకుల్ బహుము • ఖంబుల బాంధవవిప్రలాపముల్
దిశ లద్రువం జెలంగఁ గర • దీపనికాయము ప్రజ్వరిల్లఁగన్. 17

క. పితృవనముదెసకుఁ జన స
య్యతివ భయభ్రాంతచిత్త • యై బాష్పజలో
ద్గతి మొగముఁ గప్ప నిట్లని
యతిరావముగా నొనర్చె • నాక్రందనమున్. 18

ఆ. అనద నైతి నిచట • నాలికుయ్యాలింపఁ
దకట మీరు గలుగ • నాక్రమించి
నన్నుఁ గట్టి సూత • నందను లిమ్మెయి
వెఱపు లేక [1]భంగ • పఱుచువారు. 19

ఉ. అనతవైరి యోజయ స • హద్భుతవిక్రమ యోజయంత దు
ర్మానవిఘూర్ణ మానరిపు • మర్దన యోవిజయాభిధాన తే
జోనిహతాహితప్రకట • శూరగుణప్రతిభాస యోజయ
త్సేన విరోధిబాహుబల • జృంభణభంజన యోజయద్బలా. 20

సీ. [2]తొడఁగినపని చలం • [3]బెడపక యతిదుష్క
రం బైనఁ గడతేర్చు • ప్రభువులార

1 క. భంగపఱుచువారె. 2 చ. జ. తొడరిన. 3 గ. బెడలక.

పెనఁగిన పైవస్త్ర • తుని నైనఁ గడిమిమై
బ్రేల్చిడిఁ బరిమార్చు • వీరులార
శరణార్థి యగుదుష్ట • శాత్రవు నైనను
గరుణ రక్షించుచు • త్పురుషులార
యర్థికిఁ బ్రాణంబు • లైనను దాపక
తమకించి యిచ్చు న • దాతలార

తే. నాథులార గంధర్వర • త్నంబులార
నన్ను నుపకీచకులు దమ • యన్నశవము
నందు బంధించుకొని పెన • నరుగుచున్న
వారు రక్షింప వేగ రా • వలయు మీరు.

—• భీముఁ డుపకీచకులం జంపి ద్రౌపదిని విడిపించుట •—

చ. అని పలవించునయ్యెలుఁగు • లాపవమానతనూజుఁ డేర్పడన్
విని మది నాదువల్లభకు • వీండ్రును గ్రమ్మఱ నింత సేసిరే
యనుచు సరోషసంభ్రమత • నాయిత మై పెసఁ బాటి వప్రలం
ఘన మొనరించె గుప్తముగ • గ్రక్కున నుబ్బెకువానికిం దగన్. 22

తే. ఇట్లు లంఘించిపోయి ప • రేతభూమి
యొద్ద నలుదిక్కులును జూచి • యొక్క యున్న
తావనీజంబు పెఱికి రొ • ప్పాతిరేక
మదర భుజశిఖరంబున • యం దమర్చి. 23

మ. వికటభ్రూకుటిఘోరఫాల • [1]కలితస్వేదోద్భటుండుం జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం [2]బ్రమర్దనదశా • విర్భావసంభావితాం

---

1 ఘ. ఘటితస్వేదోద్భవుండున్, 2. చ ప్రబన్ధన.

గరుఁడుం డత్తవిహాహదోహలసమ • గ్రక్రోధవేగుండు నై
బకవిధ్వంసకుఁ డయ్యెదన్ నిలిచె శుం • భన్మూర్తివిస్ఫూర్తితోన్. 24

వ. తదనంతరంబ. 25

ఆ. సూతుశవముతోడ • నేతెంచు [1]నెరవులు
దవ్వుదవ్వులన యు • దగ్రరూప
కలితుఁ డైనభీముఁ • గనుఁగొని నడవక
నిలిచి రంతనంతఁ • గలఁగఁబాఱి. 26

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రిం • కెక్కెక్కి యంచున్ భయం
బొదవం బల్లములందు డాఁగియు సమీ • పోర్వీజముల్ ప్రాఁకియుం
జెదరం బాఱియు నీరు సొచ్చియును ని • శ్చేష్టం బదద్వంద్వముల్
గుదివడ్డం బెగ డొందియున్ భరితసం • క్షోభాత్ములై రత్తఱిన్. 27

ఉ. సూతులు భీతులై ద్రుపద • సూతిసమేతము గాఁగ నగ్రజ
ప్రేతము వైచి పీటిదెసఁ • బెల్లుగఁ బాఱఁ దొడంగినన్ వడిన్
వాతసుతుండు ముట్టికొని • వారి బకల్పడ వ్రేసి యందఱం
జేతులఁతీఁట వో నుఱుము • సేసె విశృంఖలవిక్రమంబునన్. 28

వ. ఇవ్విధంబున నూటయేవు రుపకీచకులను సమయించి శమితక్రోధుం డై వచ్చి పాంచాలీబంధమోక్షంబు గావించి యింక నిశ్చితంబున సుధేష్ణ మందిరంబునకుం జను మని యవ్వేలంది వీడుకొలిపి తానును వేఱొక్క మార్గంబున మహానసగృహంబున కరుగుదెంచెం దత్సమయంబున విరాటుండు గీచకానుజులు గంధర్వులచేత నిరవశేషంబుగా మృతిం

1. ఖ. కీచకుల్. చూడు 'నెరవుల' (విరా ౧-౨౪౫) 'నెరవొంది' (విరా. ౩-౧౦౦).

బొంది రని విని చకితచేతస్కుం డగుచు సహోదరమరణశోకాయ త్త
చి త్త యయినజీవితేశ్వరి నుచితాలాపంబుల ననునయించి యి ట్లనియె

ఆ. చంద్రవదన యింత సై • రంధ్రి నిచ్చోటు
వాప వలయు నేము • భంగి నైనఁ
గాన నాదుపలుకు • గాఁ జెప్పు వెడలుట
కనుగుణముగ నమ్మ్రొ • గాడితోడ. 30

ఆ. పురుష లాలితాంగి • పౌరువునఁ బోయినఁ
జేటు వచ్చుఁ గాన • చెప్ప నేను
వెఱతు నాఁడువారు • [1]వెరవుతో మృదువచో
రచనఁ జెప్పుటరయ • నుచితవృ త్తి. 31

ఉ. ఆకమలాక్షిరూపమహి • మాతిశయంబు మనోహరంబు బో
గై కపరాయణుల్ పురుష • లంగజుఁ డప్రతికారచేష్టిత
స్వీకృతలోకుఁ డ ట్లగుటఁ • జేటు పురంబునవారి కెప్పుడుం
గా కెటు లుండు నిట్టియవ • గాథపుఁబొత్తు మనంగ వచ్చునే. 32

క. అని నిశ్చయించి పలికిన
విని కేకయరాజపుత్రి • విభుతలఁపు మనం
బునకుఁ బ్రియం బగుటయుఁ గై
కొని యూపని యట్లచేఁత • కుం బూనెఁ దగన్. 33

క. అంతం గుంతీనందన
కాంతాచింతామహాంధ • కారముతో న
త్యంతంబు [2]మచ్చరించెనో
సంతమసం బనఁ బ్రభాత • సమయం బయ్యెన్. 34

---

1 క. తెఱఁగునో. 2 క గ చ. ప్రముచ్ఛిలించెనో.

వ. పదంపడిఁ దన్మనఃప్రమోదసంపత్కారుం డగు నరుణకిరణుం డుదయించె నటమున్న పాంచాలి సచేలస్నానంబు సేసి రాగాదివికారనిరాసంబునం బ్రసన్నయయిన బుద్ధియుం బోలె సింహబలప్రభృతికీచకవిధ్వంసనంబునం దెలి వొంది మందాయమానంబునం బురంబు సొచ్చి రాజవీథి నరుగుదెంచు నప్పుడు. 35

సీ. మనకీచకుల కెల్ల • మారి యై పుట్టిన
సుదతి యోయెడు నని • చూచువారు
నద్దిరా నీకుఁ గ్రొ • వ్వఱుగదేఁ జూతుగాఁ
కని తల నూఁపక • యడఁగువారు
నలవోక గనుఁగొని • యంతరంగము బిట్టు
బెదర మాఱుమొగంబు • వెట్టువారు
నెదురుగా వచ్చిన • నెంతయేనియు దవ్వు
గలుగ వేఱొకత్రోవఁ • దొలఁగువారు

తే. ముట్టఁబడి మేనఁ గంపంబు • పుట్టనొదిఁగి
యుండువారుఁ గరంబున • నుదర మప్ప
ళించి యమ్మరో [1]రక్కెస • యంచు సల్ల
ములుకువారునై పురజనం • బులు దలంకి. 36

చ. పులిఁ గనుఁగొన్న [2]లేడులును • బోలె విభీతిఁ గలంగఁ బాఱి న
న్నెలఁతుక యంతరంగమున • నిండినహాస్యరసంబు మోముపై
వెలివిరియంగ నీక చని • వేచి మహానసశాలవాకిటన్
నిలిచినభీమసేనుఁ గని • నెయ్య మెదం జిగురొత్తు చుండఁగన్. 37

---

1 ఱ. రక్కసి. 2 క గ లేళ్ళగమివోలె.

క. తనయంతన యటు వలుకుచుఁ
అనువిధమున నతనిదిక్కు • చక్కనిచూడ్కిం
గనుఁగొనక ద్రుపదనృపనం
దన యిట్లను నిజకృతార్థ • తం దెలుపుటకున్. 38

తే. కీచకులదెసఁ బుట్టిన • కిల్బిషంబు
పాచి నన్ను రక్షించిన • పరమధర్మ
రతికి గంధర్వపతికి ని • రంతరంబు
భక్తియుక్తిమైఁ బ్రణమిల్లి • బ్రదుకుదాన. 39

వ. అనిన విని యనిలనందనుండు నిగూఢవచనచాతుర్యధుర్యుండై యి
ట్లనియె. 40

చ. అతివ యపాయముం బొరయు • నప్పుడు గాన తక్కనేసి యా
పతి పతియే తలంప మగ • పాడిమొ లోకముపాడియే భవ
త్పతు లిటు లాచరించుట గ • దా భవదీయమనోనువర్తన
స్థితి [1]కుచితంబు వారల [2]ను • తింపఁగ నేల నిసర్గవృత్తులన్. 41

—• ద్రౌపది యర్జునునితో సల్లాపంబుసేయుట •—

తే. ఇట్లు దమ్ము నిరూపింప • నితరజనము
లకు నశక్యంబుగాఁగ న • ల్లాపరసము
ననుభవించుచు నల్లన • ల్లన లతాంగి
యరిగె నర్తనమండపో • పాంతమునకు. 42

వ. చని విరాటకన్యకలయాటఁ జూచుచందంబున నందుఁ బురంధరనంద

1 చ జ. యుచితంబు వారికి. 2 క. వారల....నిసర్గవృత్తముల్ః
ఖ గ చ. వారికి....నిసర్గవృత్తముల్.

నుం గనుంగొనునప్పాంచాలి నాలోకించి యతండును దారును దదభి
ముఖంబుగా వచ్చి యక్కన్నియ లిట్లనిరి. 43

ఉ. కీచకకోటిచేత నొక • కీడును బొందక వచ్చితమ్మ ని
న్నేచినదుర్మదుండు జము • నిం గొలువం జనె నమ్మ యంతఁ బో
కేచినసూతు లీయెడలి • కింతయపాయ మొనర్తురమ్మ పే
కొచి విరోధులం దునుమఁ • గా నిటు ముట్టుదురమ్మ నీపతుల్. 44

వ. అవి తాను మున్ను విన్నకీచకవృత్తాంతంబున కనుగుణంబుగా నుపచా
రంబులువలుకు చుండ నాబృహన్నల సైరంధ్రి కి ట్లనియె. 45

క. ఆపాపాత్ములనీచ
వ్యాపారక్రమము వార • లందఱు మృత్యు
ప్రాపితు లై వ తెఱంగును
నీపలుకుల నెఱుఁగ వలయు • నెలఁతుక చెపుమా. 46

వ. అనిన విని సైరంధ్రి సాభిప్రాయంబుగా బృహన్నల కి ట్లనియె. 47

తే. కన్నియల కాట గఱపుచు • నున్ననీకు
నకట సైరంధ్రి యిప్పుడే • మయ్యె నేని
ఖేద మెద నించుకయు లేమిఁ • గాదె సన్మి
తాననంబుతో నన్నిటు • లడుగు టెల్ల.

వ. అనిన బృహన్నల యి ట్లనియె. 49

క. నీ వలుగులపడుటకు దుః
ఖావేశము వొందనే ని • రర్థక మగుని
య్యేవపుఁ బుట్టువు పుట్టిన
నావగ పెవ్వరికి నెక్కు • వళినదళాక్షీ. 50

క. నీతోడిపరిచయము లే
[1]దే తలపోయఁగ ననింద్య • వెందుకు నీ వి
ట్లాతురవగుటకె నాకుది
నేతాపము లేదు నైజ • మెఱుఁగవు గంటే. 51

వ అని తాను నిజసహోదరులయట్లపోలె వేషాంతరంబు దాల్చినయంతియ
కాక యూర్వశి యిచ్చినశాపం బనుభవించుటకు శరీరాంతరపరిగ్రహంబు
సేయుటంజేసి రిపుమర్దనంబు తనకు వెరవు గాకునికి గుప్తహాభిజ్ఞానం
బుగాఁ దెలిపిన బలసూదనసూనుపలుకులు విని పాంచాలి యంతస్స్మిత
కమనీయకపోల యగుచు నిట్లనియె. 52

ఆ అట్ల కాక యింత • యన నేల నీమది
తెఱఁగు గొంత యేను • నెఱుఁగ కున్న
దానఁ గాను నగరఁ • దగవుమైనీవు వ
ర్తించుటయ కరంబు • ప్రియము నాకు. 53

వ. అనుచుం గన్యకాపరివృత యై యరిగి యంతఃపురంబు సొచ్చి సహోదర
మరణశోకాతుర యగు కైకేయికడకుం జనునప్పుడు. 54

సీ [2]ముదమున నెలమిసొం • పొదవి నెమ్మొగమునఁ
దోఁపంగ వచ్చినఁ • ద్రోచిత్రోచి
లలి నుల్లసిల్లుచు • లలితలోచనదీప్తు
లదర నుంకించిన • నాఁగి యూఁగి
సంతసంబునబాలి • కము లగుచెయ్వులు
దొడరఁజూచినఁ జేయ • కుడిగి యుడిగి
మనమున నుబ్బుమై • మాట నాలుకకు రాఁ
గడఁగిన నాదక • కదపి కదపి

1 క. లే, నే, 2 జ. మదమున.

తే ధీర యయ్యిట్లు సమ్మద • పూరమునకు
గఱువతన మనుబలితంపుఁ • గట్ట వెట్టి
వెలఁది యెఱుఁగనియదివోలె • వికృతిలేక
యల్లనెప్పటియట్టుల • యఱుగుటయును. 55

క. భయశోకంబులు దనదుహృ
దయమునఁ [1]బిరిగొన విరాట • ధరణీనాథ
ప్రియసంభావన సేసె వి
నయపూర్వము గాఁగ ద్రుపద • నందనకుఁదగన్. 56

వ. ఇట్లు సంభావించి య త్తరుణిందన పరిసరంబుననునిచికొని తదీయవద
నంబవలోకించి. 57

తే. నీవు చక్కనిదానవు • నెలఁత ధైర్య
రహితచిత్తులు మగవారు • రాజు దీనిఁ
దలఁచి భయమంది నిన్ను నీ • వలచునెడకు
నరుగునట్లుగఁ బ్రార్థించి • యనుపు మనియె. 58

వ అని తనమనంబునం గదిరినయనుజనియోగతాపం బుత్కటం బగు
టయు వెండియునిట్లనియె. 59

క. [2]బిరుదు గలమగలు గల రవి
తరమిడి చంపింపఁ జూచె • దవు జనములు నీ
పౌరుషునఁ బోవెఱతురు మా
పురమును రాష్ట్రింబు వెడలి • పొ మ్మెందైనన్. 60

వ. అనిన విని విరాటవల్లభకు సైరంధ్రి యిట్లనియె. 61

---

1. ట. బిరికొన. 2. చ. బిరుదు లగు.

ఉ. మందటియట్ల యింతఁ బదు • మూఁడుదినంబుల మాత్రకున్ భవ
న్మందిరవాస మియ్యకొని • నం గడతేఱు మదీయవాంఛ యం
తం దగఁ దోఁచి మత్పతు లు • దాత్తమతిన్ భవదీయవాంఛితం
బుం దలకొల్పఁ జాలుదు ర • పూర్వమనఃప్రమదంబు సేతుఱున్. 62

క. కృత మెఱుఁగుదు రుపకార
వ్రతమున వర్తింతు రెపుడు • వదలరు కరుణా
న్వితు లీనరపతికి శుభ
ప్రతిపాదను లగుదు [1]రేమి • పలుకుల సైరణా. 63

వ కావున 64

క. సైరంధ్రి యిట్టు లనుటకుఁ
గారణము దలంప నేమి • గా నోపునొ యం
చారసి బహు ప్రకారపు
చారములకుఁ జొచ్చు టుడుగు • సరసిజవదనా. 65

క. ఇదియేమి యైన నే మగు
మది నా [2]కిం తేలయనుచు • మన్నన యెల్లం
దుదిఁ జెఱుపక ప్రార్థన సే
యుదుఁగా కని నిశ్చయించు • టుచితము నీకున్. 66

చ. అనిన సుదేష్ణ యి ట్లనియె • నం తవునంతయు మద్గృహంబునం
దునికికి సమ్మతించితి ని • జోచితవృత్తిఁ జరింపు నాదునం
దనుల మదీయువల్లభు ను • దాత్తమతిం బరికించికొమ్ము నీ
మనమున కెట్టు లూఱట స • మస్తము నట్టుల చేసెదం దగన్. 67

1 చ జ. రెన్ని. 2 గ జ కించిత యేల • మన్నన... టుచితమె,

క. అని యూఱడిల్ల బలికిన
విని తొల్లిటియట్ల యుచిత • వృత్తి ద్రుపదసం
దన యుండె నట్టియెడ ని
ట్లని మోసిరి జనులు పురము • నందును భూమిన్. 68

చ. విరటుమఱంది కీచకుఁడు • విక్రమదుర్దముఁ డన్యసైన్యభీ
కరమహనీయమూర్తి బల • గర్వసముద్ధతచిత్తుఁ డెందు నె
వ్వరు సరిలేరు వీని కన • [1]వాలినవండిమగండు సూడ న
చ్చెరు వగుచావు సచ్చె నటు • సేసినవారలు యెట్టివీరులో. 69

తే. సింహబలుఁడు గంధర్వుల • చేత నొక్క
సతికిఁగా నిట్లు ఘోరంపుఁ • జావు సచ్చె
నకట రిత్తకు రిత్త మ • ర్త్యావనీశు
లావు గోల్పోయె సూతకు • లంబు వొలిసె. 70

వ. ఇవ్విధంబునం బ్రవర్తిల్లుజనవాదంబు గ్రమక్రమంబున సమస్తదేశం
బుల [2]నెరసి చెల్లుచుండె నట్టియెడ. 71

• దుర్యోధను నివేగులవారు పాండవులవెదకి కానక వచ్చుట •

ఉ. పాతకి యైన సుయోధనుఁడు • పాండుతనూజులు నల్వు చున్నయ
జ్ఞాత[3]విధివ్రతంబు గలు • షంబుగఁ జేయఁ దలంచి పంచినన్
భూతల మెల్లఁ జూచిమను • వోయెదునప్పుడు సెప్పుకొన్నసం
కేతపుఁజోటఁ గూడఁబడి • ఖేదముఁ బొందుచుఁ జారు లందఱున్ 72

వ. మగిడి వచ్చి హస్తిపురంబునొత్తెంచి. 73

1 గ. వ్రాలిన, 2 ఘ. నెగసి, 3 ఙ. వృథా.

సీ. వరుస నేనుంగులు • గురిసినదానధా
రావలి చగుకల • యంపి గాఁగ
రాజుల సందడి • రాసినతొడవులు
మురిసి రాలినపొడి • ముగ్గుగాఁగఁ
గాంతలసంపల • గతిఁ ద్రెస్సి తొరఁగిన
హారముల్ పుష్పోప • హారములుగ
నే మేము యని యోలి • నెత్తినపరదేశి
చొరఁపావడములు • తోరణముగ
తే. సహజమైన యలంకార • మహిమ నతిశ
యిల్లి మహనీయ వైభవ • మెసక మెసఁగ
వఱలు నరపతిమందిర • ద్వారభూమి
సేర నరిగి యావేగుల • వారు ప్రీతి. 74

వ. సముచితంబుగాఁ బ్రవేశించి. 75

తే. ద్రోణగాంగేయభానుజ • సూను కృపసు
శర్మదుశ్శాసనులు సర్వ • సైన్యపతులు
నార్యజనములుఁ గొలువమ • హార్హకాంచ
నోన్నతాసనమునఁ గొలు • వున్నవాని. 76

స్రగ్ధర. మౌళిస్రక్సంగరంగ • న్మధుకరపటలీ • మానసాకృష్టివిద్యా
శాలిస్ఫారాబ్జరేఖాం • జలి పుటఘటనా • చారుఫాలస్థలక్ష్మీ
పాలశ్రేణీవిశాలాం • బకకుముదవనీ • బాంధవాయత్తచంద్ర
శ్రీలీలాగాఢకాంతి • స్మితవదనరుచి • స్ఫీతు నాగేంద్రకేతున్. 77

వ. కని జయజయశబ్దపూర్వకంబుగా సాష్టాంగదండప్రణామంబు సేసి. 78

క. మొగిచిన చేతులు ముందల
నిగిడించి నితాంతవినయ • నిరతిం జారుల్
దగ విన్నవించి రి ట్లని
జగతీశ్వరునకు నిజప్ర • చారం బెల్లన్. 79

క. దేవర యూవతిఁ బాండవు
లేవురు ద్రౌపదియు నున్న • యెడ యే నరయం
గా వెదలివారు సనినమ
హా[1]విపినంబులకుఁ దొలుత • నరిగితిమి వెసన్. 80

వ. అందు.

ఆ. [2]పరఁగుపొదరు పొదరు • పల్లంబు పల్లంబు
గ్రామ గ్రామ దుర్గ • మంపుఁజోటు
దుర్గమంపుఁజోటు • దొన దొన గుహ గుహ
యాది గాఁగనెందు • నరసి యరసి. 82

వ. ఒక్కయెడ నరదంబు లరిగినచొప్పు గాంచి దానివెంబడిం జని చని 83

క. కేవలసూతులతోడన
పోవుట గని వారిఁజేరఁ • బోవక యది యిం
కేవంకఁ బోవునొకో యను
భావనఁ బోయితిమి దాని • పజ్జన యేనున్. 84

వ. అదియును ద్వారకానగరంబున కరిగిన. 85

క. అందుల నుండుదు రనునా
నం దెల్లముగాఁగఁ బెక్కు • చందంబుల ము
ట్టం దిరిగి తడవి కుంతీ
నందనులం గాన లేక • నానాభంగిన్. 86

1. జ. విపినంబునకు, 2 క. పఱపుఁబొదరు.

వ. విచ్చి పోయి సప్తదేశంబులుం గలయం ద్రిమ్మరి కొందొకయు
నుపేక్షలేక [1]వరువుతోడిద కాఁ బరికించుచు బయలను నాలస్యంబుదక్క-
యోలంబునట్ల శోధించుచుఁ [2]గి డయిన నుదాసీనత యుడిగి
మేలుచందంబున భావించుచు వివిధ ప్రకారంబు లయినబహు
ప్రదేశంబులు రోసి కౌంతేయులం గానక సంకేతస్థలంబునం గూడికొని
మావర్తించిన తెఱంగు దేవరకు నెఱింగించి యట దివ్యచిత్తంబున
నవధరించినభంగి సేయువారమై చనుదెంచితిమి మాకుం జూడఁ
బాండవులు పొడవడంగి లేకపోయిరి గాని యాలోకంబున నునికిఁ
గలిగిననగపడకుండ నేర రిది యిక్కార్యంబునున్నరూపు మఱి యొక్క-
విశేషంబునం బ్రియం బంది వచ్చితిమి చిత్తగింపుము.

సీ. మత్స్యదేశాధీశు • మఱఁదిఁ గీచకుఁ డు,
జ్యోజ్జ్వలాకృతి యగు • నొక్కవనిత
రతమున నడు రేయి • గంధర్వు లతిరహ
స్యప్రకారంబునఁ • జంపి రదియు
నక్కజం బాయుధ • [3]వ్యవహార మేమియు
లేదు శరంబు గా • ల్గేలు దొక్క
లోనికిఁ దూరఁ ద్రోచి • పీనుంగుముద్దగాఁ
జేసి వైచిరి దుష్ట • చిత్తులైన
తే. యతనితమ్ముల నొక్కరి • నైనఁ దప్పి
పోవ నీక యారాత్రియ • పొదివి చిత్ర
నిహతిఁ దెగఁ జూచి యనిరూప • ణీయదుర్ని
వార వృత్తిమై నరిగిరి • కౌరవేంద్ర. 88

వ. విరాటుండు పగతుండు గావునఁ దదీయవ్యసనం బెఱిఁగింప వలయునని

---

1 ఘ. వెరవు. 2 ఖ. గిదు నుదాసీనత, 3 గ. వ్యాపార.

విన్నవించితి మది యట్లుండెఁ బాండవుల నన్వేషించుపని [1] యిటమీఁ
దం జిత్తగించు తెఱం గాన తిచ్చునది యనిన విని యట్ల చేయుదము
గాక, యని వారలఁ బోవం బనిచి కొంతసేపు చింతాక్రాంతుం డై
యమ్మహీకాంతుండు మంత్రులం జూచి యి ట్లనియె 89

తే. సమయసముచితకృత్యంబు • చక్కఁ జేసి
పాండవులు రాజ్యమున కాస • పడక మున్న
యరసి యెఱిఁగి యరణ్యంబు • నందుఁ దొంటి
యట్ల యిడుమలఁ గుడువఁ బో • నడువవలయు. 90

క. ఎఱుఁగుట దుర్ఘటమెవ్విధి
నెఱుఁగంగా వచ్చు మీర • లెల్లను మీ మీ
యెఱిఁగినచందంబున నా
కెఱిఁగింపుఁడు వారి వెదకి • యెఱుఁగు తెఱంగుల్. 91

వ. అనిన రాధేయుం డి ట్లనియె. 92

ఆ. వివిధదుర్నిరూప • వేషముల్ గైకొని
నిఖిలదిశలయందు • నిపుణవృత్తి
[2] నెఱుఁగునట్లుగా న • నేకులఁ బుచ్చిన
నెల్లి నేఁటిలోన • [3] నెఱుఁగఁబడరె. 93

క. అనుపలుకులు విని దుశ్శా
సనుఁ డేమియు సరకుగొనక • సమద [4] విలాసా
ననుఁ డై నిజాగ్రజన్మునిఁ
గనుఁగొని యి ట్లనియె గాఢ • గర్వస్ఫూర్తిన్. 94

---

1 చ. కిఁక, 2 బ. నేఁగునట్లుగా, 3 క గ. నెఱుకపడరె, 4 జ. వికాసా.

చ. వలవదు రోయఁ బాండవుల • వారొక [1]యాఁకట లేని [2]ప్రతిష్ఠటన్
బల మతి వన్య సత్త్వముల • పొల్పడి చచ్చినచోటఁ బూరియు
న్మొలవదె యింత కింకిటమ • నోపుక మస్థళితంబు గాఁగ వి
చ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగు • చందమునం గొనియాడు మున్నటిన్.

వ. అనిన విని దరహాసితవదనుం డగుచుఁ గుంభసంభవుం డి ట్లనియె. 96

ఉ. క్షాత్రసమగ్రు లార్యనుత • గౌరవదీప్తు లుదాత్త దైవబల • భవ్యులు దివ్యసమాసు లా పృథా
భ్రాత్రు లుదాత్తదైవబల • భవ్యులు దివ్యసమాసు లా పృథా
పుత్రులు వారి నాపదలు • పొందునె యోపిన నింత నైన నీ
ధాత్రిఁ గడంగి యూరయుఁడి • ధంబులు సెప్పుఁడు నేర్పుతేర్పడన్.

-భీష్ముఁడు దుర్యోధనునితో ధర్మరాజు సుగుణంబులఁ జెప్పుట-

వ. అనిన నాతని మాట లాదరించి భీష్ముం డి ట్లనియె. 98

ఉ. నల్లవొ నిక్క మాడె నృప • నందనుముందట ద్రోణుఁ డొక్కఁడుం
దెల్లము వారు బాహుబల • ధీబలదైవబలంబు లొప్ప న
త్రిల్లుదు రమ్మహాత్ముల క • రిష్టము లేమిట నెందు నేల పా
టిల్లెడు వారిఁ [3]గాన్పను గ • డింది తదీయమహానుభావతన్. 99

క. వారలును వీరలును నా
కారయఁగా నొక్కరూప • యైనను గార్యం
బీ రెఱిఁగింప వలయు నని
కౌరవపతి నన్ను నడిగెఁ • గాన నితనికిన్. 100

క. కలరూ పెఱిఁగింపంగా
వలయుం జెప్పెద మదీయ • వచనములు హితం

---

1 క గ. యాఁకువ, యుద్ధ్కవ, 2 క. ప్రిమ్మటన్. 3 క. గాంచుట.

బులు గాఁగ నిశ్చయస్థితిఁ
దలఁచి యనుష్ఠింప బుద్ధి • దలకొనునేనిన్. 101

సీ. బ్రాహ్మణ భక్తియుఁ • బరహిత[1] శక్తియు
నిర్మలమతియును • నీతిరతియు
సత్యభాషణమును • సాధుపోషణమును
జిరవితరణమును • సేవ్యగుణము
సన్మార్గరక్షయు • నున్మత్తశిక్షయు
నంచితోదయము గృ • పాతిశయము
బంధుసంప్రీతియు • భవ్యవిభూతియు
[2]శాస్త్రోపగమము స • న్నుతదమము
తే. సజ్జనస్తవనీయసౌ • జన్యములును
ధర్మసంచితబహుధన • ధాన్యములును
గలుగు వక్షీణపుణ్యుఁడో • హాలుఁడు ధర్మ
సూనుఁ డున్న దేశంబున • మానవులకు. 102

క. మఱియును నొక్కవిశేషం
బెఱిఁగించెద వతనియున్న • యెడ గోధనముల్
మెఱుఁ గెక్కి పాఁడి నేమిం
గొఱఁతపడక యుండఁ జేఁపు • గురియుచునుండున్. 103

వ. కావున నిట్టిదేశం బిప్పు డెయ్యది యగు నందుఁ గుంతీ తనయుల వర
యం బనుపవలయు ననినఁ గృపాచార్యుం డి ట్లనియె. 104

క. అరయఁగ నయ్యెడు తెఱఁగుల
నరయుట కార్యంబు వారి • నాలస్యము లే

1 చ. జ. యుక్తియు, 2 జ శాస్త్రానుగమము.

కరయునది పెక్కుఖంగుల
నరసినఁ దోఁచెదరుగాక • యది య ట్లుండెన్. 105

ఉ. వారలు పూనినట్ల వన • వాసము సల్పిరి [1] పిదప వేచి త
మ్మారయఁగా బయల్పడని • యట్లుగ నుండెడువత్సరంబునుం
[2] జేసపచేరువల్ గడచెఁ • జిత్తములం గలుషంబు లచ్చుపా
వీరుల కీనృపాలునెడ • వీరికి మూరక యున్కి గర్హమే. 106

క. అలు చైనను బగతునిదెసఁ
దలఁపు గలుగవలయు ననిన • దర్పోజ్జ్వలదో
ర్బలు లగుకౌంతేయుల మన
మెలమికలిమి నచ్చి యిట్టు • లేమఱ నగునే. 107

చ. మనబల మెంత యంతయు స • మగ్రసముద్యమదుర్గమంబుగా
మునుమును గూర్చి తోడుపడు • మూఁకలతుం దగుమైఁ గ్రమక్రమం
బున నెఱిఁగించి దాఁ బనిచి • భూరిసముజ్జ్వల సైన్యజృంభణం
బున [3] నెర వొంది యున్కి కురు • భూపతి కిప్పటి కార్యమారయన్.

ఆ. పాండురాజసుతులు • దానమై నడవడి
గడచి కయ్యమునకుఁ • గాలు ద్రవ్వ
కున్నయట్టు లైన, నిన్నరనాథుతో
సంధి సేయు టొప్పు • సముచితముగ. 108

క. ఏవి చలంబున [4] నొంటికిఁ
జూచిన నప్పటికి మనకుఁ • జూడం గార్యం

---

1 ఘ. పైరులేవి... నుండిరి, వత్స, 2 క గ. జేరువసేరువం.
3 గ. వెరవొంది. 4 చ. నేటికిఁ.

బేచందంబున నెఱుఁ గగు
నాచాలుట కోర్వవలయు • నది యట్లుండెన్. 110

క. వారలు [1]తేరఁజె వో పెఱ
వారలఁ దగుభంగి మనకు • వశ్యులఁ జేయన్
భూరిబలయుతుల మగుటయ
కారణ మను టనుమతంబు • గాదే మనకున్. 111

తే. ఇవ్విధంబున నమతము • యెఱుఁగు తెఱఁగు
లందఱును జెప్ప విని కురు • నందనుండు
దగ విచారించి కార్యంబు • తెగువ గాంచి
యెలమి వారలఁ గనుఁగొని • యిట్టు లనియె. 112

ఆ. సింహబలుఁడు భీము • సేమండు శల్యుండు
హలధరుఁడు సమాన • బలమువార
లొండొరులను గెలువ • నుత్సాహమునుగల
[2]రుద్ధతులనుబాహు • యుద్ధపరులు. 113

క. ఈనలువురభుజశక్తుల
తో నెనయఁగ జాలునట్టి • దోర్బల మెందుం
గానము గావున వీరల
లోనన యొండొరుల కని గె • లుపు సమకూరున్ 114

ఉ. తక్కినవార లాతనికి • దవ్వులచోటులవారు వాయుజుం
డొక్కఁడ యింక సింహబలు • నుద్ధతి మాన్పిన మాన్పవాఁ డతం
డక్కడ నిల్చెఁ గావలయు • నాసతి ద్రౌపది గాఁగ నోపు నే
డొక్కరుఁ డాజిఁ గీచకుల • నోర్వఁగఁ జాలమి మీరెఱుంగరే. 115

1 ఙ. వేఱఁట వో. 2 గ. యుద్ధతులను.

క. గంధర్వు లనునెపంబున
నంధతమసగూఢవృత్తి • ననిలసుతుఁడు గ
ర్వాంధమతి యైనసూతు స
బాంధవముగఁ జంపెఁ గాక • పలుకు వశమే. 116

వ. పితామహుం డుపదేశించినలక్షణంబు లద్దేశంబునం గలిగియుండు టవి
విందుము పాండవులు ప్రచ్ఛన్న వేషంబున విరటుప్రోల వసియించిన
వారు గావలయునతండును బ్రతిభటుం డగుట భంగించుండుం గావున
నతనిపయి నెత్తిపోయి తదీయ గోధనంబుల గ్రహించిన ధర్మతన
యుండును దమ్ములు నడ్డపడం బఱతెంతు రయ్యవసరంబున మనము
సమయభంగంబు సెప్పి వారలం గ్రమ్మఱం బంద్రెండు వత్సరంబులు
వనవాసంబు సలుపం బుత్తమన్నైన నప్రతిహతంబుగఁ జతురంత
భూచక్రం బాక్రమించి కీర్తనీయులమై వర్తిల్లుదుము కుంతీనందను
లందు లేకతక్కిన మత్స్యపతిసమస్తవస్తువులును జూఱకొందు మది
యును లాభంబ యెల్లభంగుల నప్పటి కిది మా కార్యంబు మీకు
నందఱకుం జూడఁబోలునేని దీని కనురూపం బగునుద్యోగంబు
సేయుం డనినఁ ద్రిగర్తాధీశ్వరుం డగుసుశర్మ దొలుతఁ గర్ణ దుశ్శాస
నులతోఁ గొంకొక ప్రసంగించి వారలయనుమతి నవనీపతితో
విట్లనియె. 117

క. కేకయ[1]సాల్వులు దోడుగ
నాకీచకుఁ డాజి నన్ను • నపజితుఁ జేసెం
గా కుంద మున్న యొక[2]పరి
నా కాతనితోడ భండ • నము లే దయ్యెన్. 118

1 ఖ. సాల్వుడు. 2 క. మరి.

ఉ. భంగముతోడ నున్ననను • బంపు విరాటునిమీఁద భూమికిం
జెంగట నుండు నా దయిన • జీతపుటాళ్ళులు సంతతంబు వా
నిం గడు గాసిజేయు నత • నిం జెఱుపం దలఁ యయ్యె నుట్టి స
ప్తాంగముఁ జూఱదెచ్చెద న • హంకృతి యెల్ల నడంచి వచ్చెదన్ 119

ఆ. ఉద్దవిడిన పసుల • నూఁచముట్టుగఁ దెత్తు
నతఁడు వెనుక వచ్చి • యడ్డపడిన
చోటఁ బాండురాజ • సూనుల నరయుదు
నెల్లభంగి దీని • కేన తగుదు. 120

వ. అనవుడు. 121

క. బరవసముమైఁ ద్రిగర్తే
శ్వరుఁ డి ట్లను టుచిత మింక • జననాయకుఁ డె
ప్పరుసున నానతియిచ్చెను
వారలే మని రట్ల చేయఁ • దుదిఁ గార్య మగున్. 122

చ. అనునిపసూనుమాట విని • యందఱఁ గన్గొని పెద్ద లెల్ల ని
వ్వనుమతి పేయ సైన్యముల • నన్నిటఁ బన్నఁగఁ బంపు రెండు మే
ల నడత మీత్రిగర్తులబ • లంబుల ముందటఁ బంచి వానిపో
యినమఱునాఁడు పోద మని • యెం గురునాథుఁడు దుస్ససేనుతోన్.

చ. అనుటయు ఫారభాగకలి • తాంజలి యై యతఁ డట్ల చేయువాఁ
డ ననిన మేదినీశుఁడు దృ • ఢం బగు నిశ్చయ మెల్లవారుఁ గై
కొనుటకుఁ గార్యబోధమున • కుం దగఁ [1]జుట్టల నున్నవారలం
గనుఁగొని యాదరాధికన • గౌరవ[2]భావనతోడ నిట్లనున్. 124

1 చ. జుట్లను నున్న. 2 గ. భాషలతోడ.

ఉ. మున్ను సుశర్మ దాను బల • ము౦ జని గోవులఁ బట్టువట్టినన్
వెన్నడి [1]వచ్చు మత్స్యపృథి • వీపతి సేనల నెల్లఁగొంచు శౌ
ర్యోన్నతి నూపువాఁ డయి స • ముద్ధతిమై నిట వేఱ కౌరవుల్
గొన్నిటఁ బట్టఁ గయ్యమున • సం బఱతెంతురు పాండునందనుల్

ఉ. కందువ సెప్పి యొక్కెడఁ ద్రి • గర్తులు [2]దాడికిఁ గూడువారు మీ
రందఱు వేఱ యొక్కయెడ • నాజికి సేనలఁ గూర్చుఁ డెల్లవాఁ
డుం దనవారిఁ దోకొని క • డున్ రథసంబునఁ గూడి వా ర్తకున్
ముందఱఁ బోయి గోధనము • ముట్టుకొనన్ వలయున్ మహోగ్రతన్

వ. అని చెప్పి వెండియు సుశర్మం జూపి. 127

క. బహుళాష్టమి నీతఁడు స
న్నహనముతోఁ బసులఁ బట్టు • నవమిని మనగో
గ్రహణ మని నిశ్చయించిన
నహికేతనుపలుకులకు మ • హాహ్లాదమునన్. 128

వ. సమస్తపరిజనంబులును సముద్యుక్తులై రట్టిసమయంబున. 129

ఆ. పాండురాజసుతులుఁ • బాంచాలియునుదమ్ము
నొరులెఱుంగకుండఁ • దిరుగవలయు
దుష్కరంపుటేఁడు • దుది సేరఁ బాపె నె
వ్వరును దీనిఁ దలఁప • వలను లేర. 130

— సుశర్మ దక్షిణగోగ్రహణంబు సేయుట —

వ. సుశర్మయు నేలినవానిపనిఁ బోనిజోడుపక్కెరకై దువు లొసదు రవణంబు
మొదలై నసవరణంబులం జూడనక్కజంబుగాఁ గూడి పరదేశం బాపో

1. మ. వచ్చి... నూపువాఁ డటు నముద్ధతి. 2. దాడిగఁ.

శనంబు గొనం దమకించుతనబలంబుగజిబిజి యుడిపికొని గోగణంబుల యటపా టూహించి జతనంబుతో నడచుచుండియు వెపగుందక నేగిరంపుఁబయనంబు లయ్యును బ్రజల నోలాటపడనీక యెత్తెడు చోట్లను విడుదలలయందును లోనుగా నిస్సాణాదు లైన యుద్భట చిహ్నంబులు ప్రకటింపక దాడిమెయిం జని వేగులవారివలన విరాటు తొట్టు లున్నయెడ యెఱింగి కదుపులం [1]గార్చిచ్చుచందంబునం బొదివి విలిచిన. 131

శా. కూడం బాఱి సముద్ధతిం గడఁగి త • ద్గోపాలకుల్ మూఁర ల
ల్లాడం దాఁకి నిశాతసాయక పటు • వ్యాపారఘోరంబుగా
నీడం బోక పెనంగినం గని త్రిగ • ర్తేశుండు చే వీచుడుం
గ్రీడాఘాతనిరూఢి నాశ్వికులు వా • రిం దున్మి తూఁటాడినన్. 132

వ. [2]వారలలోన. 133

చ. అసదుగఁ దాఁకి మేనఁ దఱ • చై పొరి నెత్తురుగ్రమ్ముపోటులన్
వస మఱి తూలు చుండియును • వారనిభీతిఁ బదంబులం గడున్
వెస[3] కలిమిం బురంబునకు • వేగమె కొందఱు వారి మత్స్యనా
థుసభకు నేఁగి దీనదశ • తోఁ బ్రఱమిల్లుచు నార్తమూర్తులై. 134

క. కారణ మెయ్యది యగునొకొ
వీరలదురవస్థ కనుచు • నెఱఁగందెడునా
ఘోరమణుఁడు సభయును విన
నీరెలుఁగు దలంకఁ బల్కి • రిట్లనిగోపుల్. 135

1. గ. గొంతారంబుఁ గార్చిచ్చుపొదువుచందంబున 2. క. వార లాలోన, 3. చ. జ. కడిమిం

చ. హయరథదంతిసంతతి ని • రంతరదుర్గమలీలఁ బేర్చి నే
లయవిసి మ్రోఁగిన ట్లగుబ • లంబులతోడఁ ద్రిగర్తు లెంతయున్
రయమున గోవులం బొదివి • రక్షకు లొక్కట నార్చి తాఁకినన్
భయదమహాస్త్రశస్త్రపటు • పాతపరంపరఁ ద్రుంచి యుద్ధతిన్. 136

క. గోవులకు వెనుకయై వెసఁ
బోవుచు నున్నారు గడవఁ • బోవక యుండం
బోవలయు నడ్డపడియెడు
దీవస [1] మెదఁ గలిగినేని • దేవర కడఁకన్. 137

వ. అనిన విని విరాటుం డదరిపడి. 138

శా. ఏమీ నిక్కమె మున్నెఱుంగఁడె త్రిగ • ర్తేశుండు మద్గోధన
స్తోమంబుం గొనిపోవుతెంపునకు ను • ద్యోగించెనే మేలు మే
లామైతోడనె పోవుఁగాక యని పీ • రాలాపముల్ వల్కి యు
ద్దామక్రోధశిఖాకలాపవికటో • ద్యద్భ్రూకుటిస్ఫూర్తియై. 139

— విరాటుఁడు సుశర్మఁమీఁద యుద్ధము సేయఁబోవుట —

చ. సచివులఁ జూచి యిప్పుడ వె • సన్ మన మెద్యక తక్కినం బశు
ప్రచయము దప్పి పోవుఁ దుది • భంగము నేగియు వచ్చుఁ గాన మీ
రుచితవిధాన [2] సత్వరత • నుద్ధతయోధసమగ్ర వాహినీ
ప్రచలితభూమిభాగము [3] గఁ • బన్నఁగఁ బంపుఁడు దండనాథులన్. 140

వ. అని నియోగించి. 141

శా. యానప్రక్రమసూచకంబు లగుతూ • ర్యంబుల్ దిశాపాటన
ధ్వానస్వైరవిహారకల్పితసము • ద్రక్షోభముల్ గా ధరి

1. ఘ. మేత్తెఱయుఁ గలుగుదేవర. 2. చ. జ. తత్పరత. 3. గ. న.

త్రినాథుండు రణోచితోద్యమము సం • ధిల్లంగ శస్త్రాస్త్రవ
ర్మానీతిక్రమదక్షులం బనిచె న • య్యైవారికిన్ గ్రక్కునన్. 142

ఉ. సారథిఁ జూచి నీవు రథ • సంబునఁ బూన్పుము ఘోటకంబులం
దేరఁ దదీయవర్మము ల[1]తిస్ఫుట బంధము గాఁగఁ బెట్టు నీ
వీరవచోవిలాసములు • విందుము మున్నిదె వచ్చెఁ గయ్య మే
పారఁగఁ జూపు నీ దగున • హంకృతికిం దగుధైర్య మియ్యెడన్.

వ. అని పనిచి తానును యోధవీరోచితప్రకారంబున సింగారంబు సత్వరంబుగాఁ జేసికొని ఖచితకాంచనబిందుసందోహం బగు సన్నాహంబు వెట్టికొని విరచితాలంకారచక్రంబును బద్ధపరికరకూబరాక్షయుగాద్యవయవంబును [2]బ్రతికల్పితతురంగంబును సన్నివేశితవివిధాయుధంబును సన్నద్ధసారథికంబును నైనరథం బెక్కి గోగణహరణప్రదేశంబు పశుపాలకులం దెలియ నడుగుచు వెడలునప్పు డమ్మత్స్యపతియను జన్ముండు. 144

శా. లోకస్తుత్యవిభూతి నన్యవృతనా • లుంటాకబాహాబల
శ్రీకల్మిన్ రథదంతిఘోటకభట • శ్రేణీసముద్దాంత సే
నా[4]కల్పధ్వజవిభ్రమంబున [5]సుహృ • ద్వ్యగ్రోద్యముం డై శతా
నీకుం డుద్దతి నేఁగుదెంచె నఖిలా • నీకంబు నుప్పొంగఁగన్. 145

ఉ. ఆతనితమ్ముఁ డై నపది • రాశ్వుఁడు కర్ణఝళంఝళాసము
ద్ధూతబలోత్థరేణుపరి • ధూసరితాంబర మైనవారణ

---

1. జ. బద్ధము గాఁగ. 2. క. గ. ఖచిత .... సందోహసుందరంబగు మైమఱువు వెట్టుకొని 3 గ. బ్రకల్పిత, 4 క.ఖ. కల్పోజ్జ్వలవిభ్రమంబున 5. గ. చ. మహోద్య తోగ్రోద్యముండై.

వ్రాతము గొల్చి రాఁ గడఁగి • వచ్చె సముజ్జ్వల హేమవర్మని
ర్యాతరుచిచ్ఛటాపటలి • రంజిత హేతిసహోగ్రసైన్యుఁ డై. 146

తే. అతనియనుజుండు సూర్యద • త్తాహ్వయుండు
సమదసైనికనానాస్త్ర • శస్త్రబహుళ
దీప్తిజాలకప్రతిహత • దినకరాంశు
రాజియై చనుదెంచె సం • రంభ మెసఁగ. 147

ఉ. తెల్లనిజోడు వెట్టుకొని • తీవ్రగతిం జనుదెంచె మత్స్యభూ
వల్లభునగ్రనందనుఁడు • వైరిసుదుర్లహవిక్రమ ప్రకా
[1]రోల్లసితుండు పన్నటల • యుద్ధతిఁ [2]గొల్చుమృగేంద్రరేఖ శో
భిల్లుచు నుండ శంఖుఁడు వి • భీషణశంఖనినాద మొప్పఁగన్. 148

వ. మఱియు ననేకయోధవీరులు వివిధవాహనారూఢులై గాఢసన్నాహంబు లగు నిజవ్యూహంబులతో నేతెంచు చుండిరి విరాటుండు బలంబులం గూర్చికొనుతలంపునం బురబహిరంగణంబునం గొండొకసేపు నిలిచె నట్టిసమయంబున ధర్మతనయుం డనిలతనయమాద్రీతనయుల నంతంతం బొడసూపి నిలువుం డని నిపుణంబుగా నియోగించి తానును మత్స్య మహీవల్లభు నల్లనచేరి యి ట్లనియె. 149

చ. ఒకఋషిచేత నాయుధప • ముక్కుర మెల్లను [3]సంప్రయోగమం
త్రకముగ నభ్యసించి సమ • రంబునసంగొలు యైనవాఁడ గో
ప్రకరములన్ మరల్చుటకు • బంధులు నీవు సబోవ నాకు నిం
టికడన యున్కి పాడియె ఘ • టింపఁగఁ బంపు రథంబు చయ్యనన్.

క. అనిన విని యయ్యకొనున
మ్మనుజాధీశ్వరునితోడ • మఱియు నతం డి

1 ఘ. శోల్లసితుండు. 2 గొల్వ మృగేంద్రరేఖ. 3 క. సంప్రయోగ.

ట్లనుఁ బవనతనయుఁ గవలం
గొని సమరంబునకుఁ బోవఁ • గోరెడుమదితోన్. 151

సీ. మనవలలుండు లా • వున బంటుతనమున
జను లెఱుంగఁగ నడి • సన్నవాఁడు
మంచిమగండు దా • మగ్రంథి యనమనం
గ్రామకేళీగాఢ • కౌతుకుండు
విషము తంత్రీపాలుఁ • డును దుర్దమారాతి
మర్దనచాతుర్య • మహితభుజుఁడు
మున్నును వీరలు • మువ్వురకడఁకల
కొలఁదు లే నెఱుఁగుదుఁ • గొంతకొంత

తే. యెక్కఁ దగునట్టియరథంబు • లిచ్చి వీరి
ననికిఁ దోకొనిపోక కా • ర్యంబు నాకుఁ
జూడ ననవుడు మేదినీ • శుండు హర్ష
నిర్భరాత్మకుఁ డై శతా • నీకుఁ జూచి. 152

వ. కంకవలలదామగ్రంథితంత్రీపాలురం జూపి యి ట్లనియె. 153

మ. రథముల్ మంచివి గాఁగ నాలు[1]గతి శీ • ఘ్రవ్యాప్తిసత్త్వంబులం
బ్రథితం బైనతురంగమోత్కరము సం • గ్రామార్హ్వ చాతంబు ల
శ్లథవర్మంబులు వీరి కిమ్ము రణలీ • లాదక్షతన్ మన్మనో
రథముం దీర్పఁగ వీర లోపుదురు దో • ర్గర్వం బఖర్వంబుగన్, 154

వ. అనిన నతం డట్లు చేయుదు నని వారలం దోడ్కొనిచని సమస్తంబును సన్నద్ధంబుగావించి యంగరాగమాల్యాభరణంబుల నలంకృతులం

---

1 చ. వతి,

జేసినం గైకొని తమతమయంతపట్టునుం గూడుకొని సూతిభృత్యంబు
లకుం దార చాలి రథంబులు దోలికొని చనుదెంచిరి తదనంతరంబ.

సీ. గంధదంతావళ • కర్ణమారుతహతిఁ
గాంతారములు చాఁప • కట్టు పడఁగ
రథఘోషమునఁ బ్రతి • రవ మిచ్చునద్రులు
భయమున వాపోవు • భంగి నుండఁ
దురగఖురోద్ధూత • ధూళి [1]ద న్పొరసిన
వననిధి పిండలి • వండుగాఁగ
బహుళపదాతిదు • ర్భరభార మడరిన
నురగకూర్మంబు లొం • డొంటిఁ బొంద

తే. సైన్యముల నడపించె ను • త్సాహలీల
యతిశయిల్లంగ సంరంభ • మగ్గలింప
బరవసము మిక్కుటంబుగఁ • బసులు సన్న
జాడగైకొని యమ్మత్స్య • జనవిభుండు. 156

వ. ఇట్లు చని కూడముట్టిన. 157

క. విరటుబలంబు ద్రిగర్తే
శ్వరుబలముం జెలఁగ నార్చి • వడిఁ దాఁకె భయం
కరనాద మేదురము లగు
శరనిధు లొండొంటిఁ దాఁకు • చందం బమరన్. 158

మ. గుణరావంబుఁ గృపాణఘట్టనరవ • క్షోభంబునుం గింకిణీ
క్వణన[2]వ్యావృతహేషితస్వనములున్ • ఘంటానిరాదాత్తహో

1 ఘ. ద న్పొరసిన, 2 క. వ్యాపిత.

షణనానాపటుబృంహితధ్వనియు శ • శ్వద్గాఢమై పేర్చినన్
రణనం బించుక దోఁప లేద బహుతూ • ర్యశ్రేణినా సేనలన్. 159

— విరాటసుశర్మలసైన్యంబులు సంకులంబుగాఁ బోరుట —

వ. అట్టిసమయంబున. 160

సీ. ఒండొంటితోఁ దాఁకి • మండెడునవియును
జిందముల్ వొడి వొడి • సేయునవియు
గట్టిమైమఱువులు • దట్టముల్ గావించు
నవియును నెఱసు నో • నాడునవియు
[1]నెట్టపైఁ బడి మేని • [2]నెగయించునవియును
దలనేల డొల్లంగఁ • దాఁకునవియు
నిరుమెయిఁ [3]దొలిచి బె • ట్టిఁ [4]దూఱునవియును
నలువుర నేవుర • నాటునవియు

తే. నైనశరములు [5]గనుఁగొని • యాడి యాడి
నారదుఁడు పిచ్చలింపంగఁ • వీరకేళి
సలిపె నుద్ధతిమై ధను • ర్బలము లదరి
లావువెరవును నెఱయఁ జ • లంబు మెఱయ. 161

వ. అప్పుడు సుభటులు గడంగి. 162

ఉ. ఏటుల మ్రొగ్గువారిఁ గని • యించుక కొంకక [6]యుర్మ్మ పెంపునం
బోటులవాతఁ బోవుభట • పుంగవులన్ మది మెచ్చుచున్ వడిన్

1 గ. నేటుపై, 2 చ. నెరియించునవియును, 3 గ. గెలిచి,
4 ఖ. దూలు. 5 క. గైకొని, 6 ఘ. యమ్మ.

వ్రేటులఁ గ్రీడ సల్పి పృథి • విం బడువీరులఁ ద్రొక్కికొందు నె
చ్చోటుల నైన నగ్గలికఁ • జొత్తురు నెత్తురు వట్టు సేయుచున్. 163

సీ. ఒక్కఁడు పెక్కండ్ర • కెక్కిన విచ్చియుఁ
బొదివి 1చెఱొకపోటు • వొడుచునెడలఁ
బలువు రొక్కనిమీఁదఁ • 2బఱపిన సైరించి
నళికి పైఁబెట్టక • నిలుచునెడలు
దళము దళంబుతోఁ • దాఁకి యగ్గలికమై
నీడఁబోవక వ్రేటు • లాడునెడలు
నోహరిసాహరి • నుయ్యాలచేయఁగా
వెనుకొంచుఁ దెరలుచు • వెనఁగునెడలు

ఆ. నై యనేకభంగి • నాశ్వికసేనలు
బొమ్మలాడినట్లు • పోరుచుండె
నమరగణము సిద్ధ • సమితియు వేడుకఁ
జదల నిలిచి చూచి • సంస్తుతింప. 164

వ. ఒక్కయెడ. 165

ఉ. ఒందొరు మీఱుకోర్కి మెయి • నొక్కట 3దాసలవారు నొచ్చినన్
రెంటయి పాయ యిచ్చినయ • రిప్రకరంబులు వేఱు వేఱ యు
ద్దండభుజాబలం బలరఁ • దాఁకిన 4సంగడిఁ బాఱు చుండఁగా
గం దమరంగ నిల్చి చెలి • కాండ్రయి క్రమ్మఱ వత్తు రిద్దఱున్.

సీ. కరశీకరంబులు • కరటగళద్దాన
తోయంబులును ధరా • ధూళి గ్రుంగఁ

---

1 క జ. వేఱొక, 2 ర. బఱపి సైరించిన. 3 క. బాసవారు. 4చ. సందడి

[1]బొదవులసడి సన్న • యొదళుల [2]దెంచ న
మ్ములపెంపు గగనంబు • గొలఁదివెట్ట
బృంహితధ్వనులును • బృథులఘంటావలీ
రవములు దిక్కుల • నవులఁ ద్రోల
రోషారుణాక్షుల • రుచులును సింధూర
కాంతియు రవిదీప్తిఁ • గ్రమ్మఱింప

తే. జోదులొక్కటవాలంప • సోనగురియ
రౌద్రరసమాకృతులఁదాల్చి • రణమొనర్చు
కరణి నత్యుగ్రముగఁ గరి • ఘటలుగడఁగి
కలను పీనుంగుపెంటగాఁ • గలయఁబెరసె. 167

ఉ. అక్కజమైనశౌర్యమును • నద్భుతసంపద నొందుశక్తులుం
జిక్కనిమేనులుఁ మొనకుఁ • జెల్వగుకైదువులుం దగంగ ను
క్కెక్కనయట్టిమేటిమగ • లించుకవారణ లేక ఖేచరు
ల్వెక్కస మంద నొచ్చియుఁ జ • లింపక పోరిరి పెక్కుభంగులన్.

సీ. నాగ నాగతోఁ దాకిఁ • పగులంగ [3]నరదంబుఁ
బెఱపి యాతేరిపై • కుఱుకువారు
రథ్యముల్ వడ్డ ఏ • రథు లయ్యు నసిముద్గ
రాదుల నదరి పో • రాడువారు
సారథి నొచ్చినఁ • దేరును గడపుచు
నేయుచుఁ గయ్యంబు • సేయువారు

1. క. బొదువుల. 2. గ. దెంచి యమ్ముల. జ. దెక్కియిమ్ముల
3. క. బెడిదంబు

నరదంబుపైఁ బ్రాలి • యాలోనఁ దెలిసి త
న్నేసినాతనిఁ బడ • నేయువారు

తే. నగుచు రథినికాయంబు • లదరి యప్రమత్తనిజచిత్తవృత్తులై • మగతనంబు
ఘోరమూర్తులు గైకొని • పోరునట్లు
సలిపె సంగ్రామ కేళిసం • కులము గాఁగ. 169

వ. ఇట్లిరువాఁగును నరవాఱు గొనక పెనంగుచుండ. 170

ఉ. భీకరబాణవర్షముల • పెల్లున వైరులు [1]పెల్లగిల్ల మూ
ర్చీకృతగర్జితంబు పృథి • వీవియదంతర మెల్ల నిండ ను
గ్రాకృతిఁ గల్పసంక్షయస • హాభ్రముచందము నొందుచున్ శతా
నీకుఁడు దాఁకెఁ గంకటసు • తీవ్యతివిద్యుదుపాంతకాంతియై. 171

తే. అతఁడు నానాప్రకారశ • స్త్రాస్త్రనిహతి
నతులవిక్రమవిభవ మ • నర్గళముగ
యోధసారధియుగ్యసం • యుతము గాఁగ
నూఱురథములు వ్రేల్మిడి • నుగ్గుసేసె. 172

మ. మదిరాక్షుండు గడంగి యన్నిసబలో • న్మాదంబు రెట్టింప స
ప్రదరజ్వాలతికాక్రియాసముదిహా • ర క్రీడనం బప్పుడా
ప్పిద మై యోగవిసంధులు నిరూ • పింపంగ రాకుండఁ గ
ర్ణదశోపాంతము వింత సేయ నడరెన్ • రౌద్రంబు శోభిల్లఁగన్. 173

క. అదరి పది రథచతుశ్శతి
పొడసేసి పరాక్రమం బ • పూర్వం బై యే

---

1. దల్లడిల్ల.

ర్పడఁ గరిహయవరనికరము
బడలువడం దఱిమె నలి న • భశ్చరు లార్వన్ 174

ఉ. మండలచారి యై రథ మ • మానుషవిక్రమలీల నొప్ప ను
ద్దండభుజాబలంబు ప్రథి • తంబుగ నుత్తరుఁ డాఁకి సూర్యద
త్తుం డనివార్యశౌర్యగుణ • ధుర్యుఁడు వీఁడ యనంగఁ బేర్చి వే
దండఘటానిపాటనవి • దగ్ధతఁ బొల్చె రణాంగణంబునన్ 175

ఉ. అప్పుడు శంఖుఁ డెంతయుఁ బ్రి • యంబునఁ బెండ్లికిఁ బోవునట్లు మో
మొప్పఁగ నస్త్రశస్త్రముల • యుల్లసనంబున శత్రునేత్రముల్
గప్పఁగఁ జీఁకటుల్ రణము • ఖంబు సమస్తముఁ దాన యై రథం
బుప్పరవీథిఁ దోఁచికొని • యుగ్రగతిం బఱతెంచి తాఁకినన్. 176

తే. మందరాచలచటుల • విమర్దనమున
ఘూర్ణమాన మై గాఢసం • క్షోభ మెసఁగఁ
దలఁకుజలనిధి నాఁ బ్రిదిగ • నుత్తరక్షితీశు
బలము దిరుగుడువడియె సం • కులముగాఁగ 177

వ. అయ్యవసరంబునం దక్కినదొరలును దలపడి యతిభీషణంబుగా సంగ్రామంబు సేయం దొడంగిన. 178

చ. అనుజతనూజమంత్రిసుభ • టాప్తజనంబులపోరు సూచి నె
మ్మనమునఁ బొంగి మై పెనిచి • మత్స్యమహీరమణుండు సారథిం
గనుఁగొని [1]యల్ల గట్టిమొనఁ • గ్రాలుచు నున్నత్రిగర్తనాథుకే
తనమున చక్కటికిఁ మనర • థంబు వెసం జననిమ్ము నావుడున్,

క. అగ్గలిక నతఁడు హయముల
పగ్గంబులు సడల విడిచి • పటురయమున నా

1. క. యుల్లకంపె మొన.

మొగ్గరము దఱియఁ బఱపిన
మ్రగ్గెను రథపంచశతము • మత్స్యాధిపుచేన్. 180

మ. అవనీనాయకుఁ జూచి యేచి నలి పీ • రానేశమధ్యాంత మై
రవిసేన్ గుంతభుశుండితోమరగదా • ఖడ్గాదిశస్త్రప్రతి
ప్రవిహారంబు విరోధిదుర్విషహసం • రంభంబుగా నొక్క పె
ట్ట వఱిం దప్పల మెల్ల నారమఁడు వే • దృక్కుం గుంచె సొంపగఁన్.

వ. ఇవ్విధంబున విరాటుండు దానును సేనయుం జేయం గలవారును బర
వసంబు సేసి యొక్కుమ్మడి సడయుటయుం జెరలి పురవిసనిజసైన్యంబు
దైన్యంబు గలయం గనుంగొని కోపాటోపంబునం గెంపు గదురులో
చనంబులుం [1]బెం పొలయుభుజశిఖరంబులుం గలిగి సుశర్మ దానుం
దమ్ముండు సంగడంబుగాఁ గోల్తల సేసి రథ సమూహంబుతో విరాట
వ్యూహంబు నెదురుకొని. 182

క. బలవిక్రమములు మెఱయఁగఁ
దలపడి రథదంతిహయభ • దాతిచయంబుల్
[2]గలను సుడివడఁగఁ దామర
కొల నేనుఁగు సొచ్చినట్లు • గురువుగఁ • జొచ్చెన్. 183

ఉ. ఏలినవానిఁ గాంచి మెఱిన • తెల్లను నెంతయు దర్ప మెక్కి యా
భీలనిశాతహేతిరుచి • భీకరలీల నెదిర్చి మత్స్యభూ
పాలకసైన్యరాజిఁ దల • పడ్డ మహోగ్రతఁ జేర్చి యాసమి
త్కేళి వియచ్చర ప్రతతి • కిన్ వెఱఁ గందఁగ జేసె నెంతయున్.

తే. కడిమి [3]మెఱయంగటోదగ్రి • గర్తనాథు
రథముఁగసుఁగొనికడఁగి వి • రాటవిభుఁడు

1. ఖ. బఱ పొలయ. 2. ఛ. గలఁగి. 3. గ. నెఱయంగ.

[1]వరవునకు వల్గినట్టుల • సరకుగొనక
యతులరభసాతిరేకత • నతనిఁ దాఁకె 185

— విరాటుఁడు సుశర్మమీఁదఁ దనరథంబు తోలించి పోరుట —

వ. ఇట్లు దలపడి 186

మ. పటువేగం బగుశాతభల్లచయపం • పాతంబునన్ మింట మి
క్కుటమై మంట ధగద్ధగద్ధగ యనం • గోపంబు రూపంబులై
చటులక్రీడఁ జరించునట్లిరువురున్ • శౌర్యోన్నతిం బోరి రు
త్కటదర్పోద్ధతులై పరస్పరజయా • కాంక్షం బ్రచండంబుగన్.

క. తదవసరంబున నొక్కటఁ
బదియమ్ములు దొడి త్రిగర్త • పతివక్షంబున్
వదనంబు నేసి విరటుఁడు
మదమునఁ దురగముల నేసె • మఱియుఁ బదింటన్. 188

క. ఇంచుకయు నీడఁ బోవక
కాంచనపుంఖప్రకాండ • కాంతిస్ఫాయ
త్పంచాశద్బాణంబులు
నించె నతఁడు మత్స్యమేది • నీపతిమేనన్. 189

తే. దొరలు దలపడ్డనాహవ • దోహలమున
నుభయబలములుఁ దమకించి • యోర్వలేక
కలయబెరసి భూరేణువు • కతన రాత్రి
గాకమున్న యొండొరువులఁ • గానరైరి. 190

---

1. పరువునకు వల్గి; జ. తరువునకు నర్గి.

క. క్షతములఁ బెల్లు దొరఁగుశో
ణితము రజఃపటల మడఁచి • నెఱసిన నరుణ
ద్యుతిఁ దమము వాపువేకువ
గతిఁదత్సమయం బతిప్ర • కాశత నొప్పెన్. 191

ఉ. దానికిఁ జిత్తవృత్తులు ము • దంబునఁ బొందఁగ మేను లుబ్బఁగా
సేనలు రెండు సుద్భటవి • జృంభణతన్ వివిధాస్త్రఘట్టన
ధ్వానము దిక్కులం బరఁగఁ • దాఁకి రణం బొనరించె నత్తఱిన్.
భానుఁడు పశ్చిమాద్రిఁ గను • పట్టెఁ దలిర్చినమావిమ్రోకనన్. 192

క. సమరంబున భటులు గడు
న్నశ్రమ మొందిరి తమము గవిసి • నం గాని సము
ద్యమసంరంభ ముడుగ రిది
సమయం బని తొలగినట్లు • సవితృఁడు గ్రుంకెన్. 193

వ. తదనంతరంబ. 194

క. ముఱిముఱిచీఁకటియప్పుడు
నఱిముఱి భటు లుడుగ కదరి • యని సేయంగా
నెఱసి తమ మెల్లయెడఁ గ్రి
క్కిఱిసిన మఱి పాసి నిలిచి • రింతను నంతన్. 195

వ. ఇట్లుభయసైనికులు సాంద్ర సంతమసంబునం జేయునది లేక సంగ్రా
మంబు దక్కి తమకం బెక్కి నొక్కింతసే పూర కున్నంత. 196

క. తనమనుమలు పాండుతనయు
లని సేఁతకు వేడ్కసేయు • టాత్మఁ గని తమం

1. వ. పరువునకు నగ్గి: తరువునను నగ్గి.

బున వారు మెఱయ రని వ
చ్చినక్రియ శశి పూర్వశైల • శిఖరం బెక్కెన్. 197

క. వెలుఁగు గని కడఁగి యిరువా
గులుఁ బోరికిఁ జొచ్చె మత్స్య • కుంజరుఁడును స
గ్గ మగుపగఁటిమిసొంపునఁ
దలపడియె సుశర్మతోడఁ • దదనుజుతోడన్. 198

చ. తలపడి పోర వారియర • దంబు లనేకము లొక్కపెట్ట యి
ట్టలపురయంబునం బొదివి • డాసెఁ గడంగి వడిం ద్రిగర్తనా
థులు నిరుదేరు• దద్రథము • తోఁగడియించి తదీయసారథిన్.
బలువిడిఁ గూల్చి రథ్యముల • ప్రాణములుం గొని యుగ్రమూర్తులై.

వ. ఇవ్విధంబున విరాటుండు విరథుం డగుటయు. 200

చ. అతిరభసంబుమై నదరి • యాతనిఁ బట్టి సుశర్మ బెల్చ నా
ర్చి తనరథంబుపై నిడి య • శేషబలంబులు [1]వద్దెసన్ భయ
ద్రుతగతిఁ బాఱినన్ విజయ • దుందుభు లొక్కట మ్రోయ విక్రమో
ద్ధతివిభవంబునన్ పది ము • దం బొలయన్ మరలెన్ మహోద్ధతిన్.

వ. అట్టియెడ ధర్మతనయుఁ డనిలనందను నవలోకించి సత్వరం బగుచిత్తం
బుతో మత్స్యవిభునివలను సూపుచు ని ట్లనియె. 202

తే. ఇతని యాశ్రయమున మన • మెల్ల బ్రదికి
యున్నవారము గావున • నుగ్రరిపుల
పాలువడకుండవిడిపింపఁ • బాడియితనిఁ
నెయిదుమెయిదుము రథరయ • మెసక మెసఁగ. 203

1. చ. వ. బద్దెసన్.

చ. అనవుడు మేను వెంచుచు మ • హాబలనందనుఁ డప్పు డన్న కి
ట్లను నిదె సాలవృక్షము ర • యంబున దీని వరాతిసేన డొ
ల్ల నడచి యీసుశర్మునిబ • లంబుజలంబును మాన్పి యవ్విరా
టుని విడిపించెదన్ రణప • టుత్వము పైరులు పిచ్చలింపఁగన్. 204

తే నీవుఁ దమ్ములు నొక్కెడ • నిలిచి చూచు
చుండుఁ డని పల్కుటయుఁ బుయి • లోటతోడఁ
గీచకారాతిఁ దప్పక • చూచి నగుచు
నతని కిట్లని చెప్పె ధ • ర్మాత్మజుండు. 205

క. తరువు వెసఁ బెఱికికొని నీ
వురవడిమైఁ గవిసితేని • నుభయబలమున
చ్చెరు వందుచుఁ జూచి వృకో
దరుఁడ వగుట యెఱుఁగకున్నె • తద్విధ మేలా. 206

వ. కవలునీకుఁ జక్ర రక్షకులుగా లోకసామాన్యంబులైనచాపకృపాణగదాదులగు నాయుధంబుల విరోధివధం బాపాదించి వేవేగ విరాటు విడిపింపుము. 207

చ. అనుపలు కంటశంబునక్రి • యం గుదియించిన నిల్చి భూరుహం
బునదెస వోక మత్తగజ • పుంగవుచందమునన్ సమీరనం
దనుఁడు శరీర [1]దోశనవి • ధాపరిశోభిత విక్రమోద్యమం
బున విలసిల్లి యిట్టు లను • భ్రూకుటి ఫాల మలంకరింపఁగన్. 208

---

1. క. గ. దోలను

క. మీపనిచినట్ల చేసెద
నేసారినవైరిబలము • నెల్లను బాహా
టోపము నోర్చి మత్స్యమ
హీపతి విడిపించి తెచ్చి • యిచ్చెద మీకున్. 209

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు సంతసిల్లి తమయంతవట్టునుం గూడుకొని. 210

— పాండవులు సుశర్మ నోడించి విరాటుని విడిపించుట —

తే. తాను మున్నుగ శాత్రవ • సేనమీఁద
రథము లొక్కటఁ బఱపిరి • పృథివి యద్రువ
నుఱక యేచి త్రిగర్తులు • నుద్ధతముగఁ
జెలఁగి మార్కొని పొదివి సం • కులము గాఁగ. 211

క. ఏయుచుఁ బొడుచుచు వ్రేయుచు
దాయుచు నుద్వృత్తిఁ దఱుము • టయుఁ [1]బొడిసేసెన్
వాయుసుతుఁడు రథముల నిరు
వేయిటి రథిరథ్యసూత • వితంబులుగాన్. 212

తే. ఏఁడునూఱురథంబుల • నేపుమాపె
నకులుఁ డప్పుడు మున్నూటి • నామమడఁచె
నతనియనుజుఁడు కుంతీసు • తాగ్రజుండు
రథికముఖ్యుల వేవురఁ • బృథివిఁ గూల్చె. 213

1. క. ... పడిఁ జేసెన్....నిరువేయింటిని రథ్యసూతవితంబులుగాన్.

వ. అతండు మఱియును. 214

చ. తఱిమి సుశర్మఁ గిట్టి యతి • దారుణభంగి రణంబు సేయ వాఁ
డుఱక నిశాతసాయకము • లొక్కట మొగిం బది మేనియందుఁ గ్రి
క్కిఱియఁగఁ జేసి నాలుగిట • నేసెఁ దురంగములన్ యుధిష్ఠిరుం
డఱిముఱిఁ జంపె సారథిఁ ద • దశ్వములన్ వరబాణపాణియై 215

వ. అయ్యవసరంబున మత్స్యమహీనాథుండు జనితోత్సాహుండై. 216

ఆ. ఆ సుశర్మ తేరి • యం దున్న ఘనగదా
దండ మెత్తికొని యు • దగ్రవృత్తి
జరఠదేహుఁ డయ్యు • దరుణవయస్కు న
ట్లవని [1]కుఱికి వోయి • యతని వ్రేసె. 217

క. అట్టిసమయమునఁ గరువలి
పట్టి త్రిగర్తేశురథము • పై కుఱికి వెసం
బట్టికొని యతనిఁ బెడగే
ల్గట్టి పెలుచ నార్చెఁ దద్బ • లము పెల్లగిలన్. 218

వ. ఇట్లు సుశర్మం బరాజితుం జేసినఁ జక్రరక్షకుం డైన శోణాశ్వుండు మొదలుగా నాప్తభృత్యవర్గంబు ననుజుం డైన సువర్మలోనైన బంధుజనంబులు నాదిగాఁ గల పరివారంబు పలాయనపరాయణం బగుటయు వెనుకొని యొయ్యది గోధనవర్గంబు మరల్చి కరితురగరథంబులం దల మీఱి వొదివి తెచ్చి యన్నపాలికి వచ్చి తాను మున్ను త్రిగర్తేశురథం బుకడ నిలువ నియోగించి యన్నతమ్ములం గూర్చుకొని తమయంత పట్టును నొక్కట విరాటునకుం బొడసూపిన. 219

1 జ. కెఱఁగి.

క. ఆదరము సంభ్రమంబును
మోదంబును దనమనమున • ముప్పిరిగొన నా
భూదయితుఁడు వివిధప్రియ
వాదంబుల గారవించె • వారల నెల్లన్. 220

వ ఇట్లు సంభావించి పాండవాగ్రజు నవలోకించి. 221

క మానముఁ బ్రాణముఁ గాచితి
దీనికి సరిగాఁగ నీవు • దికిఁ బ్రియమెసఁగం
గా నాకుఁ జేయ నయ్యెడు
దాని నెఱుఁగఁ గాన మత్స్య • దము గైకొనవే. 222

తే. ఒడలు సిరియును నాకు నీ • యొసఁగినవియ
కాన దగ సమర్పించెదఁ • గరుణనీవు
సమ్మతించి యిమ్మత్స్య దే • శంబుఁ గావు
పంచి పనిగొని నన్ను ర • క్షింపుకొనుము. 223

వ. అనిన విని యజాతశత్రుం డతని కి ట్లనియె. 224

చ. మనుజవరేణ్య నావలని • మన్నన యట్టిద కాదె శత్రుమ
ర్దన మొనరించి మత్స్యనగ • రంబున కుత్సవ ముల్లసిల్ల నీ
చనుటయ నాకుఁ దేజమును • సంపదయున్ గరిమంబుఁ గాక యి
ట్లనఁ దగునయ్య యే నిచట • నైనది యేటిది యింత యేటికిన్.

క అనుపలుకులను విస్మయ
మును సంతోషమును జిత్త • మునఁ బెనఁగొన నా
జనపతి ధర్మతనూభవుఁ
గనుఁగొని యి ట్లనియె మఱియు • గౌరవ మెసఁగన్. 226

క. ఉపకారమొ బంటుతనమొ
కృపయో పెంపో సమగ్ర • కీర్తిప్రియమో
రిపుదుస్సహ మగునీరణ
నిపుణతరం గారణంబు • నెయ్యమొ యెఱుఁగన్. 227

ఉ. మంటయుఁ బోనిశాత్రవస • మాజము నించుకయేని శంక లే
కంటఁగఁ దాఁకి ¹వెండి తెగ • టార్చె మహాద్భుతశక్తి శాలి యీ
²వంటలవానిచేసినయ • వార్యపరాక్రమ మొందుచోటులం
గంటిమె వింటిమే యితఁడ • కాఁడె వెసన్ గెలిపించె నన్ననిన్.

క. కంధరములు దెగి తలలు వ
సుంధర నతిపక్వతాల • సుభగఫలాళీ
బంధురత రాలు దామ
గ్రంధి పగఱమీఁదఁ గినిసి • కవిసినయెడలన్. 229

క. ఎక్కడఁ జూచినఁ దానై
యక్కజ మగుకడిమి కలిమి • నరిసేనఁ గరం
బుక్కఱఁ దంత్రీపాలుం
డొక్కఁడ పొలియించె నీర • జోత్సాహమునన్. 230

క. ఈనలువురు దక్కఁగ మన
సేనల నొక్కరుపైనఁ • జేవ్రదనిభటుం
గానం జెలి కెద రైనం
బూని తలఁగునతఁడ చూపె • పురుషుం డెందున్. 231

---

1. వీఁడె, 2. వంటలవాఁడు సేసిన.

ఉ. కావున మీకు దంతిహయ • కాంచనరత్నవిభూషణంబులున్
దేవనితంబినీజనస • దృక్షమృగాక్షులు నాది గాఁగ నా
నావిధవైభవంబుల మ • నంబులవాంఛలకుం దగంగ నీ
కేవిధి నీఁగువాఁడ ము • మెయ్యది యేనియు వేఁడుఁ డిచ్చెదన్.

క. అనవుడుఁ బాండుతనూభవు
లనఘా యిట్లింతయుం బ్రి • యంబున సంభా
వన సేసితి మా కిదియే
ధనము వరయుదానికంటెఁ • దక్కువె చెపుమా. 233

—• ధర్మరాజు సుశర్మను సపరివారంబుగా విడిపించుట •—

వ. మమ్మెరవుగాఁ దలంచి యియ్యెడ నిట్టిపస వలపదు పురంబున కరిగి యయ్యెడ నీకెట్లు ప్రియం బట్లు మన్నింపు మని రందుఁ గంకుండు మఱియు ని ట్లనియె. 234

క. తగ నొక్కటి వేఁడెద నిను
జగతీశ్వర యిచ్చు టొప్పు • పరథగజాశ్వం
బుగ విడిచి పుచ్చు మిప్పుడ
త్రిగర్తపతి నిదియ నాకుఁ • బ్రియ మెబ్బంగిన్. 235

వ. మననగరంబునకు జంఘాలురం బంపుము పురంబున వారలు వోయి భవద్విజయఘోషంబాచరించి శోభనధ్వజోన్నయనంబును మంగళతూర్యనాదంబులును బరస్పరగంధసలిలసేచనంబును గీతవాద్యనృత్తంబులును నాదిగాఁ గలవివిధశుభాచారంబులం బ్రవర్తింపనియోగింపవలయు ననిన విరాటుండును బనిచినం గాలరులు వేగునంతకు వీటికిం జని

గెలుపు ప్రకటించి పట్టణాలంకరణ ప్రముఖనిఖిలభద్రవిధానంబులు సేయించిరట పాండవులును మత్స్యమహీవల్లభుండును సప్తసేనా సమేతులై విభవం బెసఁగ విలసిల్లుచు లజ్జావనతాసనుం డగుసుశర్మ సపరిచ్ఛదంబుగా విడిచి పుచ్చి గుత్తులకొలందికిఁ గృత్తంబు లయి పడి యున్నపాదంబుల వలనం గెందమ్ముల సెజ్జలచందంబు లగుచోట్లును దునిసి చిక్కువడి యున్నయూరుకాండంబులవలన మదగజంబులు సొచ్చినకదళీవనంబులం బోసియెదలును బ్రోవులు గొని యున్న ప్రేవులవలస లావు గలయంచపిండు పేరఁకలి పక్షిముక్షిం బెటికినఁ గుఱుకులు గట్టినమృణాళనాళంబుల నొప్పుకమలాకరోద్దేశంబులఁ గ్రేణి సేయుప్రదేశంబులును నంగుళియకరుచు లడర నెటిం జాఁగిపడి యున్న బహుదండంబులవలన నురగనివాసంబుల ననుకరించుతలంబు లును గీలాలజలంబులపయిం దేలుచు నవ్వినట్లున్నశిరంబులవలస వికచారవిందదీప్తి కల విడంబించుతావులును నవయవభేదంబు లడంగు నట్లుగాఁ దుత్తునియలై పడియున్నగాత్రఁబువలనం గృతాంతమహావ నశాలపగిది నొప్పునట్లును గలపొలిగలను గలయంగనుంగొనుచు వెడలి చంద్రికాసుందరం బగునొక్క సైకతస్థలంబున నారాత్రి పుచ్చి రని చెప్పిన విని మునిఁటివృత్తాంతం బెట్లయ్యెనో యని సాదరంబుగా నవలోకించిన. 236

క. అపరిమిత ప్రకార విని • రస్తసమస్తవికార షట్పరిమా
ణపరిమదూర గాథభజ • నక్రమగత్యనుభావసార దే
వపితృపథప్రవర్తన వి • వర్జననిర్మలచిత్తచోరా కాం
తిపరమహాత్మసంసరణ • తీర నిరంజన భక్తరంజనా. 237

క. విజ్ఞానానందరసా
భిజ్ఞ హృదయకమలహంస • భీమదురితమ
ర్మజ్ఞవివిధాభిధానా
యజ్ఞాత్మకరూప విశ్వ • లావ్యయదీపా. 238

మాలిని. త్రిజగదవననిత్య • క్రీడనోద్యత్ప్రమోదా
రజనిచరవిఘాతా • రంభలీలావినోదా
భజననిరతసౌఖ్య • ప్రాప్తిజాగ్రత్ప్రసాదా
విజతనువిభవశ్రీ • న్నిర్మలనాచ్ఛిన్ననాదా. 239

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన
విరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాట
పర్వంబునందుఁ దృతీయాశ్వాసము.



హరిహరనాథాయనమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము - చతుర్థాశ్వాసము





క. శ్రీ మదరేఖ విషాదవి
రామాహితగాఢశమధు • రానిర్భరని
ష్ఠామర్దితవివిధవికా
రామలచేతోనివాస • హరిహరనాథా. 1

భూమింజయుఁడు గోవుల విడిపింపఁ గౌరవులతోఁ
బోరుటకుఁ బో వెన్నుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

క. సూర్యోదయావసరమున
దుర్యోధనుబలము ప్రబల • దోర్బలలీలా
ధుర్యగతి నడచె భీష్మా
చార్యరవిసుతాదియోధ • సంఘోద్భట మై 3

వ. నడచి మత్స్యనగరంబున కనతిదూరంబున విరాటుపశుగణంబులం
బొదివె నట్టియెడ ముక్కడమూఁకలు నని యొక్కెడ నని
తలపడినం గృపాశ్వత్థామ శకుని దుశ్శాసన కర్ణ దుర్ముఖ ప్రముఖరధిక
జనంబులు గోపాలవర్గంబు నవర్గళ ప్రసారం బగుశరాసారంబునంగప్పి

నం గని కౌరవబలం బగుట యెఱింగి బెగ్గలించి గవాధ్యక్షుండు రథంబు
దోలికొని యాక్రోశించుచుం బురంబున కరుగుదెంచి రాజమందిర
ద్వారంబుఁ జొచ్చి రథావతరణంబు సేసి యంతఃపురంబుననున్న
భూమింజయుం గాంచి ససంభ్రమంబుగా ని ట్లనియె. 4

మ. ధరణీచక్రము సంచలింపఁగ సము • ద్ధాంతంబులై గ్రక్కునం
గురుసైన్యంబులు వచ్చి ముట్టికొనియెన్ • గోవర్గమున్ వేగమై
మరలం దెచ్చుటకుం గడంగుము రిపు • క్ష్మాపాలలోకంబు నీ
శరజాలంబులపాలు సేయుము భుజో • త్సాహంబు శోభిల్లఁగన్. 5

ఆ. తేరుఁ బూన్పఁ బంపు • తెప్పింపు దృఢతను
త్రాణ ముగ్రచాప • బాణపూర్ణ
తూణఘనగ దాసి • తోమరచక్రాదు
లనువుగా నొనర్పు • మతిరయమున. 6

చ. విరటుఁడు నిన్ను నెప్డుఁ బది • వేవురముందటఁ జెప్పు బాహుని
స్ఫురితుఁడు శౌర్యశాలి కుల • భూతివిశేషవిధాయకుండు భూ
భరణవిశారదుండు జన • భవ్యతపఃఫలసంభవుండు గా
తరపరిరక్షకుం డనుచు • దానికి నీడుగఁ జేయు మిత్తఱిన్. 7

క. అని కాంతాజనములలోఁ
దను నగ్గించుటయుఁ బొంగి • దర్పోద్ధతి ని
ట్లను నుత్తరుండు దనమన
మున సంగరకౌతుకంబు • ముడివడు చుండన్. 8

ఉ. [1]ఎత్తునఁ గొందుఁ గౌరవుల • నెల్లను మార్కొనిరేని గోవులం
దెత్తు ముహూర్తమాత్రమునఁ • దేరికి సారథి లేమిఁజేసి నా

1. క. ఎత్తెలఁ; గ. ఎత్తలఁ; జ. ఎత్తెరఁ.

చిత్తమునన్ విచారదశ • సెందెదు నెవ్వఁడు గల్గునొక్కొ నా
కిత్తఱి నేఁ గదా కడప • నెంతయు నేర్తు [1]రథం బనం బురిన్ 9

క. తగుసారథి దొరకనినం
బగతుర ఖండించు టెంత • పని కదుపుల ద
వ్వుగఁ గొని పోదురొకో యి
ట్లగునె కలండేని సూతుఁ • నరయుం డెందున్. 10

చ కురుపతిభీష్మకర్ణకృప • కుంభజముఖ్యులు మత్స్యముద్యమ
స్ఫురణము సూచి పార్థుఁ డను • బుద్ధిఁ గలంగఁగ బెట్టు గిట్టి సం
గరమున నోర్చి యేఁ బసులఁ • గ్రమ్మఱఁ దేరక యున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరి • వారముఁ జిత్తములందు మెత్తురే.

వ. అనునప్పుడు తత్ప్రదేశంబున సునికిం జేసి. 12

క. విని ద్రుపదధరణిపతినం
దన సామర్థ్యాపహాస • తరళహృదయ యై
చని తద్వృత్తాంతము [2]మె
త్తనిపలుకులఁ జెప్ప నింద్ర • తనయునితోడన్. 13

వ. అతండు నజ్ఞాతవాసవత్సరం బతీతం బగుట నిరూపించి పాంచాలి కిట్లనియె నీవు వోయి వారలతో నిట్టనుము మనబృహన్నలకుసారథ్యంబు సేయుసామర్థ్యంబు గలదు దొల్లి ఖాండవదహనంబునం బాండవమధ్యమునకు సారథి యై యతని చిత్తంబు వడసె మఱియుఁ బెక్కెడలం దదీయం బగురథంబు గడపఁ దాన యై యుండు నేను నెఱుంగుదుం దత్సాహయ్యంబునం గురుసైన్యంబుల జయింపవచ్చుటకు సంశయంబు

1. జ రథంబు నాపురిన్. 2. త. నాతనిపల్కుపల్కు.

వలన దనుము వారే మనిరేని మఱియుం దగ నాడి నన్నుం బిలిపించు నట్టి తెఱంగు గావింపు మన నట్లు చేయుదు నని సైరంధ్రి యుత్తర యున్నయెడకుం బోయి. 14

చ. జనపతినందనుండు దగు • సారథి నారయు చున్నవాఁ డెఱిం
గినపని సెప్పఁగా వలయుఁ • గ్రీడి మనంబున మెచ్చునట్టినే
ర్పును భుజశక్తియుంఁ గలిగి • రూఢికి నెక్కినసూతవృత్తిమై
నని సడి సన్నయే తెలబృ • హన్నలకుం గల దంబుజాననా. 15

తే. అర్జునునకు ఖాండవదహ • నాదు లైన
విక్రమము లాబృహన్నల • వెరవులావు
గాదె జయ మొనరించే లో • కంబు లెఱుఁగ
నువిద దీని నెఱింగింత • ముత్తరునకు. 16

క. అని యమ్ముదితయుఁ దాను
జని యతనికి న తెఱంగు • సముచితముగఁ జె
ప్పిన నక్కుమారవరుఁ డి
ట్లనియెం బాంచాలితోడ • నల్లన నగుచున్. 17

తే. అకట సైరంధ్రినను ని • ట్లాలిగొనఁగ
నేల చక్కఁగఁ గను విచ్చి • యేనుబేడిఁ
జూడ రోయుదు రణమున • సూతకృత్య
భరముదాల్చుట కెమ్మెయిఁ • బనుచువాఁడ 18

వ. అదియునుం గాక. 19

చ. కురుబల మేఁగుదెంచె [1]నపె • గోవుల బి ట్టలఁ బట్ట దానిపైఁ
బరిగొని శౌర్యసంపదయు • బాహుబలంబును జూఁప బూని యే

1. ఘ. నట

నరిగెద [1]నట్టె తెరికి బృ • హన్నల సారథి యైన దీని న
వ్వరె పురిలోన నింతకలు • వా రథచోదకు లింత యేటికిన్. 20

వ. అనిన విని సైరంధ్రి యతని కి ట్లనియె. 21

ఉ. కౌరవసేన గాదు త్రిజ • గంబులు నొక్కట నెత్తివచ్చినం
దేరు బృహన్నలావళగ • తిం జరియించిన గెల్వవచ్చుఁ ద
ద్వీరగుణంబుసొంపు పృథి • వీపరనందన ము న్నెఱుంగుదుం
గారణజన్మ మై తనువి • కారము వచ్చినఁ బెంపు దప్పునే. 22

వ. అనవుడు. 23

క. మన మురియాడుచు నుండఁగఁ
దన కౌరు లప్పటికి లేమి • ధరణీశ్వరనం
దనుఁడు బృహన్నలఁ బిలువం
బనుచుట కొడఁబడినపలుకు • పలుకుటయుఁనగన్. 24

వ. సైరంధ్రిదెసఁ గనుంగొని యేసు బోయి తోడ్కొని వచ్చెద ననిపూని.

సీ. అడుగులనునుఁగాంతి • నయ్యేడ
పద్మరాగంబుల నెలకట్టు • కరణి నొప్పఁ
బాలిండ్లు దను వెడ • గ్రాలింప జెన్నొందు
[2]ననదుఁగౌఁదీఁగెయ • ల్లాడుచుండఁ
దళివేచివెనువెంటఁ • దగులు కామాంధకా
రములీలఁ గ్రొవ్వెద • గొమరుమిగులఁ
గర్ణభూషణమౌక్తి • క ప్రభాదోలన
మీక్షణ [3]దీప్తుల • నిసుచుదింప

1. జ. నట్టి. 2. 'అసుధు' అనియే ప్రతులు. 3. క. రోచుల,

తే. నందియల మొరపంబున • కరుగుదెంచి
ప్రోది రాయంచ రయమునఁ • బ్రోవునవ్వి
ధంబు దగ నభ్యసించుచం • దమునఁ దోన
చనఁగ నుత్తర నర్తన • శాలకరిగె. 26

ఆ. మెఱుఁగు [1]మొగిలిసొచ్చు • తెఱఁగున నాట్యమం
దిరము సొచ్చితనదు • గురువుకడకు
నరిగి నెమ్మి నిష్టి • లను నింతి ప్రార్థనా
వినయసంభ్రమములు • పెనఁగొనంగ. 27

క. ఇచ్చట నొకకయ్యంబున
జచ్చె మదీయాగ్రజన్ము • నేరధి తగువాఁ
డెచ్చోట లేమి నాతం
డచ్చుపఱుపఁ డయ్యె నీక్రి • యకు నొండొకనిన్. 28

వ. అది యట్లుండె నేఁడు కౌరవులు పసులం బట్టి రని కూయి వచ్చిన నన్నసన్నద్ధుండై వెనుకందగులసమకట్టి సారథ్యంబు సేయువాఁడు నొండిన నీ కందువ సైరంధ్రి సెప్పినం బ్రియం బంది నిన్నుదోడ్తేర నన్నుఁ బనిచిన నేనును నీపాల నాకుఁ జనవు గలుగుటంజేసి యెల్ల విధంబులం దెత్తునని పూనివచ్చితి నీవును నాపలుకులు గుఱుచ సేయక నీపెంపునం బ్రకటంబుగా నయ్యుత్తరకుమారునకు రథంబు గడప నియ్యకొని యివ్వ్యాపదఁ దలఁగవలయు నిట్లొడంబడక తప్పుట నావలని వాత్సల్యంబు గొఱంతపఱుచుట యనిన నమ్ముద్దియపలుకులు ముద్దు సేసి. 29

1. క. గ. మొయిళ్లు.

క. నగుచు బృహన్నల యిట్లను
జగతీశ్వరపుత్త్రి నాకు • సారథ్యమునే
ర్పు గలదె నీమాటకు నే
మిగులంగా వెఱతుఁ బొదము • మీఁద [1]ట్లుండెన్. 30

క. భవదీయప్రార్థనచేఁ
దివిరి పరమదుష్కరములు • దీర్చి యయిన ను
త్సవ మొనరించెద సార
థ్యవిధం బొకఁ డనఁగ నేల • యంబుజవదానా. 31

వ. అనుచు సంగీతనిలయంబు వెలువడిసలీలంబుగా మెత్తమెత్తన నడ
తెంచుమత్త శుండాలంబునుంబోలె. 32

ఉత్తరుఁడు బృహన్నలను దనకు సారథిఁగాఁ జేసికొనుట

తే. [2]అరుగుదెంచుబృహన్నల • నంతనంతఁ
గని నృపాలసుతుం డను • గారవమునఁ
గౌరవులతోడఁ గయ్యంబు • గలిగెనాకుఁ
గడఁగి నేఁడు రథమ్ము వు • గడపవలయు. 33

క. [3]వే రమ్ము మైమఱువుఁ దొడి
తే రెక్కుము [4]దప్పఁ గ్రుంకఁ • దీఱదు నీకున్

---

1. దెట్లుండెన్. 2. చ. అరుగుదెంచునాబృ • హన్నల నంతంతఁగ నినృ
పాలసుతుఁడు • గౌరవమునఁ గౌరవులకు నాకుఁ • గయ్యంబుగలదీవు
గడఁగి నేఁడురథము • గడపవలయు' అని కొన్ని ప్రతుల పాఠము.
3. ఘ. నేరిమ మైమఱువుం 4. క. గ. దడవు గ్రుంక.

సైరంధ్రి సెప్పె నీ దగు
[1]వీరమ్మున పెంపు లావు • వెరవును మాకున్.
చ. అనుటయు నాటపాట గల • యప్పటికిన్ నను( గోరి పిల్వ( బం
చిన( దగు(గాక సంగరము • చేతపు సారధి గమ్ము రమ్ము నీ
వను టుచితంబె యెల్లెడల • నారసి బాహుబలాఢ్యు( డైనయొ
క్కని రథ మే-త్తెఱం గడప( • గా నియమింపు రాజనందనా 35
వ. అనిన విని వైరాటి కిరీటి కిట్లనియె. 36
ఉ. ఖాండవ మేర్చునప్పుడు ద • గన్ రథచోదకవృత్తి సల్పి యా
ఖండలసూతికిన్ జయము • గల్గ నొనర్చినయట్టిబుద్ధియున్
దండితనంబు నీ యెడన • తక్కొనె నాదెస మైత్రి పెన్పు మిం
కొండొకమాట దక్కు-ము ర • ణోత్సహనం బొనరింపు గ్రక్కునన్.
తే. అనిన నాతనిమాటకు • నడ్డమాట
వెఱచినట్టితెఱంగు భా • వించి యల్ల
నియ్యకొనుటయు నమ్మను • జేంద్రసుతుడు
దృఢతనుత్రాణ మతనికి( • దేర(బనిచె. 38
క. తెప్పించి తొడుగు మీ వని
యొప్పించిన నిట్టు నట్టు • వొఱవలుగా మై(
గప్పికొని యాబృహన్నల
యప్పుడు నగుపించె నచట • యబలాజనమున్. 39
క. ఉత్తరుడు సత్వరంబుగ(
దత్తనువున మెఱువు [2]దొడిగి • తానును హృద్యో
దాత్తం బగుకంటక మిడి
చిత్తము పసి( గ్రమ్మఱింప • జిడిముడిపడ(గన్. 40

---

1. క. వీరమ్మును. 2. జ. దొడిపి

వ. బృహన్నల నవలోకించి 41

క. హయములఁ బూన్పుము రథమున
రయమున సిడమెత్తుమిష్టద • రావలయును గో
చయము గొని యస్మదీయ వి
జయ మభినందింపఁ బురము • జను లెదురుకొనన్ 42

తే. అనిన నీ వేమి పనిచిన • నట్ల చేయ
వలయు నీ వున్నయెడ నుండ • వలయునీవు
సన్నదెంచ జనవలయు నా • శక్తియెఱిఁగి
పంచి పనిగొనికడిమిమైఁ • బగఱగెలుము. 43

వ. అని పలుకుచు మనంబున ముదం బొదవ నాధనంజయుండు. 44

క. కాంచనజాలాలంకృత
చంచత్తనులీల మెఱయు • జవనాశ్వములం
బూంచి రథంబున మణిమయ
పంచాననకేతు వెత్తె • బంధురభంగిన్. 45

వ. ఇట్లు సన్నాహంబు మెఱసినసారథిం జూచి యుత్తరయుం జెలులు
ని ట్లనిరి. 46

క. కురువీరుల గెలిచి తదం
బరములలోఁ జిత్రవర్ణ • భాసురములుగాఁ
దర మెఱిఁగి లోచనోత్సవ
కరములుగా బొమ్మపొత్తి • కలపం దెండీ. 47

క. అనుడు బృహన్నల యి ట్లను
జనపాలకనందనుండు • జయలక్ష్మిం జే
[1]కొనునపు చీరెలు దెచ్చుట
పనియే యటు సూడుఁ డెల్ల • భంగులఁ దెత్తున్. 48

వ. అనుచు ధనుస్తూణీరకృపాణముద్గరాదివివిధసాధనంబులు రథంబుపైఁ
బదిలంబుగా నిడి నొగ లెక్కి పగ్గంబుల్ప్రుక్కి సక్కం జేయ నుత్త
రుండును బసులం బట్టిన దెస గోపాలకు [2]నడిగినవాఁడు పితృవనంబు
వల నని చెప్పిన వినుచు రథారోహణంబు సేసి వెడలి పౌరవృద్ధపు
ణ్యాంగనాభూసురసమూహంబులు బృహన్నలం జూచి తొల్లి ఖాండవ
దహనంబున నర్జునునకు నీకతంబున నయినమాంగల్యం బెట్టి దట్టిద
భవత్సాహాయ్యంబున భూమింజయున కయ్యెడు మని దీవించి సేసలు
సల్లంబుత్తంబు నిర్గమించినిరర్గళ పరాక్రముండయిన యాఫల్గుననైపు
ణంబున వల్గదశ్వంబగు రథంబురయంబునకు మెచ్చుచుం బరేతనిలయ
ప్రాంత ప్రదేశంబు సేరం జని. 49

సీ. అభినవజలధర • శ్యామంబు లగునెడ
లాకుజొంపంబుల • ననుకరింప
సాధ్యరాగోపమ • చ్ఛాయంబు లగుపట్లు
కిసలయోత్కరములఁ • గ్రేణిసేయ
రాజమరాళగౌ • రము లగుచోటులు
దలచుఁబూఁబొదలచం • దంబు నొందఁ
హరిద్రరుచిసమా • కృతు లగుతావు
లడరెడు [3]పుష్పొడు • లట్లు మెఱయఁ

1.క. కొనుచే చీరలు, 2. ఙ. గోపాలకులనడిగినవారు. 3చ. పుష్పాళ్యకడిమి

తే. గలయ నెగసి ధరాధూళి • లలితవనము
దివికి [1]నలిం గాంపు వోయెడు • తెఱగుఁ దాల్ప
గోగణము ముంగలిగ నేల • గోడివడఁగ
నడచుకౌరవరాజుసై • న్యంబుఁ గనియె. 50

ఉత్తరుఁడు కురుసైన్యంబు గనుంగొని భయభ్రాంతుం డగుట

క. కని యుత్తరుండు గరుపా
టినమేనును దలఁకుమనము • టిచ్చవడినచూ
పును నై తొట్రుపడుచు ని
ట్లనియె దిగులు సొచ్చి యాబృ • హన్నలతోడన్. 51

శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరా • భీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరా • కీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలా • త్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ • జేరంగ శక్తుండనే. 52

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁగా
ర్ముకవిద్యాప్రౌఢిమై ని • రూఢు లయినయీ
శకుని జయద్రథ దుర్ముఖ
వికర్ణ కర్ణాది యోధ • వీరుల కెదురే. 53

క. ఇట్టగు టెఱుంగక వచ్చితి
మెట్టొకొ మనభంగి వీర • కిందఱును గడున్
బెట్టిదులు మనకు మార్కొను
నట్టికాలందె గాదు భీతి • యడరెడుఁ దోడ్తోన్. 54

---

1. క. గ. నరిగాఁపు

ఉ. కౌరవసేనఁ జూచి వడఁ • కం దొడఁగెన్ మది నీవ మేను నీ
వూరక పోవు చున్కి యిది • యొప్పునె యిప్పటిభంగిఁ జూచిన
న్వీరల నేను మార్కొనమి • నిశ్చయ మ ట్లగుటన్ రయంబునం
దేరు మరల్పు ప్రాణములు • దీ పన మున్ [1]వినవే బృహన్నలా.

వ. అనిన దరహసితవదనుం డగుచు శతమఖతనయుం డతని కి ట్లనియె.

చ. అనవృకలీలఁ బొల్చురథి • కావలిమీఁదఁ జనంగ వెట్టినే
మసలక యామిషంబు గొని • మార్గము పట్టినతుచ్ఛసైన్యమున్
వెసఁ జని ముట్టి గోధనము • వేగ మ ర్తలముగాక యిమ్మెయిం
బసు లటు వోవఁగా మరల • బాడియె నీకు నరేంద్రనందనా. 57

ఉ. అంతిపురంబులోనఁ గల • యంగన లెల్లను నెమ్మనంబులన్
సంతస మందఁగా బసులఁ • జయ్యనఁ దెచ్చెద నంచుఁ బూని నీ
వెంతయు మేటి పై యరద • మెక్కి రయంబున వచ్చి యిచ్చటన్
దంతితురంగసద్భటక • దంబముఁ జూచి కలంగు టొప్పునే 58

ఆ. అనినపలుకులకు బృ • హన్నలఁ గనుఁగొని
యెలుఁగు [2]వడఁక నాతఁ • డిట్టులనియెఁ
బసుల దయ్యె మెఱుఁగుఁ • బడతుఁ సంతోష
మేల నాకు నఁకిఁ • జాల నేను. 59

వ. అనవుడు, 60

చ. తనభుజశక్తియున్ రిపుల • దర్పము నేర్పడఁ జూచిచూచి యె
ట్లును దెగ కున్నఁ బోక యిది • లోకముచక్కటి శూరు లైన దీ

---

1. ఊ. వినమే. 2. పు. వడఁగ.

నిని మది మెచ్చ రీబలము • నీ దెస దేఱియుఁ జూడ దింతకుఁ గా
మును భయహేతు వైనవిధ • ముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్.

సీ. దెసలు బీఁటలు వాఱ • దివురు [1]చిందములకో
లాహలంబులకుఁ గ • లంగఁబడక
యురవడి సేనలు • [2]దెరలఁ బైఁ దోఁతెంచు
ధూళి పెల్లడరినఁ • దూలపోక
చతురంగబల పతి • సాంద్రతఁ గవిసిన
యగ్గలికమునకు • బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్య • సారథివర్మాంగ
తతి నాటుతఱుచునఁ • దల్లడిలక

తే. బహువిధంబులఁ బగతుర • బరవసమున
నిత్తెఱంగునఁ గలుగుక్రం • దెల్లనోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి • నెగడుఁగాక
దవ్వుదవ్వుల [3]నిలైన • నవ్వరెట్లు. 62

చ. అసుదివిజేంద్రనందనున • కమ్మనుజేశ్వరసూనుఁ డిట్లనున్
వినుము త్రిగర్తవాహినులు • విక్రమసంపద సొంపు మీఱ గో
ధనములఁ బట్టినం బతి యు • దగ్రత సైన్యము లెన్ని యన్నియుం
గొని యట వోయెఁ గాన మన • కుం బురి గానట లేర యెవ్వరున్.

తే. ఒంటి దలపడి కురుసేన • నోర్చువాఁడ
నే యి దేటికి వెడసూట • లిట్టు లాడ

1. క. చిందంబుల. కోలాహలములకుఁ గుదియఁడక. 2. క. గ. దెరలు పై
3. విరిగిన,

వారు గానకముందఱ • దేరు దోలు
కొని రయంబునఁ బురి కరు • గుటయ నీతి. 64

వ. అనినం బార్థుండు పార్థివనందనున కి ట్లనియె. 65

క. [1]వెగ డొంది యిట్లు పలుకఁగ
నగునే పగతురు ప్రమోద • మందఁగఁ బసులన్
దిగ విడిచి పురజనంబులు
దెగడంగా మగిడి పోక • దీనత గాదే. 66

వ. అట్లుం గాక. 67

మ. నను సైరంధ్రి గడంగి పేర్కొనియె దా • నం బెంపుమైఁ బిల్చి తో
డని తో డ్తెచ్చితి నీవు బంటుతన మ • ట్లగ్గించి పౌరాలి దీ
వన నిచ్చెం దుదిఁ బోయి కౌరవులు గో • వర్గంబుఁ గొంపోవఁగాఁ
గని యేఁ గ్రమ్మఱి రిత్తవోదునె భయో • త్కంపంబు నీ కేటికిన్.

తే. చిత్తవృత్తి యొక్కించుక • చిక్కఁ బట్టి
మిపుడు కౌరవసైనికు • లెల్లఁ జూచి
వెఱఁగుపడ వేగమునులావు • వెరవుమెఱయఁ
గదుపుఁ బెట్టించిపోదము • గ్రమ్మఱంగ. 69

వ. అనుచు వివ్వచ్చుండు గడంగి తేరు వోవ నిచ్చుటయు నాననంబు పల్ల
టిల్ల మానసంబు దల్లడిల్ల నాభూవల్లభకుమారుండు. 70

క. దవ్వుల విఱిగినఁ బౌరులు
నవ్వుదురఁటె మేలు మేలు • నను నాఁగకు నీ

---

1. జ. బెగ డొంది.

క్రొవ్వుఁబొగడేనిఁ దలపడు
మెవ్విధిఁ జనితేని ననుచు • నెత్తినభీతిన్. 71

క. శరములు శరాసనము న
య్యరథముపైఁ డిగ్గ విడిచి • యతిరభసమునన్
ధరణికి లంఘించి వెసం
బురిదెసకును లజ్జ వీటిఁ • బోవం బాఱెన్. 72

వ. ఇట్లు పాఱినం దనమనంబునం గుత్సించుచు బీభత్సుండు యుగ్యంబుల పగ్గంబులు నొగల ముడిచి రథంబు డిగ్గ నుఱికి లంబకేశభారుండును నాందోళితరక్తాంబర యుగళాంచలుండును నగుచు నతనివెనుకం బఱచు సమయంబున నిలిచి కనుంగొను కౌరవబలంబునందు. 73

ఉ. అజ్ఞులు కొంద ఱప్పుడప • హాసము సేయుచు గూఢరూపరే
ఖాజ్ఞత లేమిఁ దద్వికృత • కాయముమీఁదను [1]దృష్టి నిల్పఁగాఁ
బ్రాజ్ఞులు మూర్తిసౌమ్యతయు • బాహులదీర్ఘతయుం [2]భటత్వత
త్త్వజ్ఞతయున్ గతిస్ఫురదు • దాత్తతయుం గని సంశయంబుతోన్.

తే. ఆఁడుఁజందంబుఁ బురుషస • మాకృతియును
గలిగి యున్నవి యొప్పు నూ • ష్మలతసొంపు
వికృత వేషాకృతంబు [3]లై • వెలయ కితఁడు
నివురు గవిసిన మెఱయని • నిప్పు బోలె. 75

ఉ. బాహులచాయయున్ గమన • భంగియు సర్జునసట్ల దీన సం
దేహము లే దితండు దన • తేజము దాఁపఁగ మత్స్యభూమిభృ
ద్గేహమునందుఁ బేడి యనఁ • గిద్పడి యుండెనొ కాక యీతరు
వ్యూహముతోడి కయ్యమునఁ • కొండొకరుం డిటు లొంటివచ్చునే.

---

క. దృష్టి. 2. క. గ. పటుత్వ. 3. క. నై • వెలయు నితఁడు.

చ. విరటుఁడు [1]దక్షిణంబునకు • వీరుల సారథులన్ నిజాజికై
పురిఁ గలవారి నెల్లఁ గొని • పోయిన [2]నొండులు లేమిఁ జేసియు
తరుఁ డిట వచ్చు చుండి యర • దంబు దగం గడపంగ నెవ్వరుం
దొరకొన కున్నఁ దానితనిఁ • దోడ్కొని వచ్చినవాఁడు సూడఁగన్.

చ. పరి సనుదెంచి గోగణముఁ • బట్టి రనన్ విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డ • హంకృతిమైఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దన • బుద్ధి గలంగినఁ బాఱఁ జొచ్చెని
ప్పురుషుని శౌర్యసంపదయు • భూరిబలంబు నెఱుంగఁ దేమియున్.

వ. అనుచు నిశ్చయరహితహృదయు లగుచుండ శుండాలరయలీలాసమ
రేఖం బసు గమనంబునం బురుహూతపుత్త్రుండు పదశతమాత్రప్రదేశ
పలాయితుం డైన భూమింజయు నెఱిది పట్టికొనిన నతండు.

సీ. [3]వెలవెలఁ బాఱుచు • వెగ డొందుఁ [4]బెదవుల
తడి యాఱ నెంతయుఁ • దల్లడిల్లుఁ
జల్లన నంగంబు • లెల్లనిండఁ జెమర్చుఁ
బదములుఁ గరములుఁ • [5]గుదియ వడఁకు
హృదయంబు తటతట • నదరంగఁ బెనుకుఱు
దీనదృష్టుల మోముఁ • దేఱిచూచు
నెలుఁగు గద్గదికఁ దొ • ట్రిల నేడ్చు విడు మని
ప్రార్థించు మాటఁ గీ • డ్పాటు దోఁప

1. క. పట్టుదట్టముగ; ఙ. బెట్టుదిట్టముగ: ఘ. దండుదట్టముగ. 2. క. నొండొరులేమిఁ 3. 'వెలువెల' యనియే ప్రతులం జూపట్టెడి. 4. ఘ. బెదవులఁ దడపుచు. 5. గ. వడఁగ; ఖ గుదువ పడఁకు.

తే. నిష్కశతశుద్ధహేమంబు • నిర్మలోజ్జ్వ
లాష్టవైడూర్యములుఁ దుర • గాఢ్యరథముఁ
గరటిదశకంబు నొకయూపుఁ • బురమునొచ్చి
నపుడ యిచ్చెద నీ కను • నార్తుఁ డగుచు. 80

క. నాతోడిప్రేముడిం గడు
నాతుర యై యెదురుచూచు • నంబకు జేతః
ప్రీతిగఁ జని యాయమఁ బొడ
సూతుం బోనీఁగదే వి • శుద్ధచరిత్రా 81

— • అర్జునుఁ డుత్తరునిఁ దనకు సారథిగాఁ జేసికొనుట • —

వ. అని మఱియు నానావిధదీనాలాపంబులం బ్రార్థించు చుండం బార్థుండు
నగుచు నతనిం దేర పేరం దెచ్చి.

చ. వెఱవకు మన్న పోటు కురు • వీరులతోడ నశక్యమేని న
త్తెఱఁ గది యేల నీ [1]కుదుగు • తేరికి సారథి గమ్ము నాపుఁ జి
చ్చఱపడు గెట్టు లట్టదరి • శూరుల మొత్తము నుగ్గు సేసెదం
బఱపెద సేన రాజుధృతిఁ • బాపెద గోవుల గ్రమ్మఱించెదన్. 83

క. అనుచు నొడఁబాటు లేకు
న్నను నయ్యుత్తరుని వొగల • నడుకొన నిడి తా
నును రథ మెక్కి రథికుఁ డయి
చనియె నరుఁడు జమ్మి సేర • సమ్మదలీలన్. 84

వ ఇట్లుసవ్యసాచినిక్షిప్తాయుధం బైనశమీవృక్షసమీపంబున కరుగునవసరం
బునం గ్లీబరూపచ్ఛన్నుం డయ్యును బ్రస్ఫురణవిశేషభీషణుం డగు

1. కుదుగు.

నతనిం గనుంగొని కౌరవసైనికులు గలంగినమనంబులతోడ వివ్వెఱపడి యుండ వారలం గనుంగొని తోఁచు నుత్పాతంబుల నాలోకించి గురుం డి ట్లనియె. 85

క. మాసె నభోమణి నక్కలు
గూసెం [1]గలయంగ దెసల • కుం బలుసాయల్
[2]సేసెం బఱమొయిళులదరి
మ్రోసెం దమయంతఁ దూర్య • ము లపధ్వను లై. 86

క. ఇగ్గజములు మిన్నకయును
మ్రొగ్గెడు నుత్తమతురంగ • ములు బాష్పజలం
బగ్గలము విడుచుచున్నవి
[3]దగ్గెడుఁ గారణము లేక • తడఁబడి పడగల్. 87

క. దగ్ధము లై నట్టులు స
మ్యగ్ధైర్యము లెడలె మండె • నాయుధచయముల్
దిగ్ధూమం బెసఁగె నసం
దిగ్ధము మన కాజి యగుట • దీనికిఁ దగఁగ౯. 88

క. మొన లొలుపుగఁ దీర్చికొనుఁడు
దనతనవాహనము లాయు • ధము లెల్లజనం
బును ననువుసేసికొనుఁడో
పినయంతయుఁ గాచికొనుఁడు • బెదరక పసుల౯. 89

1. క. గ. జ. గలనెల్ల. 2. సేసెఁ బఱమొగులు గీడై : జ. సేసెఁ బఱ మొగిళ లదరుచు. 3. ఘ. జ. త్రగ్గెడుకారణ .... తడఁబడెఁ; 'త్రగ్గెడు' అనియే ప్రతులు పెక్కిటఁ జూపట్టెడి.

వ అని చెప్పి తానప్పు డర్జును నెఱింగినవాఁడు గావున నతనికి నజ్ఞాతవాస సమయ భంగం బగునో యనుభయంబున సురనదీసూనువదనంబు వీక్షించి సన్నవాఱ ని ట్లయె. 90

చ. [1]వెరవరి గాక వీఁడు కురు • వీరులకుం బొడసూపువాఁడె య
చ్చెరు వొకమ్రానిపేర విట • సేరఁగ వచ్చుచునున్నవాఁ డహం
కరణమ కాని యొం డొకటి • గానఁడు మూర్తివిశేష మారయన్
సురపతియట్ల వీనిమది • చొప్పది యెట్లొ యెఱుంగ నయ్యెడున్. 91

క. అనిన విని యెఱిఁగికొనియు
తనిమది సందియము మాన్పఁ • దలఁచి నరేంద్రుం
గనుఁగొనుచు నతననితోఁ జె
ప్పనభంగి నిగూఢవృత్తి • భీష్ముఁడు వలికెన్. 92

క. తలఁపఁగ రిపులకు సిమ్మగు
కొలఁదిఁ గడచి వచ్చితిమి య • కుంఠితబాహా
బలము నెఱపఁ దఱి యయ్యెను
జలింపవల దింక మనకు • శత్రులవలనన్. 93

వ. అనవుడు నాచార్యుం డయ్యర్థంబు గనుఁగొని పార్థునకు సమయభంగం బువలని సంకటంబు లేకునికికి మనంబునం బ్రియం బంది మొగంబునం దోఁపనీక పుయిలోట దక్క యిట్లనియె. 94

శా. సింగం బొఁకటితో గుహాంతరమునం • జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసము • ద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి న • స్మత్సేనపై వీఁడె వ
చ్చెంగుంతీసుతమధ్యముండు సమర • స్థేమాభిరామాకృతిన్. 95

---

1. జ. వెరవిఁడి.

ఉ. ఈతనితోడికయ్యమున • కియ్యకొనం దగువార లస్మదీ
యాతతసేనలోఁ గలుగు • టారయ సంశయ మెల్లభంగిగో
త్రాతనివర్తనంబు సుక • రంబ కిరీటి కితండు రుద్రునిం
బ్రీతునిఁ జేసె నా వినమె • పెం పెసలారెడుబాహుసంపదన్. 96

వ. అనుపలుకు లాకర్ణించి కర్ణుండు కటకటంబడి కుంభసంభవున కిట్లనియె.

ఉ. పాండవపక్షపాతమునఁ • బల్కెడు నోరికి వచ్చినట్లు ని
న్నొండన రామిఁజేసి యిది • యొప్పునె కౌరవసేన కెల్ల నా
క్కొండవ మేటి వీబలము • గర్వముఁ గుందఁగ నిట్లు శత్రుఁడో
శ్చండిమ కోహటించితి ని • జంబునకున్ వరుఁ డింతయెక్కడే. 98

ఆ. అతఁడు వచ్చెనేని • నస్మచ్ఛిలీముఖ
పాతచలితహృదయ • పద్మఁ జేసి
వెగడుపఱచి యో • ధవీరుల కెల్ల ను
త్సవ మొనర్తు బాహు • దర్ప మొప్ప. 99

వ అనిన విని సుయోధనుండు రాధేయున కిట్లనియె. 100

ఆ. తప్పఁ బలికి తీవు • సెప్పెద విను మితఁ
డర్జునుండయేని • నడవి కేఁగి
భ్రాతృయుతము గాఁగఁ • బన్నిద్రెండువత్సర
ములును నంద నిలువ • వలయు మగుడ. 101

క. ఒరుఁ డయ్యేనేని మామక
శరాసనక్షిప్తదీప్త • సాయకపంక్తిం
బరిమార్చెద వ్రేల్మిడి వ
చ్చెరువుఁ బ్రమోదంబునొంది • సేనలు వొగడన్. 102

క. అనుపలుకులకును భీష్మం
డును ద్రోణుఁడు ద్రోణసూనుఁ • డును కృపుఁడును మే
లని యియ్యకొనిరి హృదయా
నసురూపములైన [1]తెలివు • లాస్యముఁ బొందన్. 103

- అర్జునుఁడు శమీవృక్షనిక్షిప్తం బైన గాండీవంబు గొనుట -

వ. అట్టియెడ శమీవృక్షసమీపంబున నరదంబు నిలుపం బంచి పార్థుం
డుత్తరున కిట్లనియె. 104

క. ఇన్నగమునందు గాండివ
మున్నది యది గాని మద్భు • జోద్రేకవిలా
సోన్నతి కోర్వవు పెద్దయు
నన్నువ లీ విండ్లు గుఱుచ • లలఁతిబలంబుల్. 105

క. ఇవి నీ తెగకొలఁదివి వీ
రవినోదమునప్పు డధిక • రభసము లగుమ
ద్వివిధాటోపములకుఁ జా
లవు వి ల్లది నూఱువేల • లా వరయంగన్. 106

క. వీనిఁ గొని గట్టిమైనులు
వేనుంగును మఱియు నెట్టి • వేనియుఁ దునియం
గా నేయ నగునె కైదువు
లేని [2]యలవుకనిమి బొర • లెస్సె యున్నే. 107

వ. కావున నిమ్మహీరుహం బెక్కి యమ్మహనీయచాపంబు దెచ్చి యిమ్ము
ధర్మజ భీమార్జుననకులసహదేవులు దమతమసమస్తాయుధంబులుఁ

---

1. క. తెలుపు 2. చ. యెలువు

గూడం గట్టి యిందుఁ బెట్టినవా రాకట్ట విడిచి యందు గాండీవంబు పుచ్చికొని తక్కటియవి యెప్పటి యట్ల బంధింపు మని చెప్పి శవాకారంబున నున్న శస్త్రాస్త్రప్రపంచయంబు సూపిన భూమింజయుం డతని కిట్లనియె. 108

క. పీనుఁగు నంటఁగ నగునే
భూనాథతనూజుఁ డనక • పుయిలోడక న
న్నీనీచపుఁబనిఁ బనుపం
గా నీకుం దగునె పాప • కర్మము గాదె. 109

వ అనిన విని ధర్మనందనానుజుం డత్యాదరంబున 110

ఆ. మనుజు లంట కుండ • మఱువడఁ జేసిన
యస్త్రశస్త్రసంచ • యంబు గాని
శవము గాదు మత్స్య • జనపాలపుత్త్రయే
నట్టిదైనఁ బనుతు • నయ్య నిన్ను. 111

క. నమ్ముము కైదువుమో పగు
జమ్మి వెసం బ్రాఁకి విడిచి • చాపము నాకం
దిమ్మనుడుఁ జేయునది లే
కమ్ముగ్గుం డమ్మహీజ • [1]మలసత నెక్కెన్. 112

వ. ఇట్లుత్తరుండు సమారూఢశమీవృక్షుం డగుటయు నరదంబుపయి నిలుచుండి పాండవమధ్యముండు వేవేగ విడువు మనవుడు నతండు నాయుధబంధం బెడలించిన. 113

1. క. మల్లన.

క. మెఱసి యుదయించుగ్రహముల
తఱచుప్రభలఁ గ్రేణిసేసి • దశదిశలం గ్రి
క్కిఱిసి వెడలెనావిండ్లకా
మెఱుఁగులు నృపతనయుదృష్టి • మిఱుమిట్లు గొనన్. 114

వ. అట్టియెడ నయ్యాయుధంబులు. 115

క. పెనుపాములచందంబున
నునికికి భయ మంది వడఁకు • నుర్వీశసుతుం
గని తగుమాటలఁ గుంతీ
తనయుఁడు వెఱ వాపుటయు న • తం డచలితుఁ డై. 116

వ. [1]పొదువు విరియం దట్టి కనుంగొని నిరూపించి సారథీ యని సవ్యసాచిం
బిలిచి యిట్లనియె. 117

క. ఇది యొకచాపము విస్మయ
మొదవించుచుఁ గొండచిలువ • యొకో నాఁదగియు
న్నది ఖచితకనకకమలస
ముదయద్యుతిసముపగూహ • నోజ్జ్వల మగుచున్. 118

వ. దీనిం బాండవులయం దెవ్వరు ధరియింతురని మఱియు బహువిధంబు
లగు నాయుధంబు లుపలక్షించి వేఱువేఱ వానిచందంబు లుపన్యసించి
యివి యెవ్వరెవ్వరి వని యడిగిన నర్జునుం డిట్లనియె. 119

తే. తొలుత నీవు వ న్నడిగిన • దొడ్డవిల్లు
గాండివము ఫల్గునున కేడు • గడయునదియ
సమరమున దేవదానవ • సమితినైన
గెలుచు నక్రమమున దాని • వలన నతఁడు. 120

---

1. జ. పొది.

క. ఆద్యపురుషోపలాలిత
షడ్ద్యోతితరోచిరుగ్ర • మోగ్రం బరిని
ర్వైద్యము దివ్యజనన మన
వద్యం బధికార్ముకైక • వరము కుమారా. 121

వ. అమ్మహనీయచాపంబు బ్రహ్మశతసహస్రవర్షంబులు ప్రజాపతిచతుష్షష్టి సహస్రవర్షంబులు నింద్రుండు పంచాశీతిహాయనంబులు సోముండు పంచశతాబ్దంబులు వరుణుండు శతశరత్సమితియుఁ గ్రమంబునన్ ధరియించిరి వరుణుచేత నగ్నిదేవుఁడు వేడుకపడి పుచ్చికొని పదంపడి యద్భుతకర్మంబునకు మెచ్చి వివ్వచ్చున కిచ్చె నతండును నఱువదే నేండ్లు ధరియింపంగలవాఁ డిట్టిది త్రిలోకపూజ్యమహిమనొప్పు చుండు

సీ. నీలోత్పలచ్ఛాయ • నెరసి సౌవర్ణవృ
షావలి నొప్పుబా • ణాసనంబుఁ
దాళప్రమాణసుం • దర[1]ము నై భర్మశా
ఖా[2]మృగాంచిత మగు • కార్ముకంబుఁ
దీవ్రపుకానల • దీప్తాకృతియుఁ గన
త్కనకమత్స్యంబులుఁ • గలుగుధనువు
మెఱుఁగారిసారంబు • మెఱయఁగాంచినమయూ
రములశోభిల్లుచా • పమునువరుసఁ

ఆ. పాండవాగ్రజుండుఁ • బవనపుత్త్రుఁడు నకు
లుండుఁ దదనుసంభ • వుండుఁ బట్టు
నవి కుమార యగ్ర • వాజినకోశపు
హాశరంబు పార్థు • నదియ చూపె 123

1 క. మైన. 2 చ. మృగఖచిత.

క. ఎద్దెసలం గనఁడుచు స
ముద్దీప్తము లగుచు నుండ • నుజ్జ్వల మగుస
య్యుద్దండగదాదండము
పెద్దయు నెడ మెచ్చి పట్టు • భీముఁడు పోరన్. 124

— • అర్జునుఁ డుత్తరునకుఁ దన్నెఱింగించుట • —

వ. అని చెప్పి మఱియు బాణకృపాణతనుత్రాణాదు లగువివిధసాధనంబులు వేఱువేఱ నిరూపించి గ్రక్కున నెఱింగించె నప్పుడు మహాత్ముం డగు నయ్యుత్తరుండు పాండవోత్తము నెఱుంగమి ని ట్లనియె. 125

క. ఈయెడ నిట్టిమ్మహనీ
యాయుధములు వెట్టి యెచటి • కరిగిరి మనకొం
తేయులు బృహన్నలా తగ
నీయెఱిఁగినయంతవట్టు • నిక్కము సెపుమా. 126

వ. అని సస్నేహంబును సగౌరవంబును సవిషాదంబునుంగా మఱియును.

క. ఏ నమ్మహానుభావుల
మేనల్లుఁడ వార లార్య • మిత్త్రులు శత్రు
క్ష్మానాయకగర్వతమో
భానులు బంధుహితకార్య • పరతంత్రాత్మల్. 128

తే. ఆయుధిష్ఠిరుఁ డెచ్చట • నడఁగియున్న
వాఁడొ భీమునిపార్థుని • వర్తనంబు
లెయ్యెడలనేమిచందంబు • లయ్యె నక్క
టా విధాత్రుండ కవలెందు • డాఁగిరొక్కొ. 129

క. భూపాలవల్లభా జన
దీపిక యనఁ జాలుద్రౌప • దికి నెయ్యెడలం
దేపాటులు వాటిల్లెనో
కాపురుషులవలన నిట్టి • కాఱియ పుట్టెన్. 130

క. కపటద్యూత మొనర్చిన
నృపతియు దుర్యోధనాది • నీచుల[1]వలఁ బా
ఱి పడియెఁ గడుఁ బెక్కిడుమల
రిపుమర్దనవీర్యభుజగ • రిష్ఠుం డయ్యున్. 131

క, వినఁబడ రెచ్చోటను దమ
వినుతమహీరాజ్యమహిమ • విడిచి చనుట నే
మని వినియెదనో నీచే
ననుడు నతం డిట్టు లనియె • నాతనితోడన్. 132

వ. వారలకు వగవ వలవదు విధివశంబున వచ్చిన యాపదకు నోర్చి బాస దప్పక వారును బాంచాలియు నొక్కటఁ బండ్రెండేండ్లు వనంబున వసియించి పదుమూఁ డగునేఁ డజ్ఞాతవాసంబు సలుపవలయుట నిట వచ్చి మనవీట[2]నవ్యాపన్నులై యున్నవారు వినుము వారి నెఱింగించెద. 133

క. కంకుఁడు ధర్మసుతుఁడు వల
లాంకుఁడు భీముండు కవలు • హయశిక్షకగో
కింకరులు సెప్పఁ దొడఁగితి
నింకఁ గొఱఁత వెట్ట నేల • యే నర్జునుఁడన్. 134

తే. అధిపనందన మాలిని • యనఁగఁ బరగు
కాంత ద్రౌపది దానికై • కాదె సింహ

1 గ, చే, నోటుపడియె. 2 జ. నత్యానన్నులై.

బలునిఁ దమ్ముల గంధర్వ • పతులు నంపి
రనఁగఁ జంపె మహోగ్రత • ననిలసుతుఁడు 135

వ. అనిన విని భూమింజయుండు సంభ్రమాశ్చర్యసంశయంబులు మనంబున ముప్పిరి గొనం దప్పక చూచి సవ్యసాచికి వెండియు ని ట్లనియె 136

క. చిరకీర్తిప్రియుఁ డగున
న్నరునకుఁ బది గలవు భవ్య • నామములు మనో
హరముగ నవి సెప్పుమా యొం
డరయక యే నమ్మెదను బృ • హన్నల నిన్నున్. 137

వ. అనుడు నతఁడు సస్మితాననుం డగుచు నర్జునుండు ఫల్గునుండు పార్థుండు కిరీటి శ్వేతవాహనుండు బీభత్సుండు విజయుండు జిష్ణుండు సవ్యసాచి ధనంజయుండు నను నివి పదియును నాపేళ్ళనవుడు నుత్తరుండు పాండవమధ్యమున కి ట్లనియె. 138

క. [1]ఏమేమికతంబున నీ
నామంబులు సంభవిల్లె • నరునకు నవి చే
తోమోదంబుగఁ జెప్పుము
నీమదిఁ దత్తద్విధంబు • నిశ్చిక మేనిన్. 139

వ. అనుటయు నట్ల చేయుదు నని యాతం డి ట్లనియె. 140

ఆ. ధరణి యెల్ల గెలిచి • తగ ధనంబులు గొని
యునికి నే ధనంజ • యుండ నైతి
నెట్టివారి నైన • నెదిరినఁ బోర జ
యంబుఁ గొనుట విజయుఁ • డండ్రు నన్ను. 141

1. జ. ఏమికతంబున ని ట్లీ,

తే. తెలుపు లగు వాహనములు నా • తేర సమర
భూములం దెప్డు [1]నియతిమైఁ • బూన్కిఁ జేసి
శ్వేతవాహననామవి • ఖ్యాతి నాకు
సకలజనసమ్మతంబుగ • సంభవించె. 142

ర. రవి యుదయించినట్లు సమ • రంబున నాతలమీదఁ గాంతిమూ
ర్తి వెలుఁగు నింద్రుఁ డిచ్చిన కి • రీట మభేద్యమహోగ్రసుస్థిర
త్వవిభవరూఢిమై జనులు • దానన నన్నుఁ గిరీటినామసం
స్తవనవిశేషపాత్రముగ • సమ్మతిఁ జేసిరి మాత్స్యనందనా. 143

తే. వీరులకుఁ జూడ బీభత్స • విధము గలుగునట్టి
కౌర్యంబు సేతకు • నెట్టిసమర
భంగులను డడఁబడక [2]బీ • భత్స సేయ
దాన బీభత్సుఁ డనునభి • దాన మయ్యె. 144

క. భండనమున నిరుగేలను
గాండీవము దివియ నేర్పు • గలిగిన నం దు
ద్దండ మనుసవ్యకరము ప్ర
చండతఁ బరఁగుదును సవ్య • సాచి యనంగన్. 145

తే. ధరణి దుర్లభ మగునవ • దాతవర్ణ
మారఁ గలుగుట నర్జునుఁ • డంద్రు నన్ను
ఫల్గునాహ్వయ ముత్తర ఫల్గునీవి
శిష్ట కాలసంజననతఁ • జేసి కలిగె. 146

---

1 చ. నియత మై.

2 'బీభత్సుఁ జేయ' అనియే ప్రతులన్నిటఁ జూపట్టెడి.

క. అనిమొన మార్కొని ప్రణమే
గనఁ గౌన ధర్మజుని మేనఁ • గావింపఁగ న
య్యనిమిషులుఁ జాల రెవ్వరుఁ
జెనకినఁ బరిమార్తుఁ గాన • జిష్ణుఁడ నైతిన్. 147

క. పృథ యను పేరు మదంబకుఁ
బ్రథితంబై యునికిఁ జేసి • పార్థుఁడ నైతిన్
వృథయుఁగఁ బలుకుదునే యవి
తథవచనుం డైనధర్మ • తనయుననుజుఁడన్. 148

వ ఈపదిపేళ్లును నివి కారణంబులుగాఁ బ్రకాశంబు లయ్యె సకలసురనిక
రంబులఁ డుపడినం బుండరీకాక్షసహాయుండ నై ఖాండవం బేర్చినప్పుడు
మెచ్చి భద్రమూర్తు లైనరుద్రవిరించులు సన్నిధి సేసినం బెన్నిది గన్న
పేదచందంబున సంభ్రమించునాకుం గరుణించి కృష్ణుం డనునేకాదశ
నామంబును నప్రతిహతబాణంబులు నొసంగిరి వారలయనుమతి నిం
ద్రాదు లయినవిబుధులును వివిధంబు లగుదివ్యాస్త్రంబు లిచ్చిరి పదం
పడి గీర్వాణులకు నోర్వరానియట్టివారి వరదానగర్వితుల నివాతకవచు
లనియెడుదైతేయుల మాతలి సారథికంబగునైంద్రస్యందనం బెక్కి
యొక్కరుండ నమ్మూఁడుకోట్లనిర్జించితి దుర్జయు లగుహిరణ్యపురనివాసుల
నఱువదివేవుర దేవారాతుల వారాశితీరంబునం బరిమార్చితి నప్పుడు
ప్రీతుండై కదా గిరిభేది కిరీటం బొసంగె దేవసంఘంబు శంఖం బిచ్చె
నది గతంబుగా నప్పేరుచందంబు దేవదత్తం బనం బరఁగె మఱియు
నెయ్యెడల నెవ్వరు దొడరినం బోలివోనిబలిమికలిమి వెలుంగుదు
గాంధారీనందనుఁడు గంధర్వరాజుచేతం బట్టువడినయప్పుడు పదునాలుగు
వేల గంధర్వుల జయించి యతని విడిపించితి నీవారకు మీకూడిన

కురుబలంబుల గెలిచి కర్ణగాంగేయకృపద్రోణద్రౌణిదుర్యోధనులు గనుం గొను చుండఁ గదుపులం గ్రమ్మఱించెద నని సత్వరంబుగాఁ జెప్పిన విని యుత్తరుండు చిత్తంబున నద్భుతహర్షంబులు వొదువ మానుదిగ్గ నుఱికి సర్వాంగసంగతోర్వీతలం బగుదండప్రణామం బాచరించి చేతులు మొగిచి నిలిచి యి ట్లనియె. 149

—• ఉత్తరుఁడు బృహన్నల నర్జునుఁగా నెఱుంగుట •—

ఉ. బాహుపరాక్రమోగ్రతమద • భంజనశౌర్య సమస్తలోక చే
తోహరమూర్తి నీ విటులు • దోఁచుట నాకుఁ బ్రసన్నవిస్ఫుర
ద్దేహముతోడ భాగ్యమయ • దేవత సన్నిధిసేఁత గాదె స
మ్మోహము వాసెఁ జిత్తము ప్రమోదరసత్వముఁ బొంది పొంగెడున్.

క. విన్నెఱుఁగక యే నేమే
నన్నపలుకు లెల్ల మఱచి • యాశ్రితరక్షా
సన్నద్ధభావ మేర్పడ
నన్నుం గృపఁ జూడవే స • నాథుఁడ నగుదుఁ. 151

క. అన వినుచుఁ దేరు డిగి గ్ర
క్కునఁ గౌఁగిటఁ జేర్చె విరటు • కొడుకును గుంతీ
తనయుఁడు సమ్మదమునఁ దన
[1]కనుఁగవఁ గదునశ్రువారి • గడలుకొనంగన్. 152

వ. ఇట్లు సమాలింగితుం డై. 153

చ. మనము కలంక దేఱె రిపు • మర్దన విక్రమ యెక్కు తేరు నీ
ఘనభుజశక్తిప్రాపున న • ఖండితశౌర్యమహోన్నతుండ నై

1 క. కనుఁగొనలను నశ్రు, గ. కనుగొనఁ బ్రమదాశ్రు.

యనిమొన సారథిత్వము ప • హ_త్వము వైరులు మెచ్చఁ జూపెదన్
సనుఁ బనిగొమ్ము లెమ్ము కురు • నాథు నదల్పు మరల్పు గోవులన్.

క. మనమునఁ గోరుదు నే న
ర్జునునకు సమరమున రథ్య • చోదకభావం
బునఁ బనిసేయవలయు నని
యనిశము విధికరుణ నాకు • నది సిద్ధించెన్. 155

వ. అని పలుకును త్తరు నత్యాదరంబునం జూచి సవ్యసాచి యతని కి
ట్లనియె. 156

మ. ప్రియ మక్షీణము నాకు నీదెస మదిన్ • భీతి[1] ప్రదోద్వేగసం
శయముల్ సేరఁగనీకునీకు ఘనర • త్నకల్పనాబుద్ధిని
శ్చయసంపాదిని నాదుదృష్టి నినున • శ్వవ్రాతముం జోఁక గా
లియు రానీను [2]దృణీకరింపు రిపుదో • ర్లీలాసముల్లాసమున్. 157

వ. అనిన విని భూమింజయుండు సవినయంబుగా ని ట్లనియె. 158

క. నిను నర్జునుం డని యెఱిం
గినయంతన బాసె నెల్ల • కిల్బిషములు నీ
తనువేల షండభావం
బునఁ బొందెనొ యెఱుఁగ వలయుఁ • బుంస్త్వాభరణా. 159

చ. అనవుడు నాతఁ డి ట్లను మ • దగ్రజుపంపున బ్రహ్మచర్యవ
ర్తనకయి పూర్వశాపవిహి • తంబగు రూపముఁ దాల్చి యేక హా
యనపరిపాలనీయ మగు • నట్టివ్రతంబు సమాప్తిఁ బొందఁ జ
ల్పినజతనంబు లోపలనుఁ • బేడితనం బయితోఁచె నిమ్మెయిన్. 160

1 చ. భ్రమోద్వేగ. 2 జ. దృణీకరింతు.

వ. అదియును నిట మీఁద లేదనినఁ బ్రమోదమానమానసుం డయి మత్స్యపతిసూనుండు పాండుసూనున కిట్లనియె. 161

ఆ. ఇట్లు దెలియఁ జెప్పు • టెల్ల నా దెసదయ
పెంపుతోడికూర్మి • పేర్మిఁ గాదె
యింక సురల కైన • శంకితు నేభవ
ద్బాహువప్రగుప్తి • [1]బలుపు గలుగ. 162

వ. నాకుం బని యెయ్యది పనుపు మనిన నతండుఁ గాండీవంబును గాంచన పుంఖంబు లగు [2]బాణంబులతూణీరయుగళంబును మదీయతనుత్రాణ కృపాణంబులును బుచ్చికొని తక్కినవాని నెప్పటిభంగిన కట్టిపెట్టి రమ్మని నియోగించిన నాతండు నట్లు చేయుటయు నమ్మహాత్ముండు నియతాత్ముం డయి యధిదేవతలకుం బ్రణమిల్లి భక్తితోడ దివ్యకోదండాదు లగుసాధనంబులు గైకొని సవిశేషస్ఫూర్తి యగుమూర్తి నత్యంత దర్శనీయత్వంబు నొందె. 163

క. బలరిపుఁ డిచ్చినకుండల
ములు నుష్ణీషంబుఁ జిత్త • మున భక్తి మెయిం
దలఁప నవి వచ్చె వెంద్రుక
[3]లలవడఁగాఁ బాచి ముడిచె • నమర దృఢముగన్. 164

క. తలచుట్టు చుట్టెఁ గుండల
ములు పెట్టెను గ్రీఁడి గాఢ • ముగఁ గట్టెఁ గరం
బులవలయంబులు గనుఁగొని
యొలన వ్వాలయంగ నెక్కె • నేత్తెఱ రథమున్. 165

1 క. బలము, 2 గ. 'బాణంబులపొదియుఁ దూణీరయుగళంబును' అని పెక్కుప్రతుల పాఠము. 3 క గ. లలవడఁ బాచి ముడిపెట్టె.

వ. అట్టియెడ వరదానమహానుభావంబునం జేసి. 166

క. పెట్టక కట్టక మౌళిం
బుట్టినక్రియ దీధితులు న • భోభాగంబున్
ముట్టి వెలుంగఁగ నింద్రుని
పట్టికిరీటంబు వొలిచెఁ • బ్రస్ఫురితం బై. 167

వ ఇవ్విధంబున సన్నద్ధుండై యతిరథశ్రేష్ఠుండు రథం బెక్కి యం దాయుధంబులు పదిలంబుగా నిడి తనుత్రాణతలత్రాణంబులు దాల్చి కవదొనలం బూని గాండీవంబుఁ బుచ్చికొని యెక్కువెట్టి ముష్టి నలవరించి గుణధ్వని సేసిన. 168

తే. పక్షిమృగజాతు లెల్లను • బ్రమసియిట్టు
నట్టుఁగలగొనఁజెదరె వృ • క్షాళి యదరెఁ
గురుబలంబును బెదరెనం • బరముదిశలు
దూరటిల్లంగఁదొడగెఁద • దారవముల. 169

వ. తదనంతరంబ యగ్ని దేవుం దలంచిన నతండును దనవరంబున మున్న కలిగివిశ్వకర్మ నిర్మితంబును మాయామయంబును వానరాకారంబును నగుమహోగ్ర కేతనంబును దదాశ్రితంబు లై నవికృతాభీలనానావిధభూతంబులనుం బుత్తెంచిన నుదాత్తచిత్తుం డయి యుత్తరుసింహపతాక శమీవృక్షంబునం బెట్టించి నిజధ్వజంబు రథంబునం గట్టించి దివ్యంబు గావున దేవదత్తంబుచిత్తజ్ఞత్వంబున సన్నిధి సేసిన నవినయంబుగాఁ గైకొనియె నక్కుమారుండును నాయితంబై నొగ లెక్కి పగ్గంబు లమర్చికొని యగ్గలికతోడం దురంగంబులయంగంబులు దొడయుచు వాని జవసత్వంబులు వేయువేలు వర్ణించిన. 170

## అర్జునుఁడుత్తరసారథికం బైన రథంబెక్కి. దేవదత్తంబు పూరించుట

చ. తడ వగుదెంచె జమ్మికిఁ బ్ర • దక్షిణవృత్తిగఁ దేరు వోవని
మ్మెడ గలుగంగఁ బోయెఁ బసు • లిప్పుడ కూడుద మన్న నాతఁడున్
నడపఁ దొడంగుడున్ మనము • నన్ రణకౌతుక ముల్లసిల్లఁగాఁ
బిడుగులపిండు బిట్టులియ • 1పెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తినన్.

మ. కలఁగెం దోయధిసప్తకంబు గిరివ • ర్గం బెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మా • శాచక్ర మల్లాడెఁ గొం
దల మందెం ద్రిదశేంద్రుపట్టణము పా • తాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకాకులము సం • క్షోభించె నవ్వేధయున్.

తే. అపుడు నిశ్చేష్టితంబులై • హయము లవనిఁ,
జాఁపకట్టుగఁబడియె మ • త్స్యక్షితీశ
నందనుండును నొగలపై • మ్రందినట్లు
2మ్రొగ్గతిలఁజాఁగిబలితంపు • మూర్ఛఁబొందె.

చ. కనుఁగొని ఫల్గునుండు దుర • గంబులవాగెలు వట్టి యెత్తిత
త్తనువులు నూల్కొనన్ నివిరి • తత్పరతం దగ మత్స్యభూమిభృ
త్తనయుని నూఁది పట్టి వికృ • తం బగురూపము చక్కఁజేసి నె
మ్మన మొకభంగిఁ దేర్చి 3గరి • మంబుగఁ గౌఁగిటఁ జేర్చి యిట్లనున్

తే. శంఖభేరీరవంబులు • సామజముల
బృంహితంబులు వింతలే • పృథులసైన్య
పరియోదాత్తు లగునర • పాలసుతుల
కెలమిఁ బొందుము దీనికి • నింత యేల. 176

---

1. చ. బెట్టుగ, 2. జ. మ్రొగ్గతిల. 3. గరిమంబున.

చ. అనవుడు మత్స్యరాజసుతుఁ • డాతని కిట్లనుఁ దొల్లి శంఖని
స్వనములు విందు భేరులర • వంబులు విందుఁ గరీంద్ర బృంహిత
ధ్వనులును విందు నద్భుతవి • ధంబుగ నిట్టివి యెల్ల జిత్తమో
హన మొనరింపఁజాలునె మ • హానినదం బిది యోర్వ వచ్చునే. 176

చ. చెవు లవిసెన్ దిశల్ దిరిగెఁ • జిత్తము నీఱవోయె నాకు నీ
రవమున నిమ్మహోగ్రకపి • రాజపతాకయుఁ జూడ్కిఁ జీఁకటుల్
గవియఁగఁ గ్రాలెడున్ భవద • ఖండితతేజము పర్వి యాత్మకున్
వివశతఁ జేయుచున్నయది • విహ్వలభావము మాన నేర్చునే 177

క. అన విని తగుమాటల నా
తనికొండలపాటు పాండు • తనయుండు క్రమం
బున డిందుపఱిచి యరదము
సనఁగా నెఱిఁగించి పట్టె • శంఖము మఱియున్. 178

వ. ఇత్తెఱంగున నయ్యుత్తరకుమారు ధీరుంగావించికొని పాండవవీరుండు రథనేమి నిస్వనజ్యానాదమేదురం బగుశంఖారవంబు సెలంగ నడచు సమయంబున నాచార్యుండు దుర్యోధనున కిట్లనియె 179

సీ. శ్రవణపుటంబులు • వ్రయ్యంగఁ దాఁకి సం
క్షోభంబు గావించె • గుణముఁ బ్రోఁత
బ్రహ్మాండభాండంబు • పగిలించి భూతని
శ్చైతన్య మొనరించె • శంఖరవము
గగనభాగం బెల్లఁ • గప్పి క్రాలుచు బెగ
డదరించె నుగ్రంపుఁ • బడగపఱపు
మిఱుమిట్లు గొని చూడ్కి • పఱివోవ
[1]వెలిఁగి పరిభ్రాంతి సేసెఁ గి • రీటకాంతి

1. పెరిఁగి దిగ్భ్రాంతి సేసెఁ గిరీట • కాంతింపు

తే. తెల్ల మిది గాండీవంబును • దేవదత్త
ము సు గపిధ్వజమునువాన • పునివరమునఁ
గన్నమకుటంబు వగు వేల • కొన్నియైన
నుజ్జ్వలాద్భుతభంగులై • యున్నెయిట్లు

ఉ అచ్చెరు వై నవిక్రమము • నగ్గలికన్ సమరంబు గోరి యీ
వచ్చుచు నున్నవాఁడు బల • వద్రిపుభీషణ [1]బాహుఁడై నవి
వ్వచ్చుఁడ యింక మిన్నక వి • వాదము సేసినఁ బోవ దియ్యెడం
బొచ్చెము లేనిబల్మిగలఁ • బోరి కమర్పుము దర్ప మేర్పడన్, 181

వ. అని కృపాశ్వత్థామాదియోధముఖ్యుల నవలోకించి 182

క. మనమొనల దుర్నిమిత్తము
లనేకములు పుట్టఁ దొడఁగె • న ట్లగుట జయం
బనుమానం బొక కార్యము
వినుఁడా మీ కెల్లఁ జూడ • వెర వగునేవిన్. 182

ఉ. ముందర రాజుఁ బుచ్చి బల • ముల్ గలయంబడి గోవ్రజంబులన్
దందడి వెట్ట కుండఁ బిఱుఁ • దన్ నడపింపఁగ బంచి గట్టిమై
నందఱు నింతకున్ వెనుక • యై మొన లేర్చి చనంగ నెప్పు సం
క్రందనసూతి దగ్గఱియెఁ • గయ్యము సేయుట కప్పుడిమ్మగున్.

వ. అనిన విని సుయోధనుండు భీష్మకృప కర్ణ వికర్ణులదెసం గనుంగొని మున్న చెప్పితిన కాదె జూదంబునం బరాజయం బొంది పాండునందనులు పండ్రెండు వత్సరంబులు వనంబున బదమూఁడగునేఁడు జనపదంబున మన మెఱుంగ కుండఁ జరియింపనుం బూని కాదెభూమి

---

1. గ. రోషుఁ.

వెలువడిరి యీపదుమూఁడవ యేఁటికొలంత గలుగం బార్థుండు ద
న్నెఱింగించికొనియెనేని నెప్పటియట్ల వన వాసంబునకుం జనవలయు
నిది మనము మోహంబునం గానమి నొండె వారు లోభంబున వచ్చుట
నొండె నగుంగావున నెక్కువదక్కువలు నిరూపించి భీష్ములు దీని
నిశ్చయింపనర్హులు రిత్తయుత్తుండకాక గాండీవియు [1]నగుట మన
కార్యంబు సఫలంబు సుశర్మ నక్కడ గోవులం బట్టం బనిచి యిక్కడ
మనమును పసులం బట్టుట మత్స్యనగరంబున గౌంతేయు లున్నవా
రని శంకించి వారలు గూయి వచ్చినం గనుటకుం గాదె యిట్లు నిశ్చ
యించి చేసినపనికి నిపుడు విచారం బేల యని పలికి వెండియు
ని ట్లనియె. 185

ఉ. అర్జునుఁ డైన నేమి సుర • లైనను నే మగు విద్విష [2]చ్చిరో
పార్జిత మైనగోధనముఁ • బట్టితి మెవ్వరు వచ్చి రేని వి
స్ఫూర్జితబాహుసంపదలు • సూపుద మొండొరు మీఱి నిర్మలా
త్యూర్జితకీర్తికారణర • ణోద్ధతి వెల్వెలఁబాఱ నేటికిన్. 186

చ. మనసుల నూలుకొల్పి యను • మానము లెల్లను బాచి యేచి వా
హనములు నాయుధంబులును • నాయిత మయ్యెడుభంగిఁ జేయుచున్
మొనలకు [3]హెచ్చుగా మనము • మున్ను గడంగినఁగాక శత్రులం
గనుఁగొని యిట్టు లొండొరు మొగంబులు సూచుచు [4]నున్నఁ బోవునే

దుర్యోధనుఁడు ద్రోణాచార్యుల నధిక్షేపించుట

ఆ. హయల హేషితములు • ననుకూలవాయుసం
వసియింపను చారములును మనకు • జయముకలిమిఁ

1. క. వచ్చుట 2. జ. చ్ఛిదోపార్జిత మైనగోగణము. 3. జ. నుబ్బగా.
4. క. నుండఁ బోలునే.

దెలుపుచున్నయవి యు • ధిష్ఠిరానుజుఁ డొక్కఁడుఁ
డీబలంబు గెలువ • నెట్లు నేర్చు.

క. ఎవ్వరు వినివను దీనికి
నవ్వాదు రని యెఱుఁగఁ డకట • నాయెదురెదురన్.
వివ్వెచ్చుఁ జూపి సేనలు
గ్రొవ్వుఁ బలుపలుకు లిట్లు • ద్రోణుఁడు వలికెన్. 189

తే. రోష మొందెను రాజ్యాభి • లాష మొందెఁ
గాక యీతనిరాకకుఁ • గారణంబు
పెఱ యెఱుంగమ యెదిరిని • బెద్దఁ జేసి
పూని వందివిధంబునఁ • బొగడనేల.

వ. ఆచార్యులైనవారలు కార్యంబు దవ్వులం గనియెడువారుగాన కయ్యంబు
తెఱంగు వారల నడుగ వలవదు బుద్ధిమంతు లిండ్లకడనుండి భోజనా
వసరంబుల నాయుధ శ్రమసమయంబుల నీతిశాస్త్రగోష్ఠికాలంబుల
నుచితాలాపంబులు పలుకుదురు గానిపోట్లాడెడువారు గారు వారిం గల
నం గలసి నిలువ నీక పిఱింది దెస నిలిపినను నాకు వారువిజయంబు
గోరుచుండుట లెస్సయనిన విని యశ్వత్థామ యతని కిట్లనియె.

ఉ. కావలివారిఁ దోలి యెస • కంబున గోవులఁ [1]బట్టికొంటి నం
చీవెడమాట లేల ధర • ణీశ్వర యింతకు మున్న వీటికిం
[2]బోవవు శత్రుసే పుడిపి • పోయెడువాఁడవు గావు నీవు సై
న్యావలి యైనఁ జేర్పడక • యాతల కెద్దుబ లేదునేనియున్. 192

1. గ, దెచ్చికొంటి. 2. గం. బోవవి.

క. సమరమున గెల్చి యుత్తరా
జ్యము గొనియును సుజనుఁ డిట్టు • [1]లాడఁడు సిరిఁజూ
దమునఁ గొని రజ్జు లేటికి
సమయం బరుదెంచెఁ దొంటి • చందము గలదే. 193

ఉ. పాండవవీరులం గలన • బాహుబలంబున నోర్చియే సము
ద్దండత నీవు దొల్లి ద్రుప • దక్షితిపాత్మజుఁ గొల్చులోనికిం
దెం దని పుచ్చి తద్దెసకుఁ • దెచ్చుట సౌబలునీతిఁ గాదె యా
తండ మరల్చెఁగాక సము • దగ్రత వచ్చువిరోధి నిప్పుడున్.

వ. అబ్బంగి నవమానింపంబడినవాఁడుగావున ధార్తరాష్ట్రసైనికులధూమకేతు వగుకపికేతువు దోఁచె నీకు దుర్మదంబున ద్రోణాచార్యుల నధిక్షేపింప వచ్చు నంతియ కాక దేవదానవుల కయినను దుర్జయుం డగునర్జునునకుం దలసూప వచ్చునే నయవిక్రమంబుల నతిలోకుం డగునతని నెవ్వరి కేనియుం బొగడ వలయు ననినం బుత్త్రనిర్విశేషుం డగునిజ ప్రియశిష్యుని నగ్గించుట గురునకుం గొఱంతయె యింక సిగ్గు మాలి రణంబు సేసెనేనియు ద్రోణుండ చేయుం గాని యే నిట్టిదాని కోర్వ నదియునుంగాక.

క. ప్రళయాంతకుండు బడబా
నలమును మృత్యువును నెదిరి • నం గొఱఁతవడన్
నిలిపినను నిలుపు మార్కొని
చెలఁగిన నరుశరము [2]లనవ • శేషము సేయున్.

ఆ. కుటిలబుద్ధు లిచటఁ • గొనవు నెట్టన ఘన
దోర్బలంబు మెఱసి • తోడరవలయు

1. జ. లాడునె. 2. చ. నిరవ • శేషము.

నతఁడు గాండీవమున • నడ్డసాళులువైవఁ
[1]ధురుల నంపవాన • గురియుఁ గాని.

క. విను మట్టులుగా కున్నం
దనగోవులవెనుక మత్స్య • ధరణీశుఁడు వ
చ్చిన మార్గ్గాందుము నరుఁడే
పున ముట్టిన నతనిసొంతఁ • బోదుమె యధిపా.

వ. అనిన విని రాధేయుండు సక్రోధుం డై యోధవీరలోకంబు నాలోకించి

చ. వడిగొని గోగణంబుఁ బోదు • వం బఱతెంచితి రెల్లవారు ము
న్నొడఁబడి పాండునందనుల • యున్నెడ యిమ్మెయిఁ గాన వేఁడి యి
ప్పుడు నరుఁ గాంచి మీరతని • పోటు నుతించుచు భీతి [2]నిట్లు వా
విడిచి యనేకభంగిఁ బృథి • వీపతి పీఱఁడిఁ దేయు టొప్పునే.

చ. వెఱచితిరేని నిల్వుఁ డొక • వీరున కొక్కఁడ చాలుఁ గాక యెం
దఱు వలయుం గపిధ్వజము • దవ్వుల వ్రేల్మిడిఁ ద్రుంచివై చెదం
బఱపెదఁ దత్పిశాచముల • భగ్నము సేసెదఁ దేరు సారథిన్
నెఱఁకులు నొంచెదం బొదులు • నించెద నర్జునుగాత్రశాలలోన్

శా. జ్యాఘోషం బతిభీషణం బయి దిశా • చక్రంబు నిండన్ శర
వ్యాఘాతంబున శాత్రవుండు వికల • స్వాంతుండు గా నారద
శ్లాఘాపాత్రము నై యనర్గళభుజా • సంరంభతన్ రౌద్రరే
ఘాఘోరాకృతి యేన [3]చూపెద నళం • కం జూడుఁడీ యేర్పడన్.

1. క. ధీరుల. 2. నిట్లు వో విడిచి. 3. క చూపెదను జక్కం.

క. క్రోధజ్వాలలు నిగుడ వి
రోధిబలేంధనముఁ బొదువు • క్రూరతమై దు
స్సాధ మగునర్జునాగ్నిని
సాధించెద నేన పూని • శరవర్షమునన్. 203

వ. పాండవమధ్యముండు పదుమూఁడువత్సరంబులు పూఁచి పట్టి కయ్యంబు నకువచ్చె నతనిలావును బీరంబును లోకంబునకు నెక్కి యున్నయవి యేనును గురుసేన యందు శక్తిశౌర్యంబులు గలవాఁడనవోలె వర్తించె దం గావున నేమిరువురము నొండొరులకు బాహుబలవిలాసంబును విక్రమక్రీడాకౌశలంబును బ్రకటించుట యుచితంబు గాదె యని వెండియు నిట్లనియె.

సీ. అనుదినంబును నంత • కంతకుఁ బెడఁగెడి
యధిపతిమన్నన • యప్పు దీర్ప
నర్జును నోర్చెద • ననిలోన నే నని
యతనితోఁ బలికిన • ప్రతిన నెఱపఁ
గర్ణార్జునులయందు • ఘనుదెవ్వఁడగునొక్కొ
యనుజనంబులసంది • యంబుమాన్ప
జమదగ్నిసుతకృపా • శ్రయమునఁ బడసిన
విలువిద్యకలరూపు • వెలయఁజేయఁ

ఆ. గనుట నేఁడు పుణ్య • దిన మయ్యె నాకు మీ
[1]కెల్లఁబోరు సూడ • నిష్టమేనిఁ
జూడుఁ డట్లుగాక • వేడుక లేదేని
సంతసమునఁ బనుల • జాడఁ బొందు. 204

1. చ. కేల వోరు.

వ. అనిన నమ్మాటలు విని కృపాచార్యుం డతని కిట్లనియె. 206

ఆ. కయ్యముక యెపుడుఁ • గాలుద్రవ్వుదు కార్య
గతికిఁ జొరవునీతి • యుతులు సమర
[1]హత మసాధనముగ • నాడుదు రర్థసం
సిద్ధిఁ బొందు తెఱఁగు • సేయునెడల. 207

క. అగు దేశకాలబలయుత
ముగఁ జేసినపోర నర్థ • ములు మోఱకు లై
తెగఁబాఱి తమ్ము నెదిరిని
వగవక తొడరుటలఁ గీడు • వర్తిల్లుఁ దుదిన్. 208

వ. అక్కిరీటి యొక్కరుండ కాఁడె యని తలంతుమేని. 209

సీ. శక్రాదిసురలతో • సంగ్రామ మొనరించి
ఖాండవం బేర్చెనొ • క్కరుఁడ కాఁడె
యాదవబల మెల్ల • నాఁగఁద్రోచి సుభద్రఁ
గడిమిమైఁ దెచ్చెనొ • క్కరుఁడకాఁడె
దిగ్విజయంబునఁ • దేజంబు సేసె వి
కురువంశమునకు నొ • క్కరుఁడ కాఁడె
బలముతో గంధర్వ • పతి నోర్చి విడిపించెఁ
గౌరవేశ్వరుని నొ • క్కరుఁడ కాఁడె

ఆ. యవి నివాతకవచు • లనుదానవుల నాతఁ
డొక్కరుండ కాఁడె • యుక్కు [2]మడఁచె

---

1. గ. ఘ. మథమసాధన. 2. గ. ఖ. మడిచె.

నమరులకు నజేయు • లగుకాలకేయుల
నొక్కరుండ కాఁడె • యొడిచెఁ గర్ణ.

క. భూవరు లెల్లను నొక్కట
ద్రోవదికై తొడరి యతని • తోఁ బెనఁగి కడుం
జేవ సెడి పోవునప్పుడు
నీ వచ్చటఁగలవొ లేవొ • విక్రమ మెపుమా. 211

శా. కుంతీనందను లొక్కఁడొక్కఁడ రిపు • క్షోభంబు సంధిల్ల దు
ర్దాంతస్వైరపరాక్రమంబులు మహో • త్సాహంబునం జేసి ర
త్యంతోదగ్రతఁ బెల్చ దీ విచట నా • హాశక్తి యిమ్మేదినీ
కాంతుం డియ్యకొనంగఁ[1] బూనితి వృథా • గర్వంబు నీ కేటికిన్.

తే. ఏచి మున్నీరు సేయీఁత • నీఁద నగ్ని
నుఱుక వాసుకికోఱలు • వెఱుకఁ గడఁగి
నట్లుగాదె రాధేయ నీ • వర్జుననకుఁ
బోర నెక్కటి మార్కొనఁ • బూను టరయ.

క. బలుగాలిఁ బేర్చుదావా
నల మొక్కరుఁ డార్పఁ బోయి • నను దీఱునె నీ
చల మదుగు సాహసమునం
గలదే మే లెట్లు నధిపుఁ • గావఁగ వలదే. 214

తే. కురువిభుండును భీష్ముండు • గురుఁడు గురుత
నూభవుండును నీవునే • నును గడంగి
కూడుకొని తాఁకుదముగాక • క్రీడితోడ
నొంటిమార్కొనవశమె ము • క్కంటికైన.

1. క. జూపితి. గ. జెప్పితి.

—• కర్ణుఁడు కృపాచార్యు నధిక్షేపించి పలుకుట •—

క. అని పలికిన సంరంభం
బున నినసుతుఁ డిట్లు లను రి • పులయెడఁ జిత్తం
బున నీవు ప్రియము గలుగుటఁ
గనికని నినుఁ దోడు పిలువఁ • గాఁ బతి బేలే.

క. ఏలినవానిధనంబులు
బాలురు బంధువులుఁ దారు • బ్రదికినదినముల్
1 వ్రేలారిచి తింద్రాతని
యోలము గని పిదప భీతి • నొదుఁగుదురా జిన్. 27

క. జన్నములు సేయునెడఁ బ
క్వాన్నంబులు గుడుచు 2 చుండు • మధిపతి నిన్నుఁ.
జన్నియ విడిచె రణముతటి
మిన్నక కినువదక పొమ్ము • మీగృహమునకుఁ.

తే. ఏను విల్లందుకొనిన నీ • రేడుభువన
ములును వడవడవడఁకునా • యలఘుబాహు
బలముఁదలపక పలికితి • పార్థుఁ డనఁగ
నెంతవాఁడొక్కరథికున • కింత యేల.

వ. అనియె ని త్తెఱంగున నందఱుఁ బలుకుపలుకు లెల్ల వినుచు గాంగే
యుండు కౌరవేశ్వరు నుద్దేశించి ధర్మార్థసంగతంబునుసువిహితంబును
గానిట్లను ద్రోణాచార్యుండు నీతిపథంబునం బలికెనాచార్యతనయు

1. క. వ్రేలడఁచె తిందు రాతని: గ. మేలను చుఁ దిందు రాతని:
జ, మే లని కొని తింద్రాతని, 2, ఘ. చుంద నధిపతి

వచనంబు లుచితంబులు కృపాచార్యుండాడినచందంబును దెలిసిన పడి యున్నయది మన్నన గలమానిసి యగుట నంగరాజునకు సంగరపాట వంబుమాటలు దగుం గాక మాన్యుల నధఃకరింప దగునే యని వెండియు.

ఆ. నేల ప్రౌఢ్దెలింగి • చాలుమానిసి రణో
ద్యమ మొనర్చి కాక • తగినవారి
చెవికిఁ జేఁదు గాఁగ • నవమానవాక్యంబు
లుడుగ కిట్లు వలుకు • టొప్పు నెట్లు.

క. బీరము లావును [1]మిగులఁగ
వైరులు [2]దఱి యైనఁ దొడర • వచ్చినచోటన్.
దూరమున వెరవుతోడివి
చారము గలుగు టిది దగదె • [3]సద్బుద్ధులకున్. 222

ఆ. అరులగుణములైన • నగ్గింతు రెప్పుడుఁ
[4]గలయ బెరసినపుడు • గలితనంబు
మెఱయుదురు మహాత్ము • లెఱుఁగఁడు తుదిమొద
లెట్టివారి నితఁడు • బెట్టుపలుకు.

వ. ఆచార్యులైనవారలు పూజావాక్యంబుల కర్హులు గాక గర్హించుటకు విష యంబెయనుచుఁ గృపాశ్వత్థామలకరంబులకు నిజపాణిపుటంబులుసాఁచి యిట్లనుఁ బని సాలినంత గర్వదు వివ్వచ్ఛుండు వచ్చుచున్నవాఁడు విరో ధంబునకు సమయంబుగాదు మన మందఱముం గూడికొని కర్యంబు సేయుదము బలవద్వ్యసనంబునందు భేదంబు గలుగుటొప్ప దని

1. క. బ. గలిగెదు. 2. క. పో టొడ్డి. 3. క. సద్భటులకునున్.
4. బ. గలవ.

బుధులు సెప్పుదురు వేదంబు లొక్కవలనను ధనుర్వేదంబొక్క వల
నను గలమీయట్టిమహానుభావు లెందునుం గలరెకురుబలంబున కొకటి
పుట్టినం బ్రసిద్ధులరు గావున నది మీతలన నిలుచు నట్లుగుటంజేసి.

క. క్షమియింప వలయు నొకఁ డెఱుఁ
గమి నెమే నన్న నంతఁ • గటకటఁబడ భూ
రమణుని కార్యస్థితి చి
త్తముల దెడ సేయునట్టి • తరమే [1]మీరల్ 225

వ. అనిన విని వార లి ట్లనిరి. 226

క. క్షమియింప నెవ్వరముభూ
రమణుని కార్యమున టవ్వ • రము ద్రోణులచి
త్తము శాంతి వొందఁజేయుట
మముఁ దెలుచుట యిట్టులేల • మాకొలఁదులకున్.

వ. అనిన విని గాంగేయకర్ణులం గూర్చికొని కురుపతి గురునిం బ్రార్థించి
యశ్వత్థామను వేఁడికొని కృపాచార్యులందేర్చినం బ్రసన్నుం డయి
యోధవీరులం గలయంగనుంగొని ద్రోణాచార్యుం డి ట్లనియె. 228

తే. అలుక భీష్మునిపలుకుల • యపుడ పోయె
మీఁది కార్యంబు నపుఁడు • మీర లింక
మోహసాహసములఁగురు • ముఖ్యు దెసకుఁ
గీడురాకుండఁ దగఁ బరి • కింపవలయు.

క. వాసవనందనుఁ డెంతయు
గాసిలి యున్నాఁడు మనలఁ • గలి యించుకయుం

1. క. గ. మీకుణా.

దా సైరణ సేయఁడు గను
మోసము లేకొక్క మొగిన • మునరఁగవలయున్.

వ. అప్పుడు కురుపతి సమయకాలవిషయంబుగా నాడినమాటయుం గలదు దాని నిరూపించి యున్నరూపు గాంగేయుండు సెప్ప వలయుఁ దనిన నతండు దుర్యోధనున కిట్లనియె. 231

—• భీష్ముఁ డర్జునునజ్ఞాతవాసవత్సరవ్యాప్తి నిష్కర్షించుట •—

సీ. రెండయేఁట నొ • క్కండధిమాన మి
లెక్కినయన్నెల • విల్లఁ గూర్చి
కొవఁ బదుమూఁడు హా • యనములు దప్పక
విన్నటితోడన • విండె నింత
యెఱిఁగియ తమపూన్కి • యెల్లనుదీర్చితి
మని పొడసూపె న • ర్జునుఁడు నేఁడు
పాండుపుత్త్రులు ధర్మ • పరులు ధర్మాత్మజుం
డేరి కధిష్ఠాత • వారు ధర్మ

తే. పథము దప్పుదు రే యన్ని • పాటు లట్లు
పడినవారలు దఱియంగఁ • బాఱ నేర్తు
రెట్లు దమకించి నీతివి • హీనవృత్తిఁ
దమకు నొకకీడు వచ్చువి • ధంబు గాఁగ. 232

ఉ. అట్టిద యైన నాఁడ తఱి • యంబడి మూర్ఖతనంబు సేయరే
నెట్టన ధర్మపాశముల • నిల్చిరి కాలము వేచి యుండి రిం
కెట్టును వారు గొంత తమ • యేడ్పెల సూపక మాన నేర్తురే
ముట్టఁగ వచ్చి రేని మన • ముం దగ వోర్తముగాక దానికిన్.

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డ • వశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికినై పెనంగినబ • లంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చగుఁ గుం దగుం దొడరు • నెల్లవిధంబుల [1]నోర్చు టట్లు గా
కిచ్చఁ దలంచి యొక్కమెయి • నిత్తఱిఁ బొం దగుచేఁతయుం దగున్

వ. అనిన విని కురుపతి దరహసితవదనుం డగుచు ని ట్లనియె.

ఆ. మనకుఁ బాండురాజ • తనయవర్గమునకు
నెట్లు పొందు గలుగు • నేను రాజ్య
భాగ మీను సమర • భంగిక విక్రమ
నిరతిఁ బూను టిదియ • నిశ్చయంబు. 236

వ. అనిన నయ్యుగ్రవచనంబు లాకర్ణించి గురుం డిట్లనుఁ గార్యగతియును
గర్యంబు భంగియు భూపతికంటె మిగులం గనియెడువారు లేరయినను
నాయెఱింగిన యంత యొక్కతెఱంగు సెప్పెద నీబలంబున నాలవపాలు
గొని మహీపాలుండు సత్వరంబుగా ముందఱఁబోవవలయు నంతియ సేన
తదనంతరంబ కదుపులం బొదివికొని చన వలయుఁ దక్కటిసగంబుతో
మనము నిలిచి మోహరించి యల్లనల్లనరుగ వలయుఁ గవ్వడి యెయ్యె
డం గవిసె నయ్యెడన తలపడ వలయు నిట్లైన మానవేశ్వరుండు సుర
క్షితంబుగా సందడింబడక నడచు గోవులు [2]విన్నేలం గడచు మనమును
ధనంజయునకుం జాలినయప్పుడ యట దోడుపడ నెవ్వరు గలిగినను
వారికిం [3]జాలి నిలుత మనిన విని సురనదీసూనుండు దానికియ్యకొని
రాజన్యునకు సైన్యంబుఁ బంచి యిచ్చిపుచ్చి పసులకుం దోడగుభాగంబు

---

1. క. గ. చ. జ. కోర్చుటట్లుగా కిచ్చఁ: ఖ. ఘ. కోర్చునట్లుగా నిచ్చఁ.
2. ఘ. విన్నేలవు. 3. గ. జాలుద-జాలితి-జాలింత-మనిన.

నుం బంచి యున్నంత వట్టుచతురంగంబుల నియతి సేసికొని యాచార్యుండు వంపటను నాచార్యపుత్త్రుండు దాపటం గర్ణుండు ముందట వికర్ణ దుశ్శాసన శకుని సైంధవ సోమదత్త బాహ్లిక భూరిశ్రవః ప్రభృతియోధవీరు లెల్ల నెడనెడం గలయ నిలుచునట్లుగా మోహరించి మహోత్సాహంబున సన్నాహ సౌందర్యంబు నొంది తాలధ్వజం బెత్తించి మెఱసితాను వెనుకయయి నడపించుచుండె నట్టిసమయంబున.

చ. అరుదుగ నిట్టి లొక్కనికి • నంతబలంబునకున్ మహోగ్రసం
గర మగుడుఁ మనం బతుల • కౌతుక మొంది కనుంగొనన్ సురే
శ్వరుఁడు సుదర్శనం బనఁ బ్ర • శంసకు నెక్కువిమానమెక్కి యం
బరగతి వచ్చె దేవముని • పంక్తులు సిద్ధగణంబుఁ గొల్వఁగాన్. 238

వ. అద్దివ్యయానరత్నంబునందు. 239

తే. స్వర్గమున నున్నరాజులు • చక్రవర్తు
లును యథోచితచ్ఛత్త్రంబు • లును విజార్హ
చామరంబులుఁ జెలువొందఁ • జారులీలఁ
గొలిచియుండిరి వేడ్కలు • గొనలునిగుడ. 240

క. పాండుమహీపాలుం డా
ఖండలుచేరువన పెద్ద • గద్దియ నమరీ
మండలి విచొప్పు లిడఁగ
నుండి కనుంగొనుచు నుండె • నుజ్జ్వలభంగిన్. 241

వ. అంత. 242

సీ. దేవదత్తాభీల • రావంబు వెసఁ గర్ణ
ములు దీటుకొన లేట • మొగము వడుచు

రథనేమిదళితధ • రాధూళి యంగంబు
లెల్లఁ గప్పఁగ వెలు • వెల్ల నగుచు
బహుళకపిధ్వజ • ప్రభలు లోచనములు
మిఱుమిట్లు గొనఁ బర్వ • మెండుకొనుచు
నుద్భటాకారస • ముద్ధతి మనము లు
త్తలపడఁ దోఁపంగఁ • దల్లడిలుచు

తే. నడచుకౌరవరాజసై • న్యంబుఁ గదిసెఁ
దీఁగ దిగిచినగతిఁ దన • తేరు మెఱయ
రయముమైఁ జని ప్రళయభై • రవసహస్ర
[1]గర్జనోదగ్రఘట్టనుఁ • డర్జునుండు. 243

వ. ఇవ్విధంబునఁ గురుబలంబులఁ గ్రోశమాత్రంబునం గూడ ముట్టి
క్రీడి తల యెత్తి చూచి యుత్తరున కిట్లనియె. 244

చ. ఇది యొక పెద్దగట్టిమొన • యీమొనముందట గోగణంబుతో
నదె యొకయల్పసైన్య[2]మట • యాతల వేఱొకకొంతసేన యొ
ల్లదె యిటు పంచి పెట్టఁ[3]జను • వంతటిలోన వృథాభిమానదు
ర్మదబహుభాషి యైనకురు • రా జెచటం జనుచున్నవాఁడొకో. 245

క. అరయుదము గాని యిమ్మొ
హరమునకును డాపలించి • యరదముఁ బోని
మ్మురవడి నతనిక యుఱికెద
వరుదుగ నెబ్బంగి నెవ్వ • రడ్డం బైనన్. 246

---

1. చ. గర్జనోగ్రతర్జనుఁ డగు • నర్జునుండు. 2 గ. మట • యావల
3. గ. 'జనె • నన్నిటిలోన.

ఉ. ఆతఁడు సిక్కెనేని బల • మంతయు విచ్చు మరల్ప వచ్చు గో
వ్రాతము వట్ల యైన 1సుక • రంబుగ నంతట నెల్లఁ దీఱు నీ
యాతత సేనయం దతని • నారసి కానక యున్న వీరి ని
ట్లీతల డించి యాకదుపు • నెద్దుఁగఁ బోదముగాక వ్రేల్మిడిన్. 247

క. విచ్చి చనకుండఁ బసులం
దెచ్చుట మునుమున్న వలయు • తెఱఁ గావనికిం
జొచ్చి యది చక్కఁబెట్టఁగ
నచ్చోటన దాయ మనకు • నగపడెడు బలే. 248

క. అనిన విని యుత్తరుం డ
మ్మొనవలపటఁ బెట్టి యరద • మును బోవఁగ వి
చ్చిన సరస కరిగి కవ్వడి
కను విచ్చి బలంబు నెల్లఁ • గలయఁగఁ జూచెన్. 249

వ. ఇట్లు గలయం గనుంగొని మధ్యదక్షిణవామాగ్రపశ్చిమోత్తరభాగంబుల
నిట్టిట్టి వారలు నడచుచున్నవా రని సారథితో నేర్పడం బలికి వీరలలో
నురగకేతనుండు లేఁ డతండు గోవులం గొనిపోవ నోపు 2నిరామిషం
బై నయీ సేనతో నని సేయం బనిలేదు వీరలెఱిఁగి యడ్డపడి తడవు
సేయకుండునట్లుగా ముట్టికొని పసులం బెట్టించి దొరయును 3నెల
గడవం బోవక యుండఁ బొదువ వలయు నని చెప్పి యతని నద్దెసకుఁ
దేరు వఱుపం బనిచి గురుకృపగాంగేయులకుఁ జరణసమీపస్థలంబులం
బడ రెండును గర్ణాభ్యర్ణప్రదేశంబులం జన రెండునుగా నాలుగేసి

1 చ. సుక • రం బగు. 2 గ. నిరామిషమైన.

3. 'నెల' అని పెక్కుప్రతుల లేదు,

యమ్ము లేసిన నాసవ్యసాచిం జూచి యాచార్యుండు పరినరవర్తు లగు నా ప్రజవంబులతో నల్లన యర్జునుం డింత యొప్పియుండునేయని యగ్గించి వెండియు. 250

—• ద్రోణాచార్యుఁ డర్జునుం జూచి ప్రశంసించుట •—

మ. విలసద్గాండివచాలనోద్ధతి కన • ద్విద్యుల్లతా లీలగా
నలఘుస్ఫారకపిధ్వజధ్వని సము • ద్యద్గర్జ చందంబుగా
జలదాకారత నొందెఁ దే రితఁడు ప • ర్జన్యాకృతిం బొల్చె దో
ర్బలతీవ్రారినిదాఘదుర్విషహగ • ర్వస్ఫూర్తి [1]నిర్మూర్తిగాఁ జా. 251

వ. ఇప్పుడు నాకుఁ బ్రణామంబులుగాఁ బాదంబులమొదలం బడ రెం డమ్ములేసిపెద్దకాలం బేనిఁ బాసి యున్నవాఁడు గావునఁ గుశలప్రశ్నం బుగాఁ జెవులు సోఁకి యంజోఁకములుగా రెం డమ్ము లేసె నని పలికి వెండియు ని ట్లనియె. 252

క ఇదుమలఁ బదుమూఁ డేండ్లుం
బడి కడుఁ గోపించి వచ్చె • బలువిడి నీక
వ్వడిఁ దటియ నుటికి వడి ని
ప్పుడ [2]యిమ్ముఖుబ్రోవు నెల్లఁ • బొరిగొనెడు బలే. 253

తే. విపినవాసంబు నజ్ఞాత • [3]విధమువర్త
నంబు గడపి నవాభ్యుద • యంబు నొంది
రాత్రిఁ బుచ్చి తోతెంచుమా • ర్తాండుమాడ్కిఁ
జూడ నుజ్జ్వలుం డగుచు వ • ర్జునుఁడు వొలిచె. 254

1 క. మమ్మార్తిరియై. 2 గ. యుమ్ముఖుఁబ్రోవు. 3. వివిధవర్తనంబు.

వ. అనియెఁ గృపాచార్యభీష్ములు పార్థుబాణపాతప్రకారంబులు ప్రణామ కుశలప్రశ్నంబులుగా నంతరంగంబులం గనికొని సంతసిల్లిరి ధనంజ యుండును దక్కినవారికి దుర్నిరీక్ష్యం డగుచు నమ్మోహరంబుదెస ననాదరంబు సేసి గోవులపజ్జం బోవుచుండె నతనిం జూచి సురనదీ సూనుండు కురువీరులతో ని ట్లనియె. 255

క. చిరకాలమునకు గంటిమి
నరు నక్కట వీఁడు సజ్జ • నప్రియుఁడు సుహృ
త్పరతంత్రుఁడు బాంధవహితుఁ
డరిభీకరుఁ డిట్టివార • లవనిం గలరే. 256

క. మనచూడ్కికి వ్రేఁగయి యీ
తనియతులితమూ ర్తియత్య • దా త్తతఁ గడు నొ
ప్పినయది గంటిరె జగ మె
ల్లను నేలఁగఁ దగుసముజ్జ్వ • లత యూహింపన్. 257

క. వెనుకదెస వచ్చి కదిసియుఁ
దనరథము దొలంగనిచ్చి • తఱియఁబడుట కొ
ల్లనితలఁపు గలిగి క్రేఁగం
టన మనలం జూచుచుం గ • దవి యట నడచెన్. 258

క. మొనఁ గలయఁ జూచి యారక
చను టధిపతి నరసి తా ని • చటఁ గానక యా
తనిపజ్జ నరుగు తెఱఁ గగు
ననుమానము లేదు క్రోధ • మగ్గలము మదిన్. 259

---

1. గ. నొంటిఁ జాలఁ దవి.

చ. మనకుఁ గౌరవేంద్రునకు మధ్యముఁ జొచ్చెదవేని నాతఁ డ
ర్జునునకు [1]నొంటి సాలఁ డని • రుద్రుఁడు నెక్కటి మార్కొనంగ లేఁ
డనిన నొరుండు శక్తుఁడె ర • యంబు మెయిన్ మన మెల్ల నిప్పు డా
తనికడ సేరఁగా జనుట • తప్పినఁ గార్యము దప్పు నెంతయున్.

ఆ. వాసవాత్మజుండు • వసుధేశనందను
ముట్టికొనిన నొకటి • వుట్టెనేని
మన ప్రయోజనంబు • మఱియేమిపను లవి
యేటి కొందుధనము • లెల్ల నేల. 261

వ. అని పలికి బలంబుఁ బురికొల్పికొని యతండు రాజరక్షణతత్పరత్వం
బున నరదంబు సత్వరంబు సేసిన సేనాపతిం గని సైనికనికాయంబులం
గడఁగి చనం దొడంగె నిప్పాట నమ్మేటిమొనయును వెసం బోవ గోవుల
కావలిమూఁకయు వానిం దఱిమికొని యతిరయంబున నరుగం దానును
[2]గెలనఁ గ్రోశద్వయమాత్రంబు నడచి పురుహూతపుత్త్రుం డుత్త
రున కి ట్లనియె. 262

మ. ఇదె గోవర్గము సేరవచ్చితిమి వో • నిం కేల సైన్యంబులం
గదియన్ వే చనుదెంచె రెంటినడుము • గాఁ జొచ్చి యీవచ్చున
న్మద వీరావలికిన్ భుజావిభవవి • న్యాసంబు గాన్పించి మా
న్పెద గర్వంబు మరల్చెదం బసుల నా • చేఁ జిక్కు డా జెమ్మెయిన్.

—• యుద్ధారంభము •—

క. అనుటయు విరాటతనయుఁడు
మొన కడ్డముగాఁగఁ దూర్పు • మొగమై రథముం

1. గ నొంటిఁ జాలఁ డని. 2. గ. గెలపట, ఙ. గెలవిపట్ల.

గావి కట్టెదిరికి బోయినఁ
దనమూఁపులు రెండు నపుడు • దలకుం గడవన్. 264

వ. తేరు సమ్ముఖంబు సేయించి పేరువాడి క్రీడి కరతలం బెత్తి నిలునిలుమని యదల్చిన ఘోషంబుతోడన వెడలు నిశితశరపరంపరలఁ దట్టంపుఁ బఱపు నన్నంబరంబు నీరంధ్రంబగుటయుఁ దదంధకారంబును భయతిమిరంబునుం గవిసి గుండియ లవిసి కురుబలంబు లెదురు నడవను మరలం బఱవను మఱచి వెఱచఱచి హరితనయహస్తలాఘవప్రశస్తి దక్కం దక్కినచేష్టలు తక్కియుండె నతండు గోవులవెనుకం బోవు నల్పబలంబు బెదరి తూర్పుదెసకుం జెదరునట్లుగా నరదంబుఁ బఱపించి తెఱపిసూపి [1]వెలిచీర సారించి దేవదత్తంబు పూరించినం గేతుకపి గర్జిల్లం దదీయభూతంబులార్వ మౌర్వీరవంబును రథనేమినినదంబును బ్రతిపతాకినీతుములంబును గగనంబునం బొగడునమరులయెలుంగులును నొక్కటఁ జెలంగ సముదితసాంద్రసంరావంబు రోదసీకుహరంబు నిండిన నొండొండ [2]పట్టలెత్తికొని నేల మట్టవియుచు విద్రవం బసులు వెనం దిరిగి మన్ను విన్వచ్చుండు వచ్చినజాడ గైకొని దక్షిణ దిశకుఁ [3]గెరలువాడుచుచుం దెరలం బాఱిన. 265

క. గోవులతోఁ బొదువంబడి
పోవుచు నున్నట్టి గోప • పుంజంబు తదీ
యావసరంబున సరభస
మై వానిఁబిఱుందఁ దిరిగి • యమ్మోయిఁ బఱచెన్. 266

1 గ. విలునారి. 2 జ. మంట.
3 క. కెరలుపొడుచుచు, ఖ గ ఘ జ ట. జెరలువాడుచుచు,
చ. జిఱ్ఱలువాడుచుచు.

ఆ. అప్పు డర్జునుండు • దప్పక చూచి యీ
బలము పసుల కడ్డ • పడక యుండ
నెడసొరంగవలయు • నిట యెద్దుకొను మని
పనిచె మత్స్యభూమి • పాలుసుతుని. 267

క. పనిచిన నాతఁడు నమ్మెయి
జన నిచ్చె రథంబు గోప • సంఘముఁ దిరమై
కొనిపొందు పసులనోడక
యన్ని[1]తానెలుఁగించి వీటి • కై నూల్కొలిపెన్. 268

వ. అట్టి సమయంబున. 269

క. కరితురగనమితి [2]గార్కొని
కురువీరులమొనలు మొగులు • కొమరునఁ గవియన్
శరవేగంబున నరుఁ డు
ద్ధరమారుతచండభంగి • దోఁప దెరల్చెన్. 270

క. కదిసిన బలములు విచ్చినఁ
గదుపులఁ జెదరంగనీక • గాండీవి వెనం
బొదివి యట కడపె నవియును
గొదగొవి తమపొలము సొచ్చె • గోపాలురతోన్. 271

వ. అవి చెప్పవ విస్మయంబు నొంది 272

ఆ. పసులు వట్టువడిన • పదపడి నరుఁ డెద్ది
యాచరించెఁ గౌర • వాధినాథుఁ

1. గ. తానెలుఁగిచ్చి, 2 గ. గార్కొని. కురువీరులు మొగులగముల • కొమరున, జ. గూర్కొని కురువీరులు మొగులు గవియు • కొమరున.

దేమి సేసె బలము • లెట్లయ్యె భీష్మాది
వీరు లెవ్విధంబు • వార లైరి. 273

వ. అనవుడు. 274

మ. నవతాదూర పురాణతానుపగతా • నానాత్వ [1]సంశోభితా
వివిధత్వావగమోజ్జ్వలా బహుకళా • విద్యావశాలీ సము
ద్భవరాహిత్యనిరూఢ సూక్ష్మతర [2]సం • భాసా మహాస్థూలమూ
ర్తివిశేషా నిరుపాధికా గుణమయా • [3]ధీవర్తకా నిష్క్రియా. 275

క. అంతఃకరణచతుష్టయ
శాంతిసముద్యద్వివేక • సంపద్వేద్యా
చింతాతంతుత్రుటనా
త్యంతవిదగ్ధైకభజన • తత్పరహృద్యా. 276

మాలిని. ప్రణమదవనవిద్యా • ప్రౌఢిసంరూఢకాంతి
ప్రణుతచరణపద్మా • పద్మజాదిత్యసత్పో
షణచతురదయావి • స్ఫారితాలోక లోకా
వననిపుణజనాంచ • ద్భక్తివిక్రీతమూర్తీ. 277

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన
విరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతం
బునవిరాటపర్వంబునందుఁ జతుర్థాశ్వాసము.

1. గ. సంబోధితా. 2 ఙ. సం • భాషా, చ. సంభావా. 3. నిర్వర్తకా.



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము



## విరాటపర్వము—పంచమాశ్వాసము

—○○✿○○—

సంపాదనచాతు
ర్యా పేవ్యపదారవింద • యౌగికవిద్యో
ద్భాసితమతిమూ ర్తిమయా
వ్యాసపమాసైకరూప • హరిహరనాథా. 1

—• అర్జునుఁ డుత్తరునకుఁ గౌరవవీరుల వేఱువేఱ నిరూపించి చెప్పుట •—

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నవ్విధంబున విరోధి వర్గంబుక్కు దక్కి వెక్కసపడి చూచుచుండ నిరర్గళభుజార్గళసంరంభ విజృంభణంబు శోభిల్లఁ బసులంబెట్టించి యనతిదూరవర్తియగు కౌరవ చక్రవర్తిదెసంగనుంగొని ధనంజయుండు భూమింజయు నక్కడఁ దేరు వఱపం బనుప నప్పళించునప్పుడు కురువీరులుగూడుకొనిమూఁడు వేలరథంబులతోడను గాంగేయకర్ణులొక్కొక్కరుండు వేయింటితోడను దలకడచి రాజున కడ్డపడి కవ్వడిదిక్కు మొగంబుగాఁ దిరిగి రట్టియెడఁ గదుపులు పట్టువడుటకు నిట్టూర్పు నిగిడించుచు మగిడి మనుజపతియు ననుజసహితుండై సహస్ర స్యందనంబులతోడ వెన్నుదన్ని నిలిచె

---

1. క గ జ. ద్భాసితమూర్తిమయా—సం—శ్రీ—సద్—వ్యాసమానైకరూపః
ఖ ఘ. ద్భాసిత—మతి—గుణ—మూర్తిమయా—వ్యాసనమానైకరూపః

క. శస్త్రప్రకారనిపుణుం
డస్త్రవిదుఁడు దూరపాత • నాభీలుఁడు వ
ర్ధస్తారిసితరిపుఁడు ధను
శ్శాస్త్రపరిజ్ఞానమునఁ ద • సదృశుఁడు శక్తిన్. 6

ఉ. ఈతనితోడికయ్యమున • కియ్యకొనం దగ దేను దుష్ప్రథ
[1]ద్యూతజయోద్ధతుం డగుసు • యోధనునిం బరిమార్పఁ బోవుచో
శాతశరోత్కరం బితఁడు • చక్కఁగ నేయునొ నన్ను నేయఁడో
చూతము యన ము న్ననికిఁ • జొచ్చినఁ జొత్తముగాక పిమ్మటన్. 7

క. గురుపుత్రుఁడు తేజోనిధి
సురాసురులకై నఁ దేఁటి • చూడ నరిది సం
గరమున [2]సీతని నీశ్వర
వరజనితుఁడు మేటి కౌర • వవ్యూహమునన్, 8

క. ధైర్యధనుఁ డితఁడు ద్రోణా
చార్యుల కెనవచ్చు దిష్వ • శరవిదుఁడు కృపా
చార్యుఁడు మత్పితృసఖుఁ డా
చార్యక మొనరించె మాకు • శైశవమునఁ దాన్. 9

తే. వీర లిరువురు మాన్యులు • వీరితోడి
కయ్యమున కిప్డు మన మంత • గాలు ద్రవ్వ
వలవ దెచ్చోట నెదురుగా • మెలఁగి రథము
మనరథం బల్లనల్లన • చన గ నిమ్ము. 10

శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు రణో • ద్యోగానురక్తుండు దు
ష్పాధప్రక్రమబాహువీర్యుఁడు గురు • క్ష్మాపాలవాల్లభ్యల

1 క. జయోన్నతుం డగు 2 గ. సీతం డీశ్వర.

క్ష్మాధామాత్ముఁడు జామదగ్న్యకలిత • శ్రేష్ఠాస్త్రవిద్యాఢ్యుఁ డీ
ధాధేయుం డొకచీరికిం గొనఁడు పే • ర్వ్రాతముం బోరులన్. 11

క. శౌర్యాటోపంబున దో
ర్వీర్యంబున నస్త్రశస్త్ర • విత్త్వమునను మా
త్సర్యంబు సేయు నాకును
దుర్యోధనుఁ డెపుడుఁ దన్నె • దురు సేయంగన్. 12

చ. అతిదృఢవేది పేరుగల • యట్టిమగండు రణంబు గల్గె నేఁ
డితనికి నాకుఁ దెల్లముగ • నిట్టియెడం బరికించి చూడుమీ
మతి గలఁగంగ నీక యను • మానము వాయఁగ నీవు సాయకో
ద్ధతిఁ బ్రకటించుచో బహువి • ధంబుల నిద్దఱతారతమ్యముల్. 13

క. ఈయెడ నను గని వారణ
సేయుదు నితఁ డగ్గమైన • చిచ్చులపిడు గై
పోయి పయిఁ బడుదు నీ వర
వాయించుక లేక పఱప • వలయు రథంబున్. 14

ఉ. ఉగ్రుఁ డనూనమానమహి • మోన్నతచిత్తుఁ డజయ్యవిక్రమో
దగ్రుఁడు హస్తలాఘవస • మన్వితుఁ డేయునెడన్ సమగ్రకో
పాగ్రహబుద్ధి మాదెస న • నార్యుఁడు గార్యమునందు ధారరా
ష్ట్రాగ్రజుఁ డితనిం గదిసి • నప్పుడు పందుపు నాకు నుత్తరా. 15

తే అరసికొని యెన్నిభంగుల • నైన నితని
తేరు మనబారి కగపడు • తెఱఁగు గాంచి
యదరిపాటుబడైయెవ్వ • రడ్డపడిన
మేలువు మెలఁచిన చాడ్పునఁ • దఱియఁ జొరుము. 16

క. అస్మత్పితామహుం డతి
విస్మయజననప్రతాప • విభవాగ్నిశిఖా
భస్మీభూతప్రతిప
క్షస్మయకాననుఁడు ప్రథమ • గణ్యుఁడు బుద్ధిన్. 17

క. బహుమహితాయుధవిద్యా
రహస్యసంవేది ధాత్ర • రాష్ట్రులకును మా
కు హితంబ కోరు సముఁడై
[1]సహాయుఁ డగు వారలకు న • చటఁ దానునికిన్. 18

క. వివిధము లగులక్ష్యంబులు
నవలీలం దునియ నాట • నవియఁగ నేయున్
భువనైకధన్వి నత్యు
గ్రవిచేష్టితు నోర్వఁ బరశు • రాముం బోరన్. 19

క. శంతనునందనునరదము
పొంతం బోవలవ దలుక • పుట్టి యతఁడు భూ
[2]కాంతునకు సైన్యమునకుం
[3]జెంతలఁ జేరంగ నీక • సిలుగులఁ బెట్టున్. 20

వ. అని యిట్లు వేఱువేఱ చూపి క్రమంబున నేర్పడం జెప్పి సవ్యసాచి సమరోన్ముఖుం డగుసమయంబున నస్మితుండగుచు నశ్వత్థామ రవి తనయునవలోకించి యిట్లనియె. 21

క. నిను నీవ పొగడికొని పలి
కినపలుకులు పెక్కు గలవు • క్రీడి యనికి వ

---

1 క గ జ. సహాయ మగు. 2 గ కాంతునిదెస. 3 జ. జెంతం.

చ్చినవాఁ డిదె పులివలె మా
ర్కొనరాదే కర్ణ సేన • కుం బ్రియ మెసఁగన్. 22

క. తలఁకు గల దేని శకునిం
బిలిచి విచారింపఁ బొమ్ము • పృథివీపతి నీ
తలన [1]తనకార్యఖడ్గం
బలమో పెక్కించె రిత్త • వోవునె నీకున్. 23

వ. అవిన విని యతండు క్రోధఘూర్ణమాన[2]తారకుం డగుచు ని ట్లనియె.

చ. తలఁకెడువానికిన్ [3]మగఁడ • తానపె వన్నడిఁకించువాఁ డిసీ
పలుకకుఁ [4]భీతున ట్లొదుఁగఁ • బాఱునె సూరుఁడు నిన్ను నచ్చియే
కలనికి వచ్చితిన్ నరుఁడు • కాఁ డట వాసవుఁ డైన నేమి నా
బలముఁ జలంబు నేరిమియు • బంటుతనంబును నీవ చూడుమీ. 25

క. అని కడఁగునినసుతునకు
న్మను ద్రోణుఁడు ద్రోణనంద • నుఁడుఁ గృపుఁడును శాం
తనవుఁడుఁ గడఁగుట దుర్యో
ధనుఁ డవలోకించి యత్యు • దగ్రతఁ గడఁగెన్. 26

వ. ఇవ్విధంబుననయ్యేవురుదొరలును ధరణీశుండును సరభసంబుగా బరవ
సంబు సేసిన దుశ్శాసన దుష్ప్రహదుర్ముఖప్రముఖనిఖిలకురు కుమార
నికాయంబును శకుని సైంధవ ప్రభృతిబంధునివహంబును బాహ్లిక
సోమదత్తాదిసామంతనికురుంబంబును మఱియునుం గలవివిధయోధ

---

1 క ఖ గ జ. మనకార్య. 2 గ. మానసుం డగుచు.

3 క. మగఁడు తానపె, గ. మగఁడఁదానపె. 4. భీరువ.

వీరనిచయంబును నొక్కెటఁ గరటిఘటాఘోటకధట్టరథయాథపదాతి
వితతిసంరంభశుంభత్సేనాసమూహసహితంబుగాఁ ద్రోచి నడచిన. 27

చ. ధరణి వడంకె ధూళి దివిఁ • దన్నిన భానుని గానరాద బం
ధురవివిధప్రకారపటు • తూర్యరవంబులఁ బొంగె దిక్కు లా
స్ఫురితమహాయుధోగ్రరుచి • పుంజవిజృంభణఘోర మయ్యె నం
తరము సహస్రనేత్రముఖ • దైవతమండలదుర్నిరీక్ష మై. 28

—• అర్జునుఁడు కౌరవసైన్యంబుల నుఱుమాడుట •—

వ అట్టియెడ నుద్భటహాసోల్లాభాసురముఖుం డగుచు శతమఖతనయుండు.

చ. గుణమ న ల స్తకంబునను • గోటియుగంబునఁ గేలఁ [1]దార భీ
షణమ న నుప్పతిల్లి రభ • సంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట న • రాతిబలంబులఁ గప్ప గాండివ
క్వణనము రోదసీకుహార • కర్పరముం బగిలింప నుగ్రతన్. 30

క. తలపడి తలమీఱినకా
ల్బలములఁ బొడిసేయ మఱియుఁ • బైపైఁ బీనుం
గులఁద్రొక్కికొనుచు వెనముం
గలిమొనగవియుటయుఁ [2]గడఁక • గడలుకొనంగన్. 31

క. తన దృష్టియు ముష్టియుఁ దగు
ననువున మున్నొత్తియేయ • నతఁడప్పు[3]డు డిం
చినకాయముల సపాటం
బునఁ బదియుఁ బదేను మచ్చి • పోయెం గోలన్. 32

1 గ. ధార, 2 క. పేర్కు. 3 'ఉడించిన' అనియే ప్రతులు.

చ. ఉడుగక వెండియుఁ సుభటు • లొక్క మొగిన్ వెస వంట చాకి క
వ్వడిపటుబాణభాస్వదని • వార్యసముద్ధతిఁజేసి మంటలో
మిడుతలు సొచ్చిన ట్లయిన • మేటిమగల్ గని యాడఁబోక బ
ల్విడి మఱియుఁ వడిం బొదువఁ బ్రేల్మిడిఁ ద్రుంచె నతండు దోర్బలో

తే. అంతకంతకుఁ గదిసి సై • న్యములు సుట్టు
ముట్టి శస్త్రాస్త్రసంచయ • మున నభంబు
దీటుకొనునట్లు సేయఁ గి • రీటి గాండి
వంబుపరిచాలనంబు దీ • వ్రంబు గాఁగ. 34

సీ. గోరఁ బోఁడిమాడ్కిఁ • గొన్నింటిఁ జక్కసాఁ
బాలుగా [1]వ్రయ్యలు • వాపి పాపి
[2]బాటిన నలికిన • భంగిఁ గొన్నింటిఁ దు
త్తునియలుగా [3]బిట్టు • త్రుంచి త్రుంచి
వెస అంపమున విద్ధ • వసిగఁ గొన్నిటి నిసు
మంతలుగా నులు • మాడి యాడి
పనివడి టోలఁ గొ • ట్టినలీలఁ గొన్నింటిఁ
జిలునుగ్గుగాఁ బొడి • సేసి చేసి

తే. యడరిపొదివినబలమునా • నాయుధములఁ
బ్రతిహతంబులఁగావించె • నతిదయమున
నక్షతధ్వజసూతహ • యత్వలసద
ఫల్గురథవల్గనుం డగు • ఫల్గునుండు. 35

క. ఆమెయిన వివిధవర్మ
స్తోమం బిలవుళ్ళు సేసి • సునిశితబాణో

1 జ. వ్రక్కలు, 2 క. బాడిత, గ. బాడిద, 3 ఘ. బెట్టు.

మ. ఒకమాత్రన్ వితతప్రసారనిబిడా • త్యుగ్రాస్త్రసంతానముల్
సకలానీకములందుఁ బర్వ నరుఖా • స్వస్మూర్తి శోభిల్లె దీ
ప్తికరాపంబులు లోక మంతటను వి • స్తీర్ణంబులై యోగప
ద్యకృతవ్యాప్తి వెలుంగ నొప్పెసఁగుమా • ర్తాండున్ విడంబించుచున్.

క. నరు లోరులు దృశ్యములపైఁ
బరఁగింపఁగఁజూడ్కి లెట్లు వదుఁ దప్పక య
ప్పురుసున నరుఁ డేయునిశిత
శరములు లక్ష్యములు దప్పి • చన వించుకయున్. 43

క. గజఘోటకరథసూత
ధ్వజకంకటయోధగాత్ర • తతియం దెచటన్
విజయధనుర్ముక్తశర
వ్రజములుదగవులంగఁ బడ క • వారణ నిగుడున్. 44

చ. కవదొన లేల పూనునొకొ • కవ్వడి నా వల దుగ్రసంగరో
త్సవమున సవ్యపాణి నప • సవ్యకరంబున మార్చిమార్చి గాం
డివము ధరింపఁగా శరప • టిష్ఠతయుం బొరిఁ జేయి మార్చి తూ
పువెరవుతోన పీడ్వడక • పొం దొదఁగూడెడు [1]నేర్పు సూచినన్ 45

క. సమవిషమవినిమ్నోన్నత
సమీపదూరస్థలములు • సదృశములు గఁ [2]జి
త్రముక్రియ నవిహతగతులను
సమరమహింగ్రిడిరథము • నను నవితథ మై, 46

వ. వెండియు నతండు. 47

---

1, నేర్పు. 2, జి. జిత్రముక్రియ నవహిత.

మ. బల మెల్లన్ [1]వెలి రెండుపాయలు గ ళం • భద్వేగుఁడై చొచ్చియా
వలగా నడ్డము వచ్చి నాలువు గ దు • ర్వారోద్ధతిం బోయి మూ
లల నానాశకలాకృతిం బొరయ లీ • లాయానదుర్దాంతుఁ డై
వలయంబుల్ సని చించి చిక్కు వఱుచున్ • వైకల్యసంపాదియై

వ. ఇవ్విధంబున నంబుధిలోన మహామత్స్యంబు విహరించుచందంబునదదీయ
రథంబు గౌరవసైన్యంబునందు సంచరించుచున్యవసరంబున. 49

ఆ. రత్న కేతనములు • రాజితశేఖరం
బులును రుచిరఘంటి • కలును బార్థ
బాణనిహతిఁదునిసి • పడుఁ గౌరవులచేటు
దెలుప రుల్ల [2]నుల్క • ములనుబోలె. 50

క. వరుభల్లంబుల నగ్రిమ
చరణంబులు ద్రెస్స్రి మ్రొగ్గు • జవనాశ్వంబుల్
కరుణ మెయి [3]రాహుతులకున్
శరణం బగు మనుచ మ్రొక్కు • చందంబొందెన్. 51

క. దంతిఘటాసంతానము
కుంతీసుతనారసములఁ గూలినతఱి వ
త్యంతనిబిడాభ్రమున దివి
యెంతయు నొంపారుభంగి • నిల చెలు వొందెన్. 52

క. పలుపులఁ గాండ్లుం బగ్గం
బులఁ దనయస్త్రంబు లదరి • పొడిసేసిన వి

1. జ, వెన; 2. గ; నుల్కు • శతుమాం 3. క, రావుతులకున్.

చ్చలవిడిఁ బాతెదురర్థ్యం
బల సేయఁడు దివిజరాజ • పుత్త్రుఁడు గృపతోన్. 53

ఆ. అర్జునాస్త్రముఖఁడి • తాతపత్రధ్వజ
చామరములు గాలిఁ • జదల దూలం
జిహ్వాములవిభూతిఁ • జెందంగఁ గని యొప్పె
నప్పు డాడుచున్న • యట్ల లచట. 54

క. ఒకమఱి కిరీటి కట్టెది
రికి 1నమ్మమునఁ బోయి రేని • రెండవమాఱి
య్యకొనుట కోర్వగ లేరై
రాకళ్లఁ గురురాజుసేన • యోధులలోనన్. 55

సీ. మండితధ్వజదండ • మండలంబులఁ గిట్టి
2విటతాటనంబుగా • విఱిచి విఱిచి
చటులఖురోద్ధూతా • శ్వశ్రేణిఁ బొదవి ర
యంబునఁ దునిమి తూఁ • టాడు యాడి
రాజితబహువిధ • రథసమూహముఁ జొచ్చి
గలిబిలి యగునట్లు • గలఁచి కలఁచి
మదభరభీషణ • మాతంగముల ముట్టి
చిందఱవందఱ చేసి చేసి

ఆ. పటుపదాతిచయము • పై రౌద్రరసమహో
గ్రముగ వఱతి వేలఁ • జమరి చమరి

1, క. వణమున; ఘ. గ్రమ్మవఁ, 2. చ. పీటతాటంబుగా.

సవ్యసాచిబాణ • సంఘంబు మత్తిభం
డాలఘోరలీలఁ • గేలి సలిపె. 56

ఉ. శిక్షితచిత్రసంగరవి • శేషములం బ్రతిహేతిఖండనా
దక్షతపెంపుసొంపునను • దైవబలంబున నత్తఱిన్ సహా
స్రాక్షతనూజసారథిర • థాశ్వచయధ్వజముల్ పరాస్త్రశ
స్త్రక్షతి లేక యొప్పెఁ గురు • సైన్యము [1]వెక్కసమంది బెగ్గిలన్.

క. తేజోధనఁ డగునరుఁడు
ద్రాజితగతి నడుమ మెఱసి • బడబాగ్ని దళం
బై జలనిధిఁ ద్రెక్కొనియెడు
నోజం గురుబలముపేర్మి • యుడిపెం దోడ్తోన్. 58

తే. కాలపక్వంబులైనలో • కముల జముఁడు
వారిసమరెడువాడ్పున • మారిమసఁగి
యుగ్రరూపుఁడై శౌర్యస • ముగ్ర బాహు
సంపదుద్దాముఁడగుక్రీడి • సంపెరిపుల. 59

వ. అట్టియెడమున్ను తురంగముఖురాములందూలిన కెందూళియుం బైపయి వెగయఁ బరబలంబు నెత్తుట జొత్తిల్లుచు నుచ్చిచనువివ్వచ్చునిశితశర పరంపరలును సైనిక శరీరంబులపై సుడిసి తడిసి రుధిరశీకరనికరరవి కిరణపరిణతంబగు నమీరణంబును ధారాళకరాళరక్తపరిషిక్తవిశ్వంభరా [2]భాగంబును గలయం గెంపుసొంపు సంపాదించియకాల సంధ్యానావ హించినందదుచిత వ్యాపారపారగతంబులై పొడసూపిన యుడుగణంబు లంబోలెఁ బొలుచుధనంజయసాయకదళితకుంజరకుంభవికీర్ణ మౌక్తిక

1. జ. విన్వెఱ గంది. 2. క. నభోభాగంబులం

విసరంబులవలనను సముదీర్ణమదవేగదుర్నివారవారణ విదారణంబుల గునర్జునాస్త్రపాతంబుల బెదరి తేం ట్లెగయుట పోంగ లెగయుటయుం బ్రతిభటబాణ ఘట్టనంబునం బాండవమధ్యమకాండప్రకాండంబుల విబిధజ్వాలలు నిగుడుట మంటయునుగా మూర్తం బగుతదీయక్రోధదవానలంబు ఛటచ్ఛటాశబ్దంబుల చాడ్పునంజెలంగుచున్న యుధిష్ఠిరానుజాత నిష్ఠుర భల్లభజ్యమానబలవదరాతిఖరాస్థి నిస్వనంబులవలనను దొట్టి తొట్టి యెడనెడ మడువులు గట్టుశోణితంబు నీళ్లనందుఁ బడి తేలాడు వెలిగొడుగులు పుండరీకంబులును, వింజామరలు మరాళ పుంజంబును నై కొలంకులచందంబు నొంద వాని[1] కెలఁగెడుకొదమతుమ్మెదపదుపుల పగిదిఁ దొరఁగునాఖండలతనయఖండితపరవీరకాలాయసనారాచశకలంబుల వలనను గిరీటిశర పాటవపరిస్ఫోటితరిపుకపాలగళితమస్తిష్క[2]పలలపంకంబునను నలుదెసల నంతంతఁ గదియం జొఁగిపడి యున్న కృత్తకరచరణంబులను వెదపదనికి రొంపి గలంచి వరుజాలు పదిలంబుగా నమర్చినకేదారంబు తెఱంగు దోఁచుటకు నీడై చతురహాలికుండు సల్లపరువంపు మొలకలచెలువునఁ బెల్లుడుల్లుఫల్గునాశుగ సంతాడన వికీర్ణశత్రుశేఖరవజ్రవజంబులవలనను సంగ్రామం బభిరామం బయ్యును ఘోరప్రకారం బయ్యె నమ్మహాభయంకరసంకులసమరంబున. 60

చ. ఉఱక విరోధిసైన్యముల • నుక్కుమడంగఁగ నుల్లసద్గతిం
బఱప రథద్విపాశ్వములు • పాండవమధ్యము తేరువీథియం
దఱవఱలై పడం గని భ • యంపడి యిద్దెసవచ్చె నేని న
త్తెఱఁ గయి పోమె యంచు[3] నెడ • తెంపిగఁ గొందఱు[4] పాయఁబాఱఁగన్

1. గ. కరిగెడు. 2. జ. పటలంబునను. 3. క. నెడతెంపుగఁ; ఘ. నెడ త్రెవ్వఁగఁ. 4. గ. పాయివాఱఁగన్.

క. వాలమ్ములు దాఁకి ధరన్
ద్రాలుభటులఁ జూచియోదలు • వడఁకఁగ మేనుల్
దూలఁగఁ దముఁ దాఁకకయును
నాలము సాలించి కొందఱ[1] • అవలఁ జనంగన్ 62

తే. ప్రొద్దుగ్రుంకిన మఱి కాని • పోనఁడొక్క-
క్రీడియని కొంద ఱాజికి • నీడఁబోవ
బలము నెల్లను దెగటాఱఁ • బఱసి కాని
తక్కఁడెట్టులుననుచుఁగొం • దఱు చలింప. 63

క. తరతరమ ప్రజలఁ దునిమెడు
నరునప్పటియె త్రికోలు • నకు సురవిద్యా
ధరఖేచరులును భీతిం
బొరసిరి తమదెనకు నేమి • పుట్టునొ యనుచున్, 63

క. తమతమయొద్దిబలంబులు
క్రమవిరళము లైన దొరలు • గాండివిపై ను
గ్రముగఁ దఱుముటయు నాతఁడు
సమరోల్లాసమున దివ్య • శరతత్పరుఁడై. 65

సీ. ఆచార్యు డెబ్బది • యమ్ముల నాచార్య
పుత్రు నేడింటఁ గృ • పునిఁ బదింట
దుష్ప్రిహుఁ బంద్రెంట • దుశ్శాసనునిఁ బది
యేనింట సౌబలు • నెనిమిదింట

1. క. గ. అవుల చనంగన్.

సమరనదీసూను • నలువదింటను నేసి
రవిసుతురథ్యసా • రథుల నొంచి
వర్మమంతయుఁ ద్రుంచి • వైచి మర్మస్థిరం
ధములు భేదించి వి • క్రమము నెఱపి

ఆ. యిట్లు దొరలు నొవ్వ • నే త్రెఱఁ దనచేతి
కొలఁదిఁ జూపి క్రీడి • సెలఁగి దేవ
దత్త మొత్తుటయును • దత్సైన్యములు పెద
విఱిగి పాఱి భీష్ము • మఱువు సొచ్చె. 66

క. గాంగేయుఁ డవష్టంభో
త్తుంగతనుం డగుచు నిట్లు • దూలినకురుసే
నాంగంబులఁ బురికొలిపి సు
సంగతములు సేసె సమర • సమ్ముఖములుగాన్. 67

వ. ఇట్లు భగ్నబలసమాశ్వాసనోద్భాసి యగుభీష్ముభుజబలంబు ప్రాపున మా
తంగతురంగస్యందనసందోహంబులతో గుంభసంభవకృపాశ్వత్థామకర్ణ
వికర్ణ ప్రముఖాఖిలయోధజనంబులు సుయోధనుముందటఁ బన్ని నిలి
చినం జూచి సవ్యసాచి ప్రత్యేకప్రథనకుతూహలాయత్తచిత్తుం డగుచు
నుత్తరున కిట్లనియె. 68

సీ. కందము లప్పళించి తుర • గంబుల నించుక నిల్పు వైరిసే
నం దెలియంగఁ జూడుము ష • నప్రకరంబునుబోతెఁ గాఱుకొం
చుం దఱ చైనదంతిభట • సుందరకేతనరాజిగ్రాలఁగా
[1]ముందట నిల్వఁ గట్టెదిరి • మోహర మున్నవిధంబు గాంచితే. 69

1 గ. ముందర నిల్చి కట్టెదిరి; జ ముందర గట్టిమై నిలిచి.

ఆ. కర్ణుకేతనంబు • గ్రాలెడు నల్లదె
యాతఁ డాజికేళి • కౌతుకమునఁ
గడఁగి వచ్చుటయును • గలిగియున్నదిమున్న
తొడరవలయునతని • తోడమనము. 70

వ. అని మఱియును. 71

చ. రయమునఁ గిట్టియాతని ప • రాక్రమలీల యడంచి నొంచి దు
ర్జయుఁ డని నమ్మి యున్నకురు • రాజునకుం వగ పుట్టఁ జేసెదం
హయములఁ బోవ ని మ్మనుడు • నాతఁడు నాతనిలావు నచ్చి ని
ర్భయమునఁ దేరు [1]వోఁ బఱపె • భాస్కరసూతికి సమ్ముఖమ్ముగం.

—• అర్జునుఁడు చిత్రాంగదప్రభృతికురుకుమారుల నిర్జించుట •—

వ. ఇవ్విధంబున వృషభంబున కాదికొనుబెబ్బులియునుంబోలె రాధేయు దెస నడచు కవ్వడిం గని చిత్రాంగదుండును జిత్రరథుండును సంగ్రామజిత్తును దుష్ప్రహుండును జిత్రసేనుండును వివింశతియును దుర్ముఖుండును దుర్జయుండును వికర్ణుండును శత్రుంతపుండును దుశ్శాసనుండును లోనుగాఁ గల కురుకుమారవర్గంబు నిరర్గళప్రకారంబు లగు రథచిత్రప్రచారంబులు మెఱయ మొనకుం దఱకడచి చటుల పటుబాణవేణికాపరంపరలు నిగుడ నొక్క పెట్ట కవిసిన నతండును గుణధ్వనితంత్రీనాదంబుగా నావిండ్లవా రౌత్తుకాఱుగా గాండీవంబు వీణెగా వినోదంబు సలిపె నట్టియెడ వికర్ణుండు. 73

క. తలమీఱి విశితశరమం
డలిఁ గప్పెం బార్థు నుక్కు • ట క్రోధములం

---

1 గ జ. వే నడపె.

విలు విఱుగ నేసి యతనిం
దొలఁగంగా జేసె నరుఁడు • దోర్బలలీలన్ 74

క. ఇంతయుఁ గనుఁగొనియును శ
త్రుంతపుఁ డోసరిల కాజి • దోహల మలరం
గొంతేయుతోడఁ దలపడి
యింత లయిన కూర్మనఖర • విశిఖము లేసెన్. 75

వ. అర్జునుండును. 76

క. సూతుఁ బదింటను నైదిట
నాతనియంగంబు నొంచి • యంక నిలువఖిన్
శాతఘనశరము వే కొని
యాతల వెడలంగ నేసి • యసువులఁ బాపెన్. 77

తే. ఇట్లు శత్రుంతపునిఁ ద్రుంచి • యుద్విధమున
నొక్కఁ డొక్కఁడ తలపడు • టుడుపఁ దలఁచి
వివిధబాణపరంపర • వెల్లిగొలిపె
భయరసమువట్టు పెట్టునఁ • బగఱ వాఱ 78

క. అంతఱ రథికులు పఱవఁగ
నిం దేటికి మున్ను వచ్చి • [1]రిప్పియని సం
క్రందనసుతు మార్కొనియెఁ ద
గం దెగి సంగ్రామజిత్తు • గర్వోద్ధతుఁడై. 79

క. తలపడి వాలమ్ములు పై
నల వేర్పడ నినుచుటయును • నలుక నోదమినం

1 క. తిప్పి.

దల దులిమివైచె నాతని
బలసూదనసూనుఁ డొక్క • పటుభల్లమునన్. 80

తే. అపుడురాధేయుఁ డిమ్మెయి • ననుజుపాటుఁ
జూచి యేనుంగునకు సిళ్ల • సూపినట్లు
గవిసి హయముల మత్స్యటూ • కాంతుతనయు
నేసి పంద్రెండుశరముల • నేసెనరుని. 81

ఉ. కేసరివిక్రముండు కపి • కేతనుఁ డత్తరి వైరివీరసం
త్రాసకరప్రకార మగు • దర్ప మెలర్పఁగ బాణజాలవి
న్యాసమున్ వెసం బొదివె • నర్కసుతున్ గరుడుండు పాము ను
ద్భాసితపక్షుఁడై పొదువు • భంగి సురావలి పిచ్చలింపఁగన్. 82

క. ఇరువురు వీరులు నిట్లాం
దొరువులఁ దలపడుట సూచి • యుత్కట మగున
చ్చెరువాటుఁ గౌతుకంబు న
తర నూరక యుండె నయ్యె • దం గురుసేనల్. 83

మ. ప్రళయాంభోధరము క్రసాంద్రవిసర • త్పాషాణవర్షంబు మి
క్కిలి యై శైలముఁ గప్పునట్లు నరున • క్షీణాస్త్రసంతాన మి
ట్టల మై కప్పినఁ దీవ్రమారుతము గా • థవ్యాప్తిజీమూతమం
డలిఁబోలెఁ విరియించె భానుజుఁ డవ • ష్టంభోజ్జ్వలాకారుఁడై. 84

క. విల్లును దానును శిఖ రా
జిల్లఁగ వెలుఁగొందువహ్ని • చెలువంబున శో
భిల్లుట గని కురుసైన్యము
లెల్లను దూర్యములు మ్రోయ • నేద్తె ఱఁజెలఁగెన్. 85

క. రవితనయుబాణములు వా
సవనందనుఁ బొదివినపుడు • సంతోషముఁ ద
ద్వివిధాస్త్రము లాతనిపైఁ
గవియ విషాదంబు నొందుఁ • గౌరవసేనల్. 86

వ. ఇవ్విధంబున నేట్లాడుచుం గదిసి గాండీవి కర్ణున కి ట్లనియె. 87

ఆ. సభలఁ బలుకు దీవు • సరిలేరు నా కని
యిదె రణంబు వచ్చె • నెల్లవారి
కెఱుఁగవచ్చు దీనఁ • బెఱచోట రజ్జన
యట్లు పూరగింప • నగునె యిచట. 88

క. మాటలు పెక్కాడితి వీ
పోటుమగలు విన<ఁ>గ నింక • బోవుట దగ దె
ప్పాట వది గాక తమ్ముని
పాటును గన్గొరఁ గంటె • పాఱకు మిఁక నా. 8

ఆ. పలుకవచ్చుఁగాక • పలికినయట్టుల
చేయవచ్చు నెట్లు • దాయ యొందుఁ
బోయె దట్లు ద్రుపద • పుత్రికఁ బఱుపంగ
గాంచి నగినఫలము • గందుఁ గాక. 90

క. ఏ నప్పుడు ధర్మపాశా
ధీనుఁడ నై కోపమునకు • దీ కొనరింపం
గా నేరకున్న మెయిమెయిఁ
బోనయ్యెం గాక యింకఁ • బొమ్మా యిచటన్. 91

వ. అనిన విని రాధేయుం డి ట్లనియె. 92

ఉ. అప్పుడు ధర్మహానికి భ • యంపడి నిల్చితివో కరంకతో
నిప్పుడు వచ్చినాఁడ విట • యెల్లను జేయుదుఁ గాక యన్నపై
దప్పు ఘటించి నీవు నొక • తాలిమి గల్గినవాఁడ వై వెవం
బొప్పినఁ జెల్లె [1]నీదునిలు • వోపను జాతము గాక యిచ్చటన్, 93

క. సమయంబు నడపినను రా
జ్యముభాగం బీరె యెట్లు • ననునాస నర
ణ్యమున వసించితిగాక ని
జమునకు నీయందు ధైర్య • సారము గలదే. 94

క. మును నీ వచట నచటఁ జే
సినబంటుతనంబు లెల్లఁ • జెప్పఁగ విందుం
గనినఁ గదా నమ్ముదు నవి
యనుమానము నాకు నీభ • యస్థితిఁ గనుటన్. 95

—• కర్ణార్జునులదంద్వ యుద్ధము •—

వ. అనుచు వాలమ్ములు గురిసిన నర్జునుండును గ్రోధితుండై గాండీవవిక్షేప క్షోభితకభోభాగుండగుచుం గానీనుపై నానానిశితవిశిఖంబులు నివిచె నట్ల య్యిరువురును దేవాసురసంగ్రామసాదృశ్యవిక్రమప్రక్రియం బొలిచి రట్టిసమయంబున. 96

క. రవిదీప్తులు సౌర నేరమిఁ
గవిసెం జీఁకట్లు పవను • గమనం బడఁగెన్
వివిధాస్త్రంబుల నంబర
మవిరళముగఁ బొదువఁబడుట • నద్భుతభంగిన్. 97

---

1 గ. నీనిలువు • నోపను.

సీ. అప్పుడు కర్ణసైన్య మమ • రాధిపనందనుఁ జుట్టు ముట్టఁ దే
రప్పరవీధి మై వలయ • మొప్ప వెసం బఱపించి క్రీడి పెన్
గుప్పలుగా రథావలిని • ఘోటతతిం గరిరాజిఁ గూల్చుచుం
దప్పక భానుసూను మెయి • దాఁకఁగ నేయుచు నుల్లసిల్లినన్. 98

వ. రాధేయుండును. 99

క. తఱిమి పయి నడరుటయు విలు
విఱుగంగా నేసె నరుఁడు • విక్రమలీలం
గొఱఁతపడ నీక కర్ణుఁడు
మెఱుఁగు లడరుశక్తి సురలు • మెచ్చఁగ వైచెన్. 100

ఆ. వైచుటయును సవ్య • సాచియుఁ గౌరవుల్
విస్మయంబుతోడి • వెఱపు వొంద
నధికరయము మెఱయ • నది పెక్కుదునియలు
చేసె నంతరముల • శితశరముల. 101

వ అట్టియెడ నినతనయు మన్నించుజోదులు దెగి పయిం బడినఁ గ్రోధారుణనయనపల్లవితంబును దంతకాంతి స్తబకితంబును గుంభస్థలఫలితంబును నగుతదీయకరటిఘటావికటవిటపిపటలంబు నాత్మీయవిశిఖవ్యాపారమహావాతంబునన్ బడలువడంగూల్చి చండమూర్తి దాల్చి శోభిల్లు బీభత్సుం గని యతండు బొమముడివెక్కొన వేఁడొక్క విల్లెత్తికొని,

క తురగముల నాలుగిట ను
త్తరు నాఱిట నెనిమిదిట ర • థముఁ బదిటను వా
నరు నఱువది శరముల న
న్నరునంగంబులను బెలుచ • నాటఁగ నేసెన్. 102

వ. ఇ త్తెఱంగున. 104

సీ. రోషంబు భీషణ • రూప మై చెలు వొంద
అతులకేతువు శిఖ • యై వెలుంగ
శరజాలములు పటు • జ్వాలలై నిగుడ న
ర్కతనూభవోగ్రాగ్ని • ప్రజ్వరిల్లు
నుద్ధతి సైపక • యుజ్జ్వలదివ్యప
తాక మెఱుంగు గా • దళితధరణి
రథనేమిరవము గ • ర్జనముగ శరపరం
పరలుధారలు గాఁగఁ • బరఁగి యడరె

ఆ. నర్జునాంబుదం బ • నన్యసామాన్యస
ముద్యమమున ముఖప • యోరుహముల
కాంతి దఱిఁగి యపుడు • కౌరవసేనాప
రోవరంబు దీన • భావ మొంద. 105

క. వెండియు నుడుగక రవిసుతుఁ
డొండొండ నిశాతసాయ • కోత్కరము సము
ద్దండతఁ బై నించిన నా
ఖండలనందనుఁడు గెంపు • గనుగవఁ గదురన్.

క. శిరము లలాటంబును గం
ధరమును బాహువులు నురము • దండడి ప్రయ్యన్
గిరిపైఁ బిడుగులు దొరఁగెడు
పరుసున దృఢదీప్తశాత • భల్లము లేసెన్.

క. అఱిముఱి నంగము లెల్లను
నుఱుముగ ని ల్లడరునర్జు • నునియమ్ములకున్

వెఱచఱచి సూతపుత్రుఁడు
పఱచెఁ బుడమి యద్రువ మత్స్య • పతిసుతుఁ డార్వఁగా. 108

వ. ఇట్లు కర్ణుండు గయ్యంబు విడిచి పాఱినఁ బార్థుండు దేవదత్తంబు పూరించి యుత్తరున కిట్లనియె. 109

క. వీఁ డొకఁడు కురుబలంబున
వాఁడిమగం డనఁగఁ జాలు • వాఁ డిబ్భంగిం
బోఁడిమి సెడియెడు ద్రోణుల
వేఁడిమి యిట మనకు మునుము • విక్రమమునకుఁగా. 110

వ. అనుచు వీరావేశంబునఁ గౌరవానీకంబు నాలోకించునప్పు డుత్తరుండు.

ఉ. వెక్కసపాటు భీతియును • విహ్వలభావము నొంది యి ట్లను
న్మిక్కిలి యైనశౌర్యమును • నిర్భరతేజము నంత కంత కి
ట్లెక్కుడులావుఁ జూచి మది • యెంతయు బెగ్గిలె మేను చేష్టలం
దక్కె నశక్య మిం కిట ర • థవ్యవహారము నిర్వహింపఁగన్. 112

ఆ. [1]పుట్టినంతనుండి • యిట్టివి యెన్నఁడుఁ
గాన నెందునట్లు • గాన చోద్య
మంది యంతరంగ • మవశతఁ బొందిన
కతన నింద్రియముల • కడఁక దక్కె. 113

తే. అనినఁ గొండొకన వ్వాల • యంగఁ జూచి
యింద్రనందనుఁ డాతని • కిట్టు లనియె

1 క. 'పుట్టినంతనుండి • యిట్టిది యెన్నఁడుఁ
జూడ నట్లుగాన • చోద్యమంది
యంతరంగ మిప్పు • డవశతఁ బొందిన'

నేమ గలుగంగ నీ కేమి • యెలమి వాహ
నముల కుబ్బగ నంచోద • నంబు సేయు. 114

క. అనుటయు నాతఁడు దగ సూ
ర్యానిసం దా నుదితనినద • కోదండుం డై
యనితరసులభోద్యమమున
ధనంజయుం డిట్టు లను న • తనితో మఱియున్. 115

క. అరుణాశ్వంబులఁ బూనిన
యరదంబున వీడె నిడుపు • లగు చేతులు బం
ధురకంధరంబు వెడలుపు
టురమును నై ద్రోణుఁ డొప్పె • నుత్తర కంటే.

వ. అనిచూపి వెండియు ని ట్లనియె. 117

ఆ. సకల కురుకుమార • చాపశిక్షాచార్యుఁ
డాతఁడుస్పృహుండు • సాంగవేద
వేది నీతిశాస్త్ర • విదుఁడు దివ్యాస్త్రకో
విదుఁడు సుజనహితుఁడు • విమలబుద్ధి.

వ. అవి యగ్గించి.

క. తనతవయుకంటె నెమ్మన
మున నాతుం గూర్చు [1]భావ • మున గురులకు మా
ర్గానియెదము రాచధర్మం
బునకీడునఁజేసి యింత • వుట్టఁగ వలసెన్. 120

---

1. క. బాపమున

చ. ఎదురుగఁ బోవనిమ్ము గథ ♦ మీతవితేరికి వన్నెనాతండుం
బదిలముతోడ రథ్యముల • పగ్గము లే త్రెలు సూలుకొల్పి యు
న్మదగతి నట్లచేసిన న • మానుషవిక్రముఁ డైన ద్రోణుఁడుం
గదిసి యిభం బిభంబుఁ జెన • కం జనుదెంచినలీలవచ్చినన్. 121

వ. నరుఁడు నమస్కరించి గురున కి ట్లనియె. 122

క. అడవులఁ బెద్దయుఁ గాలం
బిడుమలఁ గుడిచితిమి మాకు • నిది దటీ యని యి
ప్పుడు వచ్చితిమి విపన్నుల
యెడఁ గృపసేయుటయ లెస్స ♦ యా రలుగకుఁడీ. 123

—• అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధంబు సేయుట •—

క. మును వెఱతు నేయ మీరలు
నను నేసినఁ గాని యనుడు • నాకేశసుతున్
ధనురాచార్యుం డిరువది
సునిశితబాణముల నేసెఁ • జూపఱు వొగడన్. 124

ఆ. అర్జునుండు వాని ♦ నన్నింటి నడుమన
తునియ నేయుటయును • ద్రోణుఁ డదరి
శతసహస్రసంఖ్య • శరములు గప్పిన
నతఁడు నతనిఁ గప్పెఁ • బ్రతిశరముల.

చ. అతిరథు లస్త్రశస్త్రవిదు • లద్భుతబాహుబలుల్ పరాక్రమో
ర్జితయశు లిట్లు దాఁకి గురు • శిష్యులు గౌరవసేనలోనిభూ
పతిసుతకోటికిన్ వెఱఁగు • పా టొనరించిరి బాణజాలసం
వృతగగనాంగణం బగున • పీనమహాహవ[1]విభ్రమంబునన్. 126

1 ఋ. విక్రమంబునన్

వ. అట్టియెడఁ గురుసైన్యంబుజనంబులు. 127

క. నరుఁ డొక్కరుండు దక్కఁగ
గురుఁడు గడగినపుడు మాఱు • కొనఁ జాపధరుం
డొరుఁడు గలఁడె మఱి వెదకిన
హరుఁడు గలం డింకఁ గలుగు • ననరా డెందుఁన్.

క. ద్రోణుఁడు రయమున నేసిన
బాణము లెడ తెగక యొక్క • బాణమపోలెన్
శ్రేణి యయి వోవఁ బార్థుఁడు
రేణువు గావించుఁ గంటి • రే చిత్రగతిన్. 129

క. గురుశరములు సితపక్ష
స్ఫురణంబున నంచపిండు • పోలుపు వహించెన్
నరుబాణతతి ఘనావలి
కరణి మిగుల నొప్పె నల్ల • గఱుల చెలువునన్. 130

వ. అనుచుం గనుంగొనుచుండ.

శా. శ్రావ్యం బై చెలఁగన్ గభీరమధుర • జ్యానాద ముద్దామవీ
రవ్యాపారసిరూఢతం బ్రతిశరా • రంభంబు మర్దించుచున్
సవ్యప్రౌఢిదృఢాపసవ్యగతి నా • శ్చర్యంబుగా నేయుచున్
దివ్యాస్త్రంబులఁ బోరి రిద్దఱును సా • దృశ్యం బదృశ్యంబుగన్.

వ. ఇంద్రాగ్నివాయువరుణదైవత్యంబు లగుశరంబులు గురుం డేసిన నరుండును దత్తద్దేవతాకంబు లగునంబకంబులఁ బ్రతిహతంబులు సేయుచువచ్చెనయ్యిరువురుఁ బెల్లేయుసాయకంబు లంతరిక్షంబున దలం బై సంతమసంబు గలిగి యునికి నేబాణం బెక్కడఁ బాఖుటయుం

దోఁపకుండె నట్టియెడఁ గుంభసంభవుబలం బుసరభసంబుగా నతని కడ్డంబు సొచ్చిన వివ్వచ్చుండు వ్రేల్మిడిం బొడిసేసి సకేయూరంబు లగు బాహుదండంబులను సకుండలంబు లగుకర్ణపాశంబులను సకిరీటంబు లగుశిరోభాగంబులను భూభాగం బలంకరించి యప్పు డావహిల్లిన రుధిరసాగరంబునకు రత్నాకరత్వం బలవరించె నిట్లు దుర్జయుం డగు నర్జునుండు సైన్యంబు దైన్యంబు నొందించుచు నాచార్యునకు భరంబుగ నేట్లాడు చున్నం జూచి యతండు విస్మితుండై. 133

క అర్జునుని నాహవంబున
నిర్జింపఁగ నగునె ఫాల • నేత్రునకైనం
బర్జన్యసుతుఁడు శరవ
ర్షోర్జితమూర్తి యగు టరయ • నుచితమకాదే. 134

వ అని మఱియును బగినపలుకుల నగ్గింప నిలింపనికరంబు.

తే. ఇంతప్రొద్దు కిరీటిక • బ్బెదుర నిలువ
వెఱవ కున్నప్పు ద్రోణుండ • వింటివాఁడు
నల్లవో తనయున్నసే • వకు నొకండ
బలిమిఁ దలమీఱునే యిట్లు • విలువవలదె. 136

మ. అనుచుండం ద్రిదశేంద్రసూనుఁడు రయ్యం • బత్యంతఘోరంబుగా
ఘనశాతోజ్జ్వలదుర్నివారవిలస • త్కాండంబులన్ ద్రోణువా
హనసూతధ్వజదేహముల్ వొదివె వి • ల్లస్త్రొబ్బిని ర్మగ్నుఁజే
సిన హాహానినదంబు లొక్క_మొగిఁ బే • ర్చెఁ బా సర్వసైన్యంబులన్.

క. ఈమెయి నిజజనకుబుణో
ద్దామబలము దోడుతోడఁ • దఱుఁగుటయు రథ

స్తోమంబుఁ దాను నశ్వ
త్థామ వెసం దాఁకెఁ బాండు • తనయునితోడన్. 138

—• అర్జునుఁ డశ్వత్థామతో యుద్ధము సేయుట •—

చ. అతఁడును దీవ్రబాణముల • నాతనిఁ గప్పుచు మాఱుకొన్న నా
శతవఖవృత్రసంగరము • చందము దోఁచె వడిం జటచ్ఛటా
యితరపమప్పు వేణువుల • నేర్చుదవానలుప్రోఁతభంగి ది
క్తతిఁ బరఁగెన్ మహాద్భుతము కౌరవసేనకు నావహిల్లఁగన్. 139

వ. అట్టియెడ. 140

చ. ఉఱక నెరుండు ద్రోణసుతు • యుగ్యములన్ వెసనొంచె నాతఁడుం
దెఱపి యొకింత గాంచి ఘన • తీవ్రశరంబున నారిఁ ద్రుంచి క
నిఱిపినమాత్రలోన నత • నిం బహుబాణచతుష్కయుగ్మ మే
డ్తెఱఁ దొడి మౌర్వి గ్రమ్మఱ ఘ • టించు నెడన్ వడి నేసి యార్చినన్

క. కురుసేన లోన ని ట్లె
వ్వరుఁ జేసిన వారు లే ర • వార్యభుజావి
స్ఫురణోదగ్రుండు గదే
గురుపుత్రుం డనుచు సమర • కోటి నుతించెన్. 142

చ. చిఱునగ వొప్ప గాండివము • సెచ్చెర సజ్యము సేసి సేన లు
క్కఱ రభసంబుమై వదరెఁ • గవ్వడి ద్రౌణియు నీడఁబోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు • దందడి [1]మార్కొని మండుచుండెఁ [2]జి
చ్చఱపిడుగుల్ వడిం దొరఁగు • చాడ్పున నంబరవీథి నుగ్రమై.

1. క. దార్కొని. 2. గ. 'జిచ్చఱపిడుగుల్ వడిందొరఁగు • చొ
ప్పున' అనియొక ప్రతిపాఠము.

వ. ఇవ్విధంబున ధనంజయుం [1]డేయువేగంబున సేయుటయు ద్రోణతనయుతూణీరంబులు శరశూన్యంబు లయ్యెఁ దనతూణీరంబు లక్షయబాణంబు లగుటం జేసి యంతకంతకు నతిశయిల్లు పెల్లున నేయుచు నధికుం డగువప్పాండవమధ్యముం గనుంగొని కృపాచార్యుండు చెంగటం దల మీఱిన. 144

—• అర్జునుఁడు కృపాచార్యునితో యుద్ధము సేయుట •—

క. గురుపుత్త్రునిరథము విడిచి
సరభసముగ నందు సవ్య • సాచి గవియుడుం
దిరమై యాతఁడు శితశర
పరంపరలు గురిసె నుగ్ర • బంధుర [2]గతులన్. 145

వ. పాండుపుత్త్రుండును జిత్ర [3]సంచారంబుల మెఱయుచు.

క పటువిశిఖపంక్తి [4]యత్యు
త్కటదయమున నిగుడఁ జేయఁ • గా నవ్విధ మూఁ
దుట యైనమందె దీప్తో
ద్భటభంగిఁ గృపానలంబు • బలములు వొంగన్. 147

వ. ఇట్లు [5]మండిశిఖిఁబోలెడికనకలిప్తఘన బాణంబు వనచర కేతువుం దాఁకించి వేఁడిమి సూపి వివిధాస్త్రజ్వాలలు గవియించి దిక్కులు పెలంగ నార్చినం గోపంబున నాటోపంబు మిగిలి బలసూదనసూనుం డతని కేతనంబు దునిమి తరణికిరణానుకారపారంగతంబు లగునాచంబులు దదీ

---

1. క. 'ధనంజయురయంబు నెనయు వేగంబున నేయు ద్రోణతనయు' 2 క. భంగిన్ 3. గ. ప్రచారం 4. గ. యం దుత్కట. 5. చ 'మండెడు శిఖివోలెఁ గనలి దీప్తపున'

యాంగంబుల నిమిషం దొఱంగిన రథ రక్షకు లగు చంద్రకేతుండును చిత్రాశ్వుండును మణిమంతుడును మంజుమౌళియు హేమవర్మయును సురథుండును సుషేణుండును వరిష్ఠుండును సుకేతుండును నుక్కు మెఱయ నొక్కటం దాఁకిన.

ఆ. అన్ని వెడఁదవాతి • యమ్ము లద్భుతముగ
నొక్కముష్టిఁ దొడిగి • గ్రక్కునంగ
నతఁడు లీలఁ దునిమె • వందఱతలలును
ఘోరభంగి రక్త • ధార లెగయ.

సీ. తునిమితోడనయొక్క • సునిశితశరమునఁ
గాఁడియు రెంట వ • క్షములఁ ద్రుంచి
హరుల నాల్గిటఁ జంపి • యూలంపుగోలతో
నొగలు మూఁడమ్ముల • నుగ్గుసేసి
ధనువును సూతుని • తలయుఁ జెటొక్కట
నఱకి లోచనముల • నవ్వ [1]నెఱయఁ
గృపుని నాలోకించి • క్రీడితద్వక్షఃస్థ
లంబునఁ గ్రూరథ • ల్లంబు నాట

ఆ. హతరథుండు విపతి • తాశ్వుండు సంఛిన్న
చాపుఁడును వికృత్త • సారథియును
నయ్యు నొచ్చియును భు • జార్గళసంరంభ
మతిశయిల్ల శక్తి • నతఁడు వైచె.

ఉ. మండుచు [2]వచ్చుదానిఁ బది • మార్గణములఁ గొని వేగ మొప్ప నా
ఖండలనందనుండు గడి • కండలు సేసినఁ జూచి యప్పుడా

1 క. ఉలియ, 2 జ. బోవుదాని

తం డుడివోక లేక సమ • దంబున ఖడ్గము ఖేటకంబు ను
ద్దండతఁ గొంచుఁ దేరు డిగి • తాఁ గవిసెన్ రయ ముల్లసిల్లఁగన్.

వ. ఇట్లు గవిసిన. 152

క. పలుకయు వాలును నింతిం
తలు దునియలు సేసె బాణ • తతిఁ బాండవుఁ డి
ట్టల మైనవెఱఁగుపాటున
నిలిచి కృపుఁడు ద్రోణపుత్రు • నిరథుం జెక్కెన్. 153

ఆ. అప్పు డే పడంగి • యన్ని సేనలు భీష్మ
రథముపొంత కొదిఁగె • రౌద్రరసవి
నోదియైనయర్జు • నుఁడు ధనుశ్చాలన
దీప్తమూర్తి యగుచుఁ • దిట్ట కుటికె.

వ. ఇత్తెఱంగున నుఱక తఱియ నుఱికిన. 155

క. బలములు దొరలఁ బొదివి సం
కులయుద్ధము సేయఁ గ్రోధ • ఘోరాకృతి యై
యిలఁ ద్రోవుగఁ జతురంగం
బుల ద్రెవ్వఁడిఁ బాండు రాజ • పుత్రుఁడు గూల్చెన్.

ఉ. చేతులతీఁటఁ వో నిటఁ • నశేషబలంబుల నుగ్గు సేసి మాం
సాతతపంక యై బహువి • ధాయుధమీనము లొప్పఁ జామర
వ్రాతము సేనభంగిగ ని • రంతరవీరశిరస్సరోరుహ
స్ఫీతవిభూతిఁ బొల్పునది • సేసె రణస్థలియందు నెత్తుటన్.. 157

తే. ఇట్లు కౌరవానీకంబు • నెల్లఁ గలఁచి
యాడి భీష్మునిదెసఁ [1]బోవు • క్రీడిఁ దాఁకెఁ

1 ఘ. బోవ

గొండతోఁదాఁకుతగరుసు • ద్దండవృత్తి
దోఁప వృషసేనుఁడాహవ • దోహలమున. 158

వ. విజయుండును.

తే. భల్ల మొక్కటఁ నాతని • విల్లు దునిమి
యెదునారసములు వక్ష • మూఁద సేసె
వతఁడు పైఁ ఱింపరానినొ • వ్వడరుటయును
బెగ్గలంబున వరదంబు • డిగ్గిపాఱె.

వ. అట్టియెడ దుశ్శాసనశకునిదుర్ముఖవివింశతి[1]వికర్ణులు దన్నుం బొదివి కొనిన వారల రథరథ్య కేతువర్మంబులు జర్జరితంబులుగా నేసి గాసి చేసిన నందఱుం గనుకనిఁబఱవందొడంగినఁ బార్థుండును బ్రహాసోల్లాస భాసియగుచు నుత్తరుం గనుంగొని. 161

తే. కనకమయతాలకేతువు • గ్రాలఁ జిరత
టిల్లతాలీలఁ గలిగి శో • భిల్లువంబు
దంబుచాడ్పున సురనదీ • తనయుఁ డున్న
వాఁడు సూచి తె మత్స్యభూ • వరతనూజ. 162

—• అర్జునుఁడు భీష్మునితో యుద్ధంబు సేయుట •—

క. బలువిడి మనదివ్యాస్త్రం
బులచవిసూపంగవలయుఁ • బో నిమ్ము రథం
బంసగతి నతనిదెస కని
పలికిన నతఁ డట్ల చేసెఁ • బరమప్రీతిన్.

---

1 జ. 'వికర్ణులు మొదలుగాఁ గల దొరలు'

ఉ. శాంతనవుండు నప్డు నిజ • శంఖము గౌరవరాజసైన్యముల్
సంతస మంద నొత్తుచు స • సంభ్రమలీల నెదుర్కొనంగ దు
రాంతభుజాబలప్రకట • దర్ప మెలర్ప నరుండు నొత్తె ది
గ్దంతినికాయకర్ణపుట • [1]దారణవిక్రము దేవదత్తమున్. 164

తే. మలసి అంకెలు వైచుచు • మాఱుకొనిన
వృషభములభంగి నక్కడ • వృషభు లిట్లు
సమదగతిఁ జేరనెడఁ జూచి • యమరు లర్థి
ననిమిషత్వంబు దమ కప్పు • డచ్చుపడఁగ.

వ. ఇవ్విధంబునం గనుంగొనుచు వారలు దమలోన. 166

క. మనలను దానవులను గడ
చినయవి భుజఖలము లస్త్ర • శిక్షావిధముల్
గొనియాడఁ గొలఁది గా [2]దీ
తని నాతఁడ యతని నితఁడ • తగుఁ జెనయంగన్. 167

సీ. అనుచుండ సైన్యంబు • లార్పులుఁ బెడబొబ్బ
లును దూర్యనాదంబు • లుల్లసిల్లఁ
బేర్చి యొక్కుమ్మడి • భీష్ము నగ్గింపంగ
నతఁడు నిశాతబా • ణాష్టకమునఁ
బడగపై హనుమంతు • నొడలును బహుశరం
బులనందుఁ జెలఁగెడు • భూతములను
దశవిశిఖముల ర • థ్యములను సారథి
నేనె వాసవియును • వెసక మెసఁగు

1 గ. దారుణవృత్తము. 2 శ దీతని కాతఁడ యతని కితఁడ • తగు.

తే నగ్గలిక గాండివంబుచ • క్రకాకృతిప్ర
కాశవహ్నిస్వరూపత • గలిగి విడుపు
తెలపి గానంగరాకుండ • మెఱపియొప్పు
సాంద్రసాయకతతి నాక • సంబు గప్పె. 168

తే. అర్జునుఁడు గవియించిన • యంప మూఁద
మంచుదళముగఁ గప్పిన • మారణాంశు
జాలముల వెస విరియించె • శాంతనవప
తంగుఁ డుద్దోతమానప్ర • తాపలీల. 169

క. అమరేంద్రతనయుఁ డుగ్రా
స్త్రములు వడిం గురియ నడుమఁ • దరమిడి వానిం
దుమురుగఁ జేయుచు వచ్చెను
సమరోల్లాసంబు మెఱయ • శంతనసుతుఁడున్. 1 0

క. అర్జునుఁడు దివ్యబాణ
స్ఫూర్జితదోశ్శక్తి దనకుఁ • జూపిన నతఁ డ
త్యూర్జితబలుఁడై వియమో
పార్జితఘోరాస్త్రవితతిఁ • బ్రతిహతిఁ జేసెన్.

క. కవ్వడి యెమ్మెయి నేసిన
నవ్విధమున నాశరంబు • లన్నియు దౌదౌ
దవ్వులన నిలువరింపఁగ
నివ్వచ్చుఁడు గినిసి యేసె • విలు విఱుగంగన్. 172

మ తనకోదండము ఖండితం బగుడుఁ గ్రో • ధం బార మందాకినీ
తనయుం డప్డు సటావిలుంచనసము • ద్యత్కోపసింహాకృతిన్

1. క. ఖగ, మార్గగతుల విద్రువ విద్రువ 2. గ. మూఁడు 3. చ. 'విలుంచన'

దను వొం దుద్ధతలీల నెత్తికొని య • ప్పుత్రశ్రేణిం బర్వించె-న
ర్జునుపైఁ దాఁకిరి చక్రరక్షకులు నా • ర్పుల్ వింగి ముట్టన్ గావళిన్.

చ. విజయుఁడు వారి నెల్ల నొక • వ్రేల్మిడిఁ ద్రుంచియు భీష్మసాయక
వ్రజము నడంచియన్ రథము • వాజాల నొంచియు నాజి కేళియం
దజితవిలాసముల్ మెఱయ • నప్పుడు విస్మయ మందు చుండెఁ గుం
భజముఖయోధవీరతతి • ప్రస్తుత సేసిరి సిద్ధఖేచరుల్. 174

క. కొందొకయెడఁ గని శాంతన
వుండాఖండలతనూభ • వునిడామూఁ పు
ద్దండభుజబలము మెఱయఁ బ్ర
చండాస్త్రక్షతము సేసె • సరభసవృత్తిన్.

చ. కినుక మనంబునం గదిరి • క్రీడి పితామహువిల్లు వ్రేల్మిడిం
దునిమి నితాంతగాఢరయ • దోర్విభవంబున నొండువిల్లు గై
కొనియెడునందునన్ నినిచెఁ • గ్రూరశరంబు లురంబునందు గ్ర
క్కున నతఁ డొల్లఁ బోయి రథ • కూబర మూఁతగ నిల్చె సోలుచున్.

క. కనుఁగొని సూతుం దరదముఁ
గొనిపోయెం దలఁగ నపుడు • కుంతీతనయుం
డనిఁ దనివి సనక గుంపులు
గొని యున్నెడ లరసెఁ గలయఁ • గురుసైన్యమునన్.

వ. ఇట్లెత్తి చూచి గాండీవంబు దొడవ గుణంబు సారించి కవదొనలు బిగియించి.

క. ఆచార్యసూర్యతనయకృ
పాచార్యప్రభృతిరథికు • లందఱు[1] మొద్దై

1 క దన్నుం.

చూచుచు నుండఁగ నద్దెస
కేచి భుజాబలము మెఱయ • నింద్రజుఁ డరిగెన్. 179

వ అప్పు డశ్వత్థామ కర్ణున కి ట్లనియె. 180

ఆ. వీఁడె వచ్చుచున్న • వాఁడు పార్థుఁడు మన
మేమి సేయువార • మీవు దక్క
నొరులు నిలువరింప • నోపెడువారు లే
1రోట లేక తాఁకి • యోర్వవలయు.

క. అని తనునల్లన మాటకుఁ
గినిసి యినతనూజుఁ డేను • గ్రీడి నిచట మా
ర్కొనఁ వీఁకఁ గన్నులారం
గనుఁగొనుమీ నిలిచి యనుచుఁ • గవిసెం బెలుచన్.

క దొరలును సుభటులుఁ గర్ణుని
యరదమునకు మున్న పొదివి • రర్జును నచటం
గరి 2సొచ్చుతుంగమడువున
పరుసున మొన చాఁపకట్టు • వడియె నతనిచేన్.

తే. ఇవ్విధంబునఁ బోరెడు • నింద్రతనయు
నుక్కు లావును నంతంత • కెక్కుడయ్యె
3నలసి మేనులు దూలాడ • నిలిచి రంత
నంత వయోధముఖ్యులా • హవము దక్క. 184

వ. అట్టియెడ నుత్తరుండు నరున కి ట్లనియె.

1 రో'రలేక' అని పెక్కు ప్రతులు. 2 గ సొచ్చినతుంగమడువు, పరుసున. 3. సొలసి... దూఁగాడ.

చ. ఉడుకువ లేనికయ్యమున • కోర్వఁగ వచ్చునె నాకు దప్పి పో
వ్వెడు నొకమాటు నాగ్రహము • డింపవు నీవును జక్కఁ జేసి ప
చ్చడి గలపంగ వెండియును • జండితనంబున వచ్చి వచ్చి పో
రెడు మొనలింకఁ జాల నొన • రింప భవద్రథసూతకృత్యముల్. 186

వ. అనిన విని కవ్వడి నవ్వుచు నేనుగలుగ నీకు నోహటింపనేల యంతియ వలసినం దురంగంబులఁ దోడు గడపెద నించుక సైరించి నిలువవలయు నెల్లపనులును జక్కనయ్యె రా జొక్కరుండు చొౘంత యాతం డభిమాని మనలం గని సరకుగొనండిప్పు డున్నచందంబు మనతోడం దల పడం గడంగుట దోఁచుచున్నయది తమ్ములు నా ప్తభృత్యులు నిరుగెలంకుల నగ్గలిక మెఱపి డగ్గఱియున్నవారని కౌరవేశ్వరునిగట్టిమోహరంబు సూపి యతనిం బురికొల్పి యద్దిక్కు దేరువోవ నిమ్మనుటయు నతండును దలకొవియట్ల చేయనడరి యెడ నెడనడ్డపడుకురువీరులం జిఱునగవు గెడనిగుడ మెఱుంగువాలమ్ములఁ దొలంగ జడియుచుం గదిసిన నమ్మేదినీవల్లభుండు.

—• అర్జునుఁడు దుర్యోధనునితో యుద్ధంబు సేయుట •—

క. పులి గోల వేసిన ట్టి
టలపురయంబునఁ గడంగు • టయుఁ దదవ్రక్ష
స్థ్సలమునఁ గిరీటి రెం డ
మ్ములనాటఁగ నేసె బొమలు • ముడివడుచుండన్.

క. క్షతములఁ బెల్లు దొరఁగుశో
ణితధారలు మదముగా నవి • నిర్గళకరియా

1 క. గన్నం, 2 'నెడ' అని పెక్కు ప్రతుల లేదు.
3 క. వినిర్గత, ఆ. వినిద్రకరీంద్రాకృతి.

కృతిఁ గవిసి యతం డేసెను
శతమఖసుతుఫాలతలము • శాతశరమునన్, 189

తే. [1] రక్తధారయు వెడలంగ • రశ్మి వెలుఁగఁ
బొలుచుబాలార్కు చాడ్పునఁ • జెలువు మిగిలి
ఫల్గునుండు ప్రతాపసం • భరితమూర్తి
యగుచు శరకిరణంబులు • నిగుడఁ జేసె. 190

శా. వానిం దీవ్రశరంబులం దునిమి గ • ర్వంబెక్కి నానాప్రసం
తానంబుల్ గురిసెన్ సుయోధనుఁడు దు • ర్దాంతాకృతిన్ గోత్రభి
త్సూనుండుం బటుసాయకోత్కరమునం • జూపెన్ భుజాటోప మి
ట్లేనుం గేనుఁగుఁ దాఁకునట్లు సమరం • బేపారఁగా నయ్యెడన్.

తే. హస్తిపురిఁ బేరు గల [2] మద • హస్తి నెక్కి
క్రాలుకాపలిరథములు • గవియుదేర
నభ్రగజముపైఁ బర్జన్యుఁ • డవఁగ నంప
వాన పరఁగ వికర్ణుండు • వచ్చి తాఁకె.

ఉ. నీఁక నెదిర్చి యిట్లు కురు • వీరులకుం బ్రమదం బొనర్చుచుం
దాఁకినఁ గ్రోధవేగసము • దగ్రత నెట్టనిచూడ్కిఁ జూచి పే
రాఁకలితోఁద నున్న బము • నాకృతి భీషణరేఖ మొప్పఁగా
ప్రేకనినారసంబు దొడి • క్రీడి కరిన్ దృఢముష్టి నేసినన్. 193

ఆ. ఫాలకుంభసంధిఁ • బడి వాలమునదెస
మచ్చిపోవుటయును • మర్వియఁద్రువఁ

1 జ. రక్తధార వెడలె నొక • రశ్మి. 2 క. మదహస్తి.

గూలె నగ్గజంబు • గులిశచండాహతిఁ
బడుమహానగంబు • భంగి దోఁప.

క. అరుణమణిమాలికావి
స్ఫురణంబున దంతితనువు • సూడఁగ నొప్పెన్
ధరణిఁ బడియున్న బహుముఖ
పరిగతదావాగ్నిఁ బొల్చు • పర్వతముక్రియన్.

వ. ఇవ్విధంబున నేనుంగు పీనుం గైన వికర్ణుండు వెఱచఱచి పఱచి వివిం శతిరథంబెక్కె నాలోనన యట్టినారాచంబున రారాజునురంబు నోనాట నేసినఁ గరీంద్రుండు పడుటయు నరేంద్రుండు నొచ్చుటయుం గని యిచ్చవదురథికుల వివ్వచ్చుం డనర్గళప్రసారంబగుమార్గణాసారంబున ముంచిన వెగడుపడి విఱిగి పాఱి రి తెఱంగునఁ దనచుట్టును బయలైన నయ్యురగ కేతనుండును మరలె విల్లు[1] దొరయును విఱిగి[2] కలను వాసి కాల్త్రోసిపోవుటయు నతిరథమహారథు లెల్లం జెల్లాచెద రగుటయుం జూచిసైన్యంబు లున్నవి యున్నచోటన తెరలి కనుకనిం బఱవం దొడంగిన.

తే. యూథపతిఁబోదిదంతిస • ముత్కరంబు
వెనుకఁ దగిలెడుసింగంబు • విధము దోఁప
నార్పునాదంబుగా నరుఁ • డంటఁ దాఁకె
రాజుఁ దారును బాఱెడు • రథికవరుల.

క. వెనుకొని కర్ణుని పెదతల
యును దుశ్శాసనునివీఁపు • నొక్కొక్కశరం

---

1 గ. దొరలును, 2. 'కలను వాసి, కొన్నిప్రతుల లేదు.

బన నేసె నప్పు డయ్యిన
తనయుం డి ట్లనియె నతిర • థ శ్రేష్ఠులతోన్.

ఆ. కూడి ముట్టెఁ గ్రీడి • కురువంశమున కెల్ల
మూలకంద మీన్న • పాలుఁ డితని
నిచటఁ గాచికొనుట • యెల్లపౌరుషములఁ
జేత నిలిచి లావు • సేయవలయు.

క. అన వినుచుఁ గురుపితామహుఁ
డును ద్రోణుఁడు ద్రోణపుత్రుఁ • డును గృపుడును గ
ర్ణునిమాట సరకు సేయక
చమ్మ ఘుండఁగ దీనవృత్తి • జనపతి వలికెన్. 200

క. లోకంబుతోడివారుగ
మీక్షుల జనువయ్య మగఁటి • మికి గుఱి గాదే
నాకెడ రైనయెడం దగఁ
జేకొని యది [1]మీరు చక్కఁ • జేయుట యరయన్.

వ. అనిన విని వారలు వెనుక యై యాశ్వాసవచనంబులు పలుకుచుం బోవం బోవుచున్నయన్నరేంద్రు నెలుం గెత్తిపిల్చి పార్థుం డి ట్లనియె.

—• అర్జునుఁడు దుర్యోధను నుపాలంభించుట •—

ఉ. క్షత్త్రియుఁ డోడునే తగగు • కౌరవరాజ్య యొకండ నేఁ బృథా
పుత్త్రులలోనఁ బిన్న నిముఁ • బోరికిఁ బిల్వఁగ మాని నాఁగ వి
ద్దాత్త్రిఁ బ్రసిద్ధికెక్కు బల • దర్పసమగ్రుఁడ వైనసీవు నీ
మిత్త్రులుఁ గూడ నిట్లయిన • మెత్తురె వత్తురె కొల్వ[2] భూభుజుల్.

---

1 క. మీకుఁ, 2 గ. భూజనుల్.

సీ. ఏనుంగు నెక్కి_పె • క్కేనుంగు లిరుగడ
రాఁ బురవీథులఁ • గ్రాలఁ గలదె
మణిమయం బైనభూ • షణజాలముల నొప్పి
యొడ్డోలగంబున • నుండఁ గలదె
కర్పూరచందన • కస్తూరికాదుల
నింపు సొంపార భో • గింపఁ గలదె
యతిమనోహర లగు • చతురాంగనలతోడి
సంగతి వేడ్కలు • సలుపఁ గలదె

తే. కయ్యమునఁ దోడి[1] పోయినఁ • గౌరవేంద్ర
వినుము నా బుద్ధి మరలి యీ • తనువు విడిచి
సుగతి వడయుము తొల్లింటి • చూఱ గలదె
జూద మిచ్చట నాడంగ • రాదు సుమ్ము. 204

వ. అని వెండియు. 205

క. నీయట్టివాఁడు నిన్నీ
పోయెడిదే యిట్లు వోకు • పోకు మనుడు భూ
నాయకుఁడు మరలి పటుకో
పాయత్తతఁ ద్రొక్కఁబడ్డ • యహిగతిఁ గవిసెన్.

వ. ఇట్లు గవిసి రథంబులం గడచి కవ్వడిం దలపడియె భీష్మద్రోణాది
యోధవీరులు నొక్కుమ్మడి మగిడి యధిపతితోడన విగిడి క్రీడియర
దంబుఁ బొదివిరి తక్కినబలంబులు నంతకు మున్న కౌంతేయుదెస
మరలి చూచుచుం బాఱ చునికిం జేసి యేలినవాఁడు ఋమటయును దొరలు
దెగి తిరుగుటయుం గని తెంపు సేసి కూడికొని రభసంబునం జుట్టుముట్టి

1 ఙ. పాఱిన

యతనిపైఁ గ్రందుకొన నతఁడె నివ్విధంబున వివిధవ్యూహంబు లగు బహుయోధయూథంబులుగురిసినయనేకాస్త్రశస్త్రంబులు నానాప్రకారంబు లఁ[1] గుప్పలుగూరలుగాఁ దొరఁగినం బిరిఁగినశౌర్యసంరంభంబునవిజృంభించి విజయుండాశ్చర్యధుర్యనిరతిశయరయభరితకరయుగళుం డయి రథ్యసారథిస్వాంగంబులుగాచికొని తనతోఁదంబుట్టువులప్రతినలూహించి యొందుసేయునొల్లక సపరివారంబుగా ధార్తరాష్ట్రుల భంగపెట్టందలంచి యింద్ర దైవత్యంబును సత్యసంవాదనంబును నరాతి సైన్యదైన్య సంపాదనంబును నగుసమ్మోహనాస్త్రంబుఁ బ్రయోగించిన. 207

ఆ. ఆయుధములు విడిచి • యంగముల్ సోలంగఁ
దలలు మెదలుఁబిక్క • నిలువ కొఱగ
నెల్లవారు నెఱుక • లెతలిచొక్కిక్కని
ద్రాతిశయము గూరి • నట్టు లైరి

వ. అప్పుడు పాండవోత్తముండుత్తరమాటలు దలంచి యుత్తరుం గనుం గొని.

సీ. ఇక్కురుసైన్యంబు • సొక్కి దక్కకమున్న
గ్రక్కునఁబనుము రా • రాజు ద్రోణ
తనయుండుఁ బట్టిన • తలచుట్లు వల్లవి
యువి సూతపుత్రుశి • రోంబరంబు
పచ్చనియది కుంభ • భవకృపాచార్యుల
యుష్ణిషములు వెల్ల • లుఱక నీవు
దెమ్మింతవట్టును • దేవనదీసూనుఁ
డియ్యస్త్రమునకు మా • తెఱుఁగుఁ గాన

1 ఖ. గుప్పఁ గూరుగా.

ఆ. యతఁడు దెలిసియుండు • నాతనిదెస వోకు
మనిన మత్స్యరాజ • తనయుఁ డెలమి
దొలఁక నొగలఁ బగ్గ • ములు గట్టి చని వాని
నెల్లఁ దెచ్చియరద • మెక్కుటయును.

వ. ఈ రథబృందంబులయిఱకటంబు వెడలి నిలుత మని కదలినం గిరీటిం దాఁకి గురుపితామహుండు శరవర్షంబులు గురిసిన.

క. ఆతనిరథ్యంబులఁ ద
త్సూతుని నొప్పించి సాంద్ర • సునిశితబాణ
వ్రాతంబు మేన నించిప్ప
థాతనయుఁడు నిలిపి వెడలె • దర్పోజ్జ్వలుఁడై.

వ. ఇవ్విధంబున నరదంబులయిఱకటంబు గడచి యెడ గలుగ నిలిచి రాహు[1]నిగ్రహవిరాసభాసురం డగుభానుండునుంబోలె వెలుంగుచున్నంత బలంబులు దెలిసిన.

ఆ. కౌరవేశ్వరుండు • గను విచ్చి దిక్కులు
గలయఁ జూచి పార్థుఁ • గాంచి కదఁగి
యెదురఁజూచుటయును • నమరనదీసూనుఁ
డతని కిట్టు లనియె • నల్లనగుచు.

క. ఇంత యెఱుంగవు సైన్యము
లింతవడిం దలఁబు చీర • లెఱుఁగక మోహా
క్రాంతంబు లయ్యెఁ బని దెగుఁ
గొంతేయుఁడు పొరఁడుగాని • క్రౌర్యంబునకున్.

1 గ. గ్రహణ.

క. మెడ యొఱగఁ జేతికై దువు
వడ నిపు నీ వెఱుఁగ కున్న • భంగి గనియుఁ గ
వ్వడి యూర కుండు నట చె
ప్పెడుకొలఁదియె వానికరుణ • పెంపు కుమారా.

వ. అతఁడు మన ప్రాణంబులపై రానొల్లక నిలిచిన మన మింతట విలు
చుట కార్యంబు.

ఉ. మోహనబాణపాతమున • ముందలచీర లెఱుంగ కున్న యీ
బాహుబలంబుతోఁ గడఁగి • పార్థునిఁ దాఁకెడుబుద్ధి గ్రమ్మఱన్
సాహసవృత్తిఁజేసి యవి • చారతఁ బోయితిమేని వాఁడు పూ
ర్ణాహుతి సేయఁడే మనల • నందఱ నొక్కట మార్గణాగ్నికిన్.

వ. కావున.

క మనదేశమునకుఁ బోదము
మన మల్లన తెరువు పట్టి • మత్స్యవిభువిగో
ధనముఁ గొని యతఁడు ప్రీతిం
జనుఁగా కటు మనకు నంత • చల మేమిటికిన్.

—• దుర్యోధనుఁడు పరాజితుం డై మరలి తనపురంబునకుఁ బోవుట •—

వ. అని చెప్పినపితామహుహితవచనంబు లాకర్ణించి సంగ్రామాతికామి
యుం గోపాటోపఘూర్ణమానమానసుండు నగునమ్మానవేశ్వరుండు ని
ట్టూర్పు నిగిడించి యుద్రేకంబు దక్కి నిలిచెం దక్కటివారలు నూర్జితం
బగు [1]నర్జునానలంబు వాలోకించి ధార్తరాష్ట్రరక్షణతాత్పర్యంబున
శౌర్యంబు పాలించి భీష్మ వాక్యప్రకారంబు సేసి రిట్లందఱు ముందర

1 క. నర్జునాననంబు.

దమవచ్చినవంకన తిరిగి యరుగుచున్నం గని కిరీటి శంఖరవజ్యానాదంబులు సెలంగఁ గొండొకదవ్వు వెన్నడిం దఱిమి బిరుదులతోడి గొడుగులు నడియాలంబులతోడిసిడంబులును వైపించుకొని తృప్తింబొంది పురలువాఁడై యెల్లవారును వినం బెద్దయెలుంగునం బోయివచ్చెదనని చెప్పి గాంగేయద్రోణకృపాచార్యులకుఁ బ్రణామబాణంబు లేసి వారి వీడ్కొనినవాఁడై మిట్టకోలల రారాజుమకుటంబుమణులు దులిచి యతనికిం జెప్పినవాఁడై యఖర్వబాహాగర్వనిర్వహణంబుమెఱయ నప్పుడు మధ్యందినమార్తాండప్రచండుం డగుచుండఁ గౌరవవీరు లతనిం దేఱి చూడనుంజాలక చని రతండును జూపఱం దోలి నిలిచిన [1]మదపుటేనుంగుచందంబున నిలిచి విరాటతనయున కి ట్లనియె.

ఆ. పసులు మరలె శత్రు • బలములు పీనుంగు
పెంట లయ్యె రాజుఁ • బెద్దదొరలుఁ
జీర లొలువఁబడిరి • సిగ్గఱి బిరుదులు
పైచి రింక మగుడ • వలదె మనకు.

క. హయముల మరల్చి మీఁద
ల్లియు బంధులు నెడలు నంచ • లింప గుమురు గ
ట్టి యెదురుసూతురు వారికిఁ
బ్రియముగ శీఘ్రమ్మునం బు • రికిఁ బోవలయున్.

వ. అనిన నతండు రథంబు మగిడించినం జని చని

తే. వాలు తప్పువవారలు • గలయఁ జెదరి
వెనుకంబడిపోవునెడఁ దమ్ముఁ • గ ( ) క్షయమునఁ

---

1 క. 'మదము నేమంగు' అనియె యన్ని ప్రతులఁ జూపట్టెడి.

ప్రాణదానంబు వేఁడినఁ • బార్థుఁ డభయ
హస్తమిచ్చుచు దయపెను • పారఁ బలుకు.

వ. ఇట్లు నానావిధదీనదశాదందహ్యమాను లగుకృపణులం దనకృపామృతంబునం దడిపినం దేఁటివారు దీవించుచుం బ్రణమిల్లుచుం బొగడుచుం బోవుచుండ ధనంజయుండు భూమింజయుం జూచి.

ఆ. కురుబలంబు గెలిచి • గోవుల గ్రమ్మఱ
దెచ్చుటెల్ల నీయ • దీర్ఘ బాహు
బలముకాఁగ నీవు • పలుకుము వెలిఁబుచ్చ
టుడుగు మధిపుపాల • నొందుదెఱఁగు.

క. అనవుడు నీచేసినయీ
పని వాచేఁ గాక యునికి • పతి యెఱుఁగఁటొకో
జనులు నిజము సేయుదురే
నిను నెఱిఁగింపకయ చెప్ప • నేర్తునె పొసఁగన్.

వ. అని యుత్తరుండు మఱియును.

క. [1]నీ వలచినయప్పుడ ధా
త్రీవల్లభుఁ డెఱుగునట్టి • తెఱఁగు నడపెదన్
దేవేంద్రపుత్ర యే నన
గా[2]వేఱొకపేరుగలదె • కార్యము నడపన్.

వ. అనువచనంబు లియ్యకొనుచుం జని శమీవృక్షసమీపంబున నిల్చి గాండీవాదిసాధనంబులు పూర్వప్రకారంబున నిక్షేపింపనియోగించి కపిధ్వజదేవదత్తకిరీటాది దివ్యపరికరంబుల సవినయంబుగాఁ బ్రార్థించి యంత

1 జ. నీ వలసిన 2 గ. వేఱొక్కఁడనె తలఁపఁ.

ర్థానంబు సేయించి యెప్పటి సింహపతాక రథంబున బధింపం బనిచి విరాటతనయుండు నిజాయుధంబులు గైకొని రథికుం డయి వచ్చిన నట్లుగాఁ జేసి తొంటిచందంబునం దలచీర యలవరించుకొని సారథి యై సవ్యసాచి నొగ లెక్కె నట్టిసమయంబునఁ బురందరాది బృందారకులును దేవమునిసిద్ధగంధర్వాదులును బాండుప్రముఖరాజలోకంబును నాశ్చర్యహర్షాయత్తచిత్తు లయి సమరవిషయంబు లయినమాట లాడుచు నిజనివాసంబుల కరిగి రట నరుం డుత్తరు నాలోకించి నీవిజయంబు పురంబున ఘోషింప గోపాలురం బుచ్చు మనిన నతం డది దెఱుంగుగాఁ గైకొనియట్లచేయ నిట్లు నిగూఢంబుగాఁ బట్టణంబునకుం జను చుండ నంతకు మున్న మత్స్యమహీవల్లభుం డాహవజయదర్పితవాహినీ పరివృతుం డై నగరంబు సొత్తెంచి. 231

తే. మందిరాభ్యంతరమున కా • నందలీలఁ
బాండుపుత్రులుఁ దక్కటి • బంధుజనులు
దానుఁ జని విప్రులును వని • తా[1]జనంబు
సేవ లొలుక సింహాసనా • సీనుఁ డయ్యె. 232

వ. ఇవ్విధంబునం దనవిజయంబు గొనియాడ వచ్చినవారినెల్ల నభినందించి యుత్తరుం డెచ్చట నున్నవాఁ డని యడిగి వారలవలనం గురునాథుండు భీష్మద్రోణకర్ణకృపాశ్వత్థామాదియోధవీరులు బెరసినబలంబులతోడనడచి యుత్తరంబునఁ బసులంబట్టిన నతండు బృహన్నల సారథింగాఁగైకొని యొక్కరుండ కుయివోవుటవిని విషాదవేదనాదోదూయమానమానసుం డగుచు మంత్రులమొగంబు సూచి యి ట్లనియె.

---

1 క. గణంబు.

-విరాటుఁ డుత్తరుఁడు కురుసైన్యంబు గెలువఁ బోవుట విని చింతించుట-

చ. అసమున మీఁ దెఱుంగక మ • హాగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం
బసులకుఁ గూయిగాఁ జనియెఁ • బాపఁడు కౌరవసేన యేడ యొం
టి సనుట యేడ నా కిది గ • డింది విచారము వుట్టె సైన్యముల్
వెసఁ జని తోడు గావలయు • వేగమ పంపుఁడు పాలునట్లుగన్. 234

చ. అనుటయుఁ గంకుఁ డి ట్లనియె • నక్కడ వచ్చి సుశర్మ యోడెఁ గా
వున నిట వీరికిన్ జయ మ • వున్ వెఱ పేటికి నీకు నుత్తరుం
డని నొకరుం[1]డు నాకుము బృ • హన్నల సారథిగాన గెల్చు న
య్యనిమిషకోటి నైన వతఁ • దద్భుతవిక్రమజృంభణంబునన్.

చ. అన వినుచుం గలంగుహృద • యంబునఁ దాపము నివ్వటిల్ల వి
ట్లను మఱియున్ విరాటుఁడు ర • ణావతియందుఁ ద్రిగర్తసేనచే
ననయము నొచ్చినట్టి జను • లందఱుఁ దక్కఁగ [2]నేటుఁ బోటుఁ దా
కని ఘనయోధకోటి చనఁ • గా వలయున్ [3]బలుమై రయంబునన్.

క. చని యక్కుమారుఁ డే మ
య్యెనొ యత్తెఱఁగెఱిఁగి మనకు • నెయిపించుట పు
ట్టినకార్యమునకుఁ దగియెడు
పని యట విధి గెలువ [4]వసమె • బ్రహ్మకునైనన్. 237

వ. అనుచు నుత్తరపడునయ్యవసరంబున నుత్తరుండు పుత్తెంచిన గోపా
లురు పఱతెంచి యతనిం గాంచి. 238

---

1 'డనాకుము' అని నాల్గు ప్రతులపాఠము. 2 అ. నాటెఁబోటు.
3 క. బలుపై, గ. బలమై. 4 జ. వగునె.

చ. కురుబలమున్ జయించి మన • గోవుల నెల్లను గ్రమ్మఱించి యు
త్తరుఁ డిదె తాను సూతుఁడు సు • దగ్రగతి వచ్చుచు నున్నవాఁడు త
త్తురగరథధ్వజాలి నొక • త్తుప్పుడు రాఁదు మమ్ముఁ దిల్చి వే
పురి ¹నెఱిఁగింపుఁడన్న నృప • పుంగవ వచ్చితి మేము నావుడున్.

తే. అంతరంగంబు నిండి రెం • డలవులందు
వెడలుసంతోషపూరంబు • విధము దోఁపఁ
గన్నుఁగవ సమ్మదాశ్రులు • గడలుకొనుచు
గండపులకాంకురములతోఁ • గ్రమ్ము దేర. 240

క. ఏమేమీ యని గోప
స్తోమముఁ బలుమాఱు నడుగు • చుఁ బెం పొదలన్
భూమీశుఁ డపుడు మంత్రుల
మోములు గనుఁగొని సగర్వ • మున నిట్లనియెన్.

శా. వీటన్ వీథుల నెల్ల నేనుఁగులపై • విస్ఫారఘంటాధ్వనిం
జాటం బంపుఁడు పేర్మి నుత్తరుజయా • శ్చర్యంబుఁ బుణ్యాంగనా
కోటిం బుచ్చుఁ డెదుర్కొనంగ మహిత • క్షోణీసుర వ్రాతముల్
ఘోషస్యందనవారణవ్రతతులం గూడన్ సతూర్యంబుగన్. 242

క. ఉత్తమ కన్యాజనములు
నుత్తరయును గంధమాల్య • యుక్తముగఁ గుమా
రోత్తము నెదుర్కొనం దగు
నత్తెఱఁగున సంఘటింపుఁ • డభిరామముగాన్. 243

వ. అని నియోగించి గోపాలురకుం గట్ట నిప్పించి కంకు నాలోకించి నెత్తం
బొకపలుక యాడుద మే యని యుబ్బుమైమాటగాఁ బలికిన నతండు

¹ గ. ెఱిఁగింపు.

నీవు ¹సుమాళంబున నున్నవాఁడవు నేఁడు నీతోడ నాడి జయింప రాదు
వెఱతు ననిన విరాటుండు నగుచుఁ దత్ప్రదేశంబున మెలంగు పైరం
ధ్రిం గనుంగొని సారెలా దెమ్మని పనిచి పలుక ముందటికిఁ దిగిచి
కొనుచు నిందు ర మ్మనవుడుఁ బాండవాగ్రజుండు జూదంబాడుట యెంత
లెస్స యనుచుం జేరి యాడం దొడంగునప్పుడు మఱియు ని ట్లనియె.

ఆ. జూద మాడి ధర్మ • సూనుండు రాజ్యంబు
ననుజులను గ్రియాంగ • నను బణంబు
గాఁగ నొడ్డియాడి • కొఱియఁ బడఁడె య
ట్లగుట ²దీనితోడి • యర్థి గీడు. 245

వ. అని పలికి యాడుచుండు సమయంబున.

మ. నరనాథుండు ప్రమోదసంపదుదితో • న్మాదంబుమై ని ట్లనుం
గురుసైన్యంబుల ముట్టి గెల్చి యెలమిన్ • గోవర్గముం దెచ్చె ను
త్తరుబాహాబలరశ్మ్యోసారము లుదా • త్తంబుల్ గదే యెందు వె
వ్వరు నెక్కాలము నిట్లు సేసిరె కులై • శ్వర్యం బవార్యంబుగన్.

వ. అవివ విని కంకుం డతని కి ట్లనియె.

చ. కురుపతిభీష్మకర్ణకృప • కుంభజముఖ్యమహోగ్రయోధవి
స్ఫురణము నోర్వఁ జాలి రణ • భూమి భుజాబల ముల్లసిల్ల ను
త్తరుఁడ జయించెనేని వసు • ధావరయింతటికంటె నింక న
చ్చెరువును గల్గునే ధరఁ • బ్రసిద్ధికి నెక్కుఁడె యాతఁ డొక్కఁడున్.

తే. అనినఁ గటకటఁబడి యిట్టు • లాడు బెల్ల
నతని విజయము సందియ • మనుటగాదె

1 క. సమాణంబున. 2 క. దీనితోడి • దధిప కీడు.

యింతవట్టును సైరించి • తీవు గాన
యింక నీమాట లుడుగుము • కంకభట్ట.

వ. అనుచు విరాటుండు గటంబు లదరఁ గన్నులఁ గెంపు గదురఁ బలుక చప్పు దగ్గలంబుగా నాడుచున్న సరకుసేయక యుధిష్ఠిరుండు వెండియు ని ట్లనియె. 251

చ. కురుబల మేల దైత్యసుర • కోటులు వచ్చిన గెల్వ రాదె యు
త్తరునకు నాబృహన్నల ర • థంబుపయిం బరవాహినీభయం
కరభుజసారమున్ మెఱయఁ • గాఁ దటి గాంచితి నంచు విక్రమో
ద్ధురగతి నాజికేలినిర • తుండయి దుర్దమలీల నుండఁగన్. 252

వ. అనిన విని సక్రోధహాసోల్లాసనికృతాననుం డై మత్స్యమహీనాథుండు.

ఉ. వింతలు సాల నీవలన • వింటిమి గాని ధరిత్రి నెందు నే
మింతకు మున్ను సారథుల • నెవ్వరిఁ జూడమె వైరివీరదు
ర్దాంతభుజావిలాస మల • రం దెగి పోరుల నప్రశప్రవి
క్రాంతిఁ గడంగువారి నని • కన్నుల నిప్పులు రాలుచుండఁగన్. 254

క. నాకొడుకుపోటుమాటలు
నీ కేటికిఁ బొసఁగ నాడ • నేరవు మూర్ఖో
ద్రేకములఁ బలుకుచుండుట
మాకు సహింపఁగరాదు • మానుము విప్రా. 255

క. అనినం జలమునఁ గుంతీ
తనయాగ్రజుఁ డిట్టు లనియె • దరహాసం బా
ననమున మసఁగువడఁగ న
జ్జననాయకుతోడ నిట్లు • శంకితభంగిన్. 256

ఉ. ఆహవకేళి వేడుక బృ • హన్నలచి త్తమునం [1]దెలర్చినన్
సాహసవృత్తి నుత్తరుని • సారథిగాఁ గొనిపోయి కౌరవ
వ్యూహము నోర్చి నీపసుల • నొక్కఁడుఁ దక్కక యుండ సత్వరో
త్సాహతఁ దెచ్చెఁ గా వలయుఁ • దప్పదు నాపలు కట్ల చూడుమీ.

క. అని యంతట నిలువక య
మ్మనుజేశ్వరుఁ మొగముఁ జూచి • మఱియును నతఁ డి
ట్లనుఁ బురములోనఁ జాటం
బనుపు బృహన్నల జయంబు • భవ్యవిచారా. 258

—• విరాటుండు కంకుని సారె గొని వ్రేయుట •—

ఆ. అనిన రౌద్రరసము • మనమున నడరంగఁ
బడగ యెత్తునురగ • [2]పాలురేఁడు
నెనయుచేతిసారె • గొనివ్రేసెఁ బతి [3]పేది
గడన యుడుగు మన్న • నుడుగ వనుచు 259

వ. ఇవ్విధంబున వ్రేటువడి యజాతశత్రుం డలుక గదురనిహృదయంబు
బాంచాలిదెసం జూడ్కి మలఁగ నూర కుండె నన్నారీరత్నంబును
రయంబునం జేరి వ్రేటుగంటిం దొరఁగురుధిరంబుఁ దన యుత్తరీయం
బున మెత్తన యొత్తి యచ్చేరువ నున్నకనకకలశజలంబులం గరత
లంబు దడిపికొని తుడుచునప్పుడు మత్స్యమహీవల్లభుం డీశోణితంబు
పై చీరం బట్టుటకు గతం బేమి యని తన్నడిగిన నతని కిట్లనియె.

1. క. దలిర్చినన్.
2. క. పాలరేఁడు.
3. యన్న, గళను నుడుగు .... నుడుగఁ డనుచు.

తే. విమలవంశంబునను బుణ్య • వృత్తమునను
వఱలునీతవిరక్తంబు • వసుమతీశ
ధరణిపైఁ నెన్నిబిందువుల్ • దొరగె నన్ని
1 వర్షములు గల్గు నిందనా • వర్షభయము.

వ అని చెప్పి యుత్తమద్విజలోహితపాతం బెట్లునుం గీడు గావున నీకు నొకహాని పుట్టుటకుఁ జాలక యిబ్భంగిం జేసితి నని వెండియుఁ గొంగొంగ కీలాలంబుదొరఁగం దొరఁగం దుడుచు చుండె నంతనట యుత్తరు నెదుర్కొ నం బోయి, 262

క. మంగళతూర్యరవములు సె
లంగగ మౌక్తికవిమిశ్ర • లలితాక్షతవృ
ష్టిం గురిసిరి విప్రులుఁ బు
ణ్యాంగనలును భద్రవాక్య • యంబులతోడన్. 263

ఉ. అత్తఱిఁ గన్యకాజనస • హస్రము దానును జేరి వేడ్కమై
నుత్తర చందనార్ద్రికుసు • మోత్కరమున్ నవరత్నసంచయో
దాత్తసువర్ణపుష్పములు • దండడిఁ జల్లెఁ గిరీటిమీఁద స
య్యుత్తరుపైఁ బ్రమోదకల • నోత్కటసంభ్రమసంభృతంబుగన్.

ఉ. తక్కటివారలుం గని ము • దం బల రారఁగఁ గౌఁగిలించుచున్
మ్రొక్కుచు నాదటం దనదు • మోముపయిం దనివోనిచూడ్కులం
గ్రిక్కిఱియించుచుం బొదివి • గెల్పు నుతింపఁగ రాజపుత్రుఁ డ
2 య్యెక్కుడుమాట కోరువక • యట్లను నర్హజనంబుతోఁ దగన్.

1 జ. వర్షములగు ననావృష్టి • వలనిభయము.
2 గ. య్యెక్కువమాట.

చ కురుబలముఁ జయించుటయు • గోవులఁ దెచ్చుటయున్ బృహన్నలా
స్ఫురితభుజాబలంబునన • చూవె నిజం బిది నాక యేల యె
వ్వరికిని [1]నెవ్వరిం గెలువ • వచ్చున యిట్టిసహాయసంపదం
బొరయక యున్నమీ కెఱుఁగఁ • బోలునె నాఁబదు కెట్టిభంగియో. 266

వ. అని సారథ్యప్రశంసాప్రకారంబుగా నక్కుమారుం డత్యుపచారవచనం బుల చందంబున సంక్రందననందను నుతించుచు జనుదెంచి రాజమందిర ద్వారంబుఁ జేరునవసరంబునఁ బ్రతిహారి ససంభ్రమగతిం జని భూవ ల్లభునకుం బ్రణమిల్లి భూమింజయప్రవేశంబు తెఱంగు విన్నవించిన నా రథికసారథులం జూచువేడ్క మనంబు వేగిరపెట్టెడు నయ్యురువుర వియ్యెడకుం బయ్యనఁ దోడితెమ్మనువిభుని పలుకులు విని ధర్మతన యుండు పణిహారితో ని ట్లనియె. 267

క. ఇన్నొత్తురు గనుగొనిన బృ
హన్నల కోపించువన్ను • నతిభక్తిమెయిన్
మన్నించుఁ గాన రాజుం
దన్నువిచారింప కేమి • [2]దప్పు దలఁచునో. 268

వ. ఇది తెన్నగాఁ దుడుచునంతతుఁదదీయప్రవేశం బించుకవడి వారిం పుము పదంపడి రానిత్తు గాని యంతకు నుత్తరుం డొక్కరుండు వచ్చునట్లుగాఁ జేయుము.

క. అనిచెప్పి హర్షసంభ్రమ
మున నజ్జననాయకుంతు • మునుఁగుట నదియే

---

1 క ఖ. నెవ్విధిం గెలువవచ్చునె....బొరయఁగఁ గన్న, గ ఘ. గెల్వ వచ్చునవెవారక....బొరయఁగఁ గన్న, 2 క. దప్పఁ,

మని యడుగఁ దలంపమిఁదన
కను వైకార్యము ఘటించి • యతనిం బుచ్చెన్. 270

చ. అతఁడును బార్థు నిల్పి విష • యంబున నుత్తరుఁ దోడితెచ్చినం
బితృచరణాంబుజంబులకుఁ • బ్రీతిమెయిం బ్రణమిల్లె నాతఁడా
పతియునుఁ జిక్కఁ జేర్చె గరు • పాఱెడు మేనును హర్షబాష్పసం
ప్లుత మగునాననంబు నయి • పుత్రునిఁ బెద్దయుఁ బ్రొద్దు గౌఁగిటన్.

వ. ఇవ్విధంబున నాలింగింతుం డయి భూమింజయుండు పునఃపునఃప్రణా
మంబు సేసి కంకునిం గనుంగొని సగౌరవంబుగా నమస్కరించి
మొగంబు గంటి నూచి యిదియేమి యని యడిగిన. 272

క. ఏనీవిజయము వొగడఁగఁ
దానప్పుడు పేడిఁ బొగడె • దానం గోపం
బూనిన సైరింపక నా
చే నడిచితి సారె గొని వి • శృంఖలవృత్తిన్. 273

క. అని పతి పలికిన విని నె
మ్మనమున భయసంభ్రమములు • మల్లడిగొన న
మ్మనుజేంద్రనందనుం డి
ట్లను సత్యాదరము మెఱయ • నాతనితోడన్. 274

తే. తప్పు సేసితి రిట్టులు • దగునెవీర
లేమిగతిఁ బల్కినను నది • యెల్ల మనము
గైకొనవలయుఁగాకిట్లు • గాదు గూడ
దని నిషేధించుటొప్పునె • మనుజనాథ.

వ. అని మఱియును.

క. సవినయముగఁ బ్రార్థింపుఁడు
పవిత్రచారిత్రులైన • పరమద్విజు లి
ట్లపమతులై కోపించిన
నవనీశుల కేల కల్గు • నాయువు సిరియున్. 277

వ. అనిన విని యమ్మాటలు పాటిగాఁ బట్టి విరాటుండు భయభక్తియుక్తం బుగా వేఁడికొనినం బాండవాగ్రజుండు నగుచు నాకు నలుక యెక్కడిది యితండును గీడుతెరువువాఁడు గాఁ డిది యొకప్రొద్దు[1] కీడున నయ్యెం గావి యని తాను రాజుదెసఁ బ్రసన్నుం డగుట దెలియునట్లుగా నుత్తరు తోడం బలికిన నమ్మహీవల్లభుండుసంతసిల్లి తదవసరంబునఁ బ్రవేశించి కాంచిన యాబృహన్నల నాదరించి నిటనందను నాలోకించి యి ట్లనియె.

—• విరాటుఁ డుత్తరుని సమరప్రకారం బడుగుట •—

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు • ద్రోణసుతుండును గర్ణుఁడుం బలు
త్రాణ పరాయణత్వమున • దర్పసముజ్జ్వలభంగి నుల్లస
ద్బాణపరంపరల్ గురియఁ • బార్థివుఁడు వెసు దన్ని చూడు న
క్షీణజవంబునం గవియు • సేనకు మార్కొన నగ్గలించితే. 278

ఉ. బాసట లేదు క్రొవ్వడర • బంటుతనంబునఁ దాఁకితేనియుం
జూసినచోట వాయఁ బెఱ • పట్టులవీరు లుదగ్రవృత్తిమై
మూసికొనంగ వత్తు రొక • మోహర[2] మమ్ముల బ్రమ్మగెనేని నా
సాసల నొక్కరుండ యను • నాగ్రహవృత్తి బలంబు పైఁబడున్.

ఆ ఒకఁడు పరశురాము • నోర్చువాఁడొక్క
రుండు ధనువునకు గు • రుండు దాన

1 గ. కారణంబున, జ. గుణంబున 2 అ బిమ్ముల బ్రమ్మగెనేని.

హయవరమునఁ బుట్టి • యక్షీణబలవిక్ర
మముల నొక్కఁ డొప్పు • మాఱు లేక. 281

ఉ. తక్కటివారలున్ సుతల • దైత్యుల నైనను బోర గెల్వవా
రక్కురుసేన మేటిమగ • లా ధృతరాష్ట్రతనూజు లాజి నొ
క్కొక్కఁడ ధాత్రి యంతయును • నోర్వఁగఁ జాలుదు రట్టివారి నీ
వెక్కటి దాఁకి నొవ్వకయు • నెమ్మెయి గెల్చితి నాకుఁ జెప్పుమా.

ఉ. గోవుల నెట్టు [1]లాఁగితి వ • కుంఠితవిక్రముఁ డైన రాజరా
జేవిధి మానభంగమున • కెల్లను నోర్చి పలాయమానుఁ డై
నీవిజయంబు సైఁచి ఘన • నిందకు నియ్యకొనంగఁ జాలెఁ బు
త్రా వెఱఁ గయ్యెడున్ రణవి • ధం బఖిలంబు నెఱుంగఁ జెప్పుమా.

చ. అనవుడు నాతఁ డిట్లనియె • నక్కురుసేనల నేను గెల్వ గో
ధనమును నే మరల్ప మన • దైవబలంబునఁ జేసి దేవసం
జనితుఁడు నాఁగ నర్హ మగు • చందమువాఁడు మహాత్ముఁ డొక్కరుం
డని ననుఁ గాచెఁ గౌరవుల • నందఱ గెల్చె మరల్చె గోవులన్.

వ. అత్తెఱంగు వివరించి విన్నవించెద నవధరింపుము. 285

తే. ధూళిపెల్లుగ నెగయంగ • నేలగోడి
వడఁగఁ జనుమూఁక గని పడు • వడ వడంకి
పాఱుదేరంగ నమ్మహా • భాగుఁ డప్పు
డోడ కోడకు మని నన్నుఁ • గూడవచ్చి. 286

వ. పట్టుకొని మగుడం గొనిపోయి రథంబుపై బెట్టిన నే నతనియాజ్ఞకు
మిగులకుండితి. 287

1 తీఁగితి

ఉ. కౌరవసేన గోగణముఁ • గైకొని పోవ నతండు ముట్టి యం
దారసి రాజుఁ గానక యు • పాంతమునం దొలఁగించి వేగ నా
తేరట దోలి యడ్డపడి • తీవ్రశరంబుల నబ్బలంబుదు
ర్వారరయంబు మాన్చి పశు • వర్గము నిద్దెస వెల్చె నార్చుచున్.

ఆ. చెదరకుండఁ బసులఁ • బొదివి యించుకమేర
యుక్కడరుగుదెంచి • యెలమి మగిడి
కడచిపోవుచున్న • కౌరవపతి ముట్ట
నడరినంత సేన • లతనిఁ గూడె. 289

మ. కురురాజున్ సబలంబుగాఁ గవిసినన్ • ఘోరాహవం బయ్యె నం
దరదంబుల్ నుఱు మయ్యె నశ్వములు ను • గ్గయ్యెం గరివ్రాతముల్
ధర దంతంబుల యూఁతఁగా నొఱగె ను • ద్యద్బాహుదృప్యద్భటో
త్కరముల్ దిట్టినయట్లు గూలెఁ గలయం • దద్బాణపాతంబులన్.

క. శత్రుంతపాదు లగు నృప
పుత్రులుఁ బేరు గలయోధ • పుంగవులును ద
చ్చిత్రశరవిహతి సంగర
ధాత్రిఁ బడిరి వారి నెన్నఁ • దర మై యుండున్. 291

తే. మొదలు దెరలినఁ గర్ణుండు • మునిచి తాఁక
నమ్మహావీరుఁ డాతని • [1]తమ్ముఁ జంపి
హరుల నొప్పించి సూతు నో • నాడ నేసి
యంగముల బాణములు నించి • యతనిఁ బఱపె. 292

1 అ. అనుజుఁ

క. గురుఁడు దలపడిన నతఁడ
చ్చెరువుగ దివ్యాస్త్రవితతిఁ • జిక్కువఱిచి త
ద్వరసుతుఁడుఁ గృపుఁడుఁ దాఁకినఁ
దెరలిచి భీష్మునకుఁ గవిసె • దృఢరథసమునన్.

మ. అతనిం దీవ్రశరంబులం బొదివి నా • నాస్త్రంబు లేసెన్ నదీ
సుతుఁడుం దత్సమయంబునం గినిసి యా • శూరుండు చాపంబు ద్రుం
చి తదీయాంగము నొంచినన్ వివశుఁడై • చేడ్పడ్డచో సూతుఁ[1]డు
ద్గతిభీతిం దొలఁగంగఁ దోలె రథముం • దత్ప్రాణరక్షార్థియై. 294

క. తమతమబలములతో ని
ట్లమితభుజావీర్యులైన • యారథికవరుల్
గ్రమమునఁ దలపడి యోడిన
సమరవిహారమునఁ దనివి • సనక యతండున్. 295

మ. ధరణీనాథుఁడు దానుఁ దమ్ములును దు • ర్దాంతోద్ధతిం గూడి మో
హర మత్యూర్జితభంగి నేర్చికొని యు • ద్యద్విక్రమం బొప్ప బం
ధురసంరంభత నున్నఁ జూచి [2]బలవ • ద్దోస్తంభలీలాభయం
కరరేఖావనమానచాపుఁ డయి వీఁ • కం దాఁకె నాసేనతోన్. 296

క. కౌరవపతియనుజన్ముల
దూరమునన్ విశిఖనిహతిఁ • దొలఁగ జడియుచుం
జేరి వికర్ణునికరి నొక
నారసమునఁ గూల్చి కదిస • నరపతి నొంచెన్. 297

---

1 జ. దుద్ధిత, 2 గ. ప్రచలద్దో.

తే. రాజు నొచ్చిన విటగిరి • రథికవరులు
విభుఁడు దోడన తిరిగెన • వ్వీఁకఁ దపుడు
[1]దోలి చూచిక్కుమూఁకల • తోఁతఁ గూడ
నతని దవ్వుల [2]నడవికి • నడిచి మగిడె. 298

వ. ఇది యమ్మహాపురుషుచేసిన [3]విధం బనిన విని యచ్చెరువంది విరా
టుండు. 299

ఆ. ఆతఁ డెవ్వఁడొక్కొ • యమ్మహాత్మునిఁ గనుం
గొనఁగఁ గౌఁగిలింప • వినయమొప్ప
నర్ఘ్యపాద్యవిధుల • నర్చింప భక్తిసం
యుక్తి నెపుడుఁ గొలిచి • యుండవలయు. 300

క. ఎచ్చోట నున్నవాఁ డతఁ
డిచ్చోటికి నేల రాఁడొ • యిప్పు డనుడుఁ దా
నచ్చట నంతర్హితుఁ డై
యిచ్చఁ జనియెఁ దోఁచు నేఁటి • యెల్లిటిలోనన్. 301

ఉ. దేవకుమారకుండ యగుఁ • దేజముచందము సూడ నాతఁ డీ
గోవులఁ గ్రమ్మఱించుటకుఁ • గూడినయంతియ కాదు నాకు సం
భావన సేయువత్సలత • భంగులఁ దా మనవంశ మంతయుం
గావను బ్రోవనుం దలఁపు • గల్గుట దెల్లము సేసె నెంతయున్. 302

వ. అని చెప్పి యుత్తరుం డతని బ్రమోదాయత్తుం జేసె నట్టిసమయం
బునఁ గౌంతేయాగ్రజుండు ముఖప్రాంతంబు పై చీరచెఱంగున నొత్తివి
కొని ధనంజయునిఁ జక్కం జూడక యుండె విరాటుండు కిరీటిపరాక్ర

1 క ఖ. యుడిచిక్కు, 2 అ. నడిమికి, 3 గ. పౌరుషం.

మంబు క్రమంబున నిట్లు దనతనయునివలన వినియునుం దెలియక యెప్పటినపుంసకత్వబుద్ధితోడన సంభావించి పోవం బనిచిన బృహన్నల యును జతురంబుగాఁ బలికి తిదియతెఱంగు ధర్మనందనునకు నింతకు మిక్కిలి యెఱింగింపకుండునది యని వైరాటితో నల్లనచెప్పుచుంజనియె నజ్జననాయకుండును గంకునిం బొమ్మని యుచితపరివారవృతుం డయి భూమింజయు నంతిపురంబునకుం దోడ్కొని యరిగి సుధేష్ణాసందర్శన సమాచరణంబు నడపి యతం డడుగఁ ద్రిగర్తపతి నోర్చిన తెఱంగెఱిం గించె నట నరుండు నాట్యశాలకుఁ బోయి. 303

—• అర్జునుఁ డుత్తరకు బొమ్మపొత్తికలుగా గురువీరుల శిరోంబరంబు లిచ్చుట •—

తే, చెలులుఁ దానును నుత్తర • యెలమిఁ దన్నుఁ
గాంచుటయుఁ బ్రీతి యొసలార • గారవించి
బొమ్మపొత్తిక లడిగితి • కొమ్మ యిందు
మసుచు నిచ్చెఁ దాఁ దెచ్చిన • యంబరములు. 304

వ. ఇవ్విధంబునఁ గృతకృత్యుం డయి యథాపూర్వంబుగా మజ్జనభోజనం బులు సలిపి ధర్మతనయునివాసంబునం దేకాంతస్థలంబునఁ దా రేవు రును ద్రౌపదియును గూడఁబడునట్టితెఱంగు సంఘటించి సమాగమ సముచిత ప్రకారంబు నడపి గోగణనివర్తనంబును రణప్రవర్తనంబును వనోన్యన్యవిదితం బైనయనంతరంబ యగ్రజు నుద్దేశించి బీభత్సుండు భీమసేనున కి ట్లనియె. 305

క. మొగ మొప్పదు నా దెస నీ
జగతీనాథునకు నే వి • చారించియునుం

దగ దీనికిఁ గారణ మిది
యగు నని యేర్పఱుప నేర • నయ్యెద నెట్లున్.

వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కి ట్లనియె. 307

క. ఒండేమియు లేదు విరా
టుం డాత్మతనూజుఁ బొగడు • చును దుర్దమదో
ర్దండత గల్గుబృహన్నల
యుండఁ జొఱఁత యేమి పగఱ • నోర్చుట కంటిన్.

ఆ అనినఁ బేడిఁబొగడె • దని యవివేకి యై
కోప మడర సారె • గొని యతండు
వ్రేసె నెత్తు రపుడు • వెడలఁ బోయినఁ జీరఁ
గప్పికొంటి నీవు • గానకుండ. 309

క, అని చెప్పి గంటి సూపిన
ననిలతనూభవుఁడు గనలి • యాదుష్టాత్ముం
దనయాదిబంధుహితముగ
ననిచెద జముప్రోలి కనియె • నంగము వొంగన్. 310

వ. కిరీటియుం గోపించి.

క. తనకొలఁది యెఱుంగనియ
మ్మనుజాధము నిపుడ పట్టి • మర్దింపక త
క్కనె గాదు వీనిరాజ్యము
నిను వంతయుఁ జేరుఁ గా క • నియె ధర్మజుతోన్.

చ. అనవుడు నాతఁ డిట్లు లను • నక్కట యింతకు ముంద రేమియున్
మనల నెఱుంగఁ డవ్విభుని • మాటునఁ బూనిన దీర్చికొంటి మా

తని కొకయెగ్గు సేఁత యుచి • తంబె యెఱింగెదునట్లు గాఁగఁ బో
యినఁ గనియెడు దురుద్ధతి వ • హించినఁ జూతము గాక పిమ్మటన్.

వ. అని పలికి వారల్[1]కందు మాన్పి యిది యట్ల కాక యొండు దగునె యనుచుఁ దక్కినవారిదెసయుం గనుంగొనిన నెల్లవారు నుపశమించిరి తదనంతరంబ తమ్ము నెఱింగించు తెఱంగు దలపోసి వా రందఱు విరాటుకొలువుకూటంబునకుం బోయి బయలు మెఱసి యుండువారుగా నిశ్చయించి యారాత్రి గడపి వేగుటయుం గృతస్నాను లయి పాండు సూనులు సమయవిహితాచారంబులు నడపి యుచితప్రకారంబున. 314

క. తెలుపు లగుచీరలను బూఁ
తలఁ బువ్వుల నొప్పి రాజ • తనయానుగుణో
జ్జ్వలమాననీయవేషము
లలవడఁ గూడుకొని నగరి • కరిగిరి ప్రీతిన్. 315

క. చని ధర్మసుతుఁడు సింహా
సనమున భీమాదు లాత్మ • సముచితరుచిరా
సనముల సభాస్థలిం గయి
కొని పంచాగ్నులునుబోలెఁ • గూర్చున్నంతన్. 316

తే. వేడ్కఁదొడివూసికట్టి య • వ్విరటుఁ డుత్త
రుండు దోఁజనుదేరఁగొ • ల్వుండుబుద్ధి
నచటి కేతెంచి కని విస్మ • యంబు నొంది
యెల్లిదంబుగఁ దలఁచుచు • నిట్టు లవియె. 317

క. ఇదియేమి కంక నీ వు
న్మదవృత్తివు శంక దక్క • నాగద్దియపైఁ

1. కుందు.

బదిలంబుగఁ గూర్చుండితి
వదియును గా కిపుడు డిగ వ • హంకారమునన్. 318

వ. అనిన విని మందహాసంబు సేసి సంక్రందననందనుం డతని కిట్లనియె.

సీ. నతవిదీవియలు సేసె • నగరికి మాణిక్య
మకుటముల్ పూనిన • మనుజపతులఁ
దగునాజ్ఞసూయాణ • ముగ నొనరించె మం
చిగ నేలనాలుగు • చెఱఁగులకును
శ్రీశార్థిజనుల స • చేతనత్యాగధ్వ
జములుగా నన్నిదే • శ ములఁ బఱపె
దిక్కులన్నింటను • దెలుపారుపూఁత గా
వించె నుజ్జ్వలయశో • విభ్రమంబు

తే. రాజసూయాధ్వరప్రవ • ర్తకుఁడు నిత్య
సత్యభాషామహావ్రత • శాలి పాండు
రాజదుగ్ధపయోనిధి • రాజు ధర్మ
రాజు సుమ్ము మత్స్యావనీ • రమణ యితఁడు.

ఉ. ఈతఁ డజాత శత్రుఁడు మ • హిం దగ దిగ్విజయంబు సేసె వి
ద్యాతిశయార్థి వాసవు మ • హాసన మైనను నెక్కె నర్హుఁ డు
ద్యోతితమూర్తి కౌరవకు • లోద్వహుఁ డార్యనికాయసంతత
ఖ్యాతచరిత్రు డీచిఖిత • గద్దియకుం దగఁడే నరేశ్వరా. 321

—• అర్జునుఁడు విరాటునకుఁ దమ్మెఱిఁగించుట •—

వ. అనిన విని యతండు విస్మయసంశయంబులు మనంబున బెనంగొన
నితండు ధర్మతనయుండయేని భీమార్జుననకులసహదేవులుం బాంచా

లియు [1]వేరి యని యడిగినఁ గవ్వాడి యి ట్లనియె. 322

చ. వఱలుఁ దనంగ నీ నగర • వంటలవాఁ డయి నిల్చి వేడ్కకుం
బులిఁ గరిఁ గేసరిం దొడరి • పోరఁగఁ బంచినఁ బోరు జెట్టిమ
ల్లుల విఱుచుం గడంగి ప్రబ • లుం డనఁగాఁ జరియించు చుండు వి
చ్చలవిడి భీముఁ డీతఁ డవి • షహ్యపరాక్రమదుర్దముం డని౯. 323

తే. బకమహాసురు నిర్జించి • బ్రాహ్మణులకుఁ
బ్రీతిఁ గావించెఁ గిమ్మీరు • పే రడంచి
వనము నిష్కంటకము సేసె • ఘను హిడింబుఁ
గూల్చి యాతనిచెలియలిఁ • గొనియె నితఁడు. 324

క. నీమెచ్చు వారువంబులఁ
దా[2]మచ్చిగ నరయు నిత్య • తాత్పర్యమున౯
దామగ్రంథి యనఁగ నొక
నామము ధరియించె నితఁడు • నకులం డధిపా. 325

క. శత్రునృపకాలకూటము
మిత్రామృతవృష్టి బుధప • మీహిత[3]సిద్ధి
క్షేత్రము సజ్జనసంస్తుతి
పాత్ర మితఁడు మాద్రితొలుత • పట్టి నరేంద్రా, 326

క. నీపాలికి వచ్చి నిఖిల
గోపాలకముఖ్యవృత్తిఁ గొలువు వడసి తం
త్రీపాలుఁ డనఁగ మత్స్య
క్ష్మాపాలక మెలఁగు వీఁడె • సహదేవుండు౯. 327

1 గ. నేరి, 2 జ, మెచ్చుగ, 3 క. సిద్ధ, గ. బుద్ధి.

క. సుకుమారమానసుఁడు గొం
తికిఁ బ్రాణము ప్రాణ మితఁడు తేజోగణ్యుం
డకుటిలుఁడు రాజనీతి
ప్రకారసంవేది వంశ • పావనుఁడు నృపా. 328

వ. అని యిట్లు ధర్మజభీమనకులసహదేవులం గ్రమంబునం జూపి చెప్పి
మఱియు ని ట్లనియె. 329

క. విను పైరంధ్రీవేషం
బున మాలిని యనఁగ బరఁగి • పూతచరిత్రం
బునఁ గేకయభూవరనం
దనకడ మెలఁగుసతి ద్రుపద • తనయ మహీశా.

క. ఆచపలాక్షికిఁగా మన
కీచకు లందఱును రాత్రి • గీటడఁచె రహ
స్యోచిత విధమున గంధ
ర్వాచరణము పేర భీముఁ • డతిభీమముగాన్. 331

—• విరాటునకు భీముఁ డర్జును నెఱింగించుట •—

వ. అనియె నప్పుడు వృకోదరుండు. 332

సీ. షండరూపమునఁ బ్ర • చ్ఛన్నుఁ డై వచ్చి క
న్నియలకు నెల్లను • నృత్తగీత
వాద్యనైపుణ మన • వద్యశిక్షావిధి
నలవరించుచు బృహ • న్నల యనంగ
బరఁగునీతండు బీ • భత్సుండు సు మ్మని
చూపి యమ్మత్స్యరా • జునకుఁ జెప్పి

వెండియుఁ బలుకు నా • ఖండలు నోడించి
ఖాండవ మేర్చె నా • తండు దన్ను

తే. గారవించిన నెక్కటి • కాలకేయ
వర్గములఁ బరిమార్చె ని • వాతకవచ
సంఘములనోర్చె గంధర్వ • సమితిగెలిచి
ధార్తరాష్ట్రాగ్రజుని చెఱఁ • దలఁగె నితఁడు.

వ. అనిన విని యద్భుతరసాక్రాంతం బగునంతరంగంబునం గలుగుసందే
హావేశంబువినయసంభ్రమంబుల నిగుడ నీ కునికిం జేసి చిక్కువడి
యున్ననిజజనకునకు నర్జునుం జూపి యుత్తరుం డిట్లనియె. 334

తే. ఈతఁ డింతకు మీకుఁ ద • న్నెఱుఁగఁ జెప్ప
వలవ దని నియమించినఁ • దెలియఁ బలుక
నలికి యొక దేవసన్నిభుం • డంటిఁ గాని
నిన్న యంతయుఁ దాఁ గదా • నిర్వహించె. 335

చ. ఒకరుఁడ తాను భీతి వెగ • [1]డొందెదురెండవనన్ను నెట్టకే
లకుఁ దగఁ దేర్చునప్పుడు బ • లంబులతోఁ గురురాజు నూడ దా
నికి మది శంకలేమి మహ • నీయపరాక్రముఁ డైనయాకిరీ
టికిఁ జనుఁగాక యివ్విధము • డెప్పర మన్యుల కోర్వ వచ్చునే.

చ తమ నెఱిఁగింప యల్లనుచు • తత్ప్రియభాషల నన్ను నూతకృ
త్యమునకుఁ జొన్ప నేను భ్రమ • దంబున [2]నప్పటి కియ్యకొంటిలో
కము సమరంబునట్ల యని • కయ్యముతీవ్రతకుం దగంగ ర
థ్యములఁ జరింపఁజేత భర • మై తుదిఁ బల్మఱు నోవాటించితిన్.

1 గ. డొందఁగ రెండవయేను, జ. డొందెదు రెండవునేను-నెట్టకేలకు నన్నుఁ దేర్చు, 2 జ. నప్పని

క. మొగ మోడ్చి తితఁడు కౌరవ
జగతీశుఁడు విజిగినపుడు • జవమున వెనుకం
దగిలి యని జూద మాడఁగ
నగునెడగా దఱుమ వలయు • నతనితోన్.

ఆ. అనిన నతఁడు వెఱపు • నత్యాదరంబును
సంతసంబు మాన • సమున బెరయ
నవయవముల సంభ్ర • మావేశ మేర్పడ
గారవమున విజయుఁ • గౌఁగిలించె. 339

క. వినయంబు మిగులఁ గుంతీ
తనయాగ్రజు పాదపీఠ • తలమున ఫాలం
బును బొందఁ జాఁగి మ్రొక్కియ
తని కౌఁగిలి వడసె సమ్మ • దము దళుకొత్తన్. 340

ఆ. ప్రీతి నలుమడింప • భీమునిఁ గవల నా
లింగనంబు సేసి • యంగకములఁ
బులక లెగయఁ గేలు • దల మోడ్చి ధర్మజు
నాననమున దృష్టి యదర నిలిపె.

ఉ. అత్తఱి లేచి వచ్చి తన • యన్నలఁ దమ్ములఁ గానిపించె న
య్యుత్తరు నర్జునుండు దగ • నొందఁగ నప్పుడ పిల్వఁ బంచె మా
త్స్యోత్తముఁ డార్యమిత్రసచి • వోత్కరసోదరవర్గపుత్రకో
దాత్తభటాదియోగ్యుల ము • దంబునఁ బాండదర్శనార్థమై. 342

వ. ఇట్లు సమస్తజనసమేతంబుగాధర్మతనయ సేవాతత్పరుండై తదనుమతి సముచితరుచిరాసనంబున నుండి విరాటుం డంతఃపురవర్తులం బిలిచి యంతయు సుదేష్ణకెఱింగింపం బనిచి పాంచాలిం దగిన తెఱంగున

గారవించునట్లుగా గావఁ చె నట్టియెడ ధనంజయుం డి ట్లనియె. 343

తే. చాల దు స్తరమైన య • జ్ఞాతవాస
వత్సరంబు భవద్గర్వ • వాసగు ప్తి
వలనఁ గడపితి మతి సుఖా • వా ప్తచి త్త
వృ త్తి నేము నిర్భయులమై • యిందులట్ల. 344

వ. అనిన విని విరాటుం డతని కి ట్లనియె. 345

ఉ. ఏ నన వేఱ యొక్కఁడనె • యి ట్లనఁగాఁ దగునయ్య యిమ్మెయిం
గావన దేశవాసములఁ • గాఱియ కోర్చి యడంగి యుండి మీ
పూనిక దీర్చి మీ రెలమఁ • బొందుట యెల్లను బుణ్యదేవతా
నూనదయాసమృద్ధి నను • నొందుట గాదె సురేంద్రనందనా. 346

వ. అని పలికి ధర్మనందనుం జూచి.

చ ధరణియుఁ బట్టణంబు హయ • దంతి రథంబులు గోవులుఁ భటో
త్కరము నమాత్యవర్గమును • గాఁ గలరాజ్య మితండ యేలు ని
ర్భరమున నేనుఁ బుత్రులును • బంధులుఁ దమ్ములుఁ గొల్చియుండెదం
గరిపురి కేత్తునట్టిపని • గల్గిన నోపినయంత సేసెదన్.

చ. అన విని యు త్తరుండు దగ • వజ్జనపాలకుతోడ ని ట్లను
న్మన కొక రాజ్యముం గలదె • నన్నును నిన్నును నిన్న మొన్న వీ
రనితరసాధ్యశత్రువిజ • యంబునఁ గాచినయప్డు గల్గఁ జే
సినయది దక్కఁ దావి మఱి • సెప్పఁగ నేటికి నింతవింతగన్. 349

వ. అది సిద్ధం బట్ల చెల్లెం గాక యించుక విశేషంబు గలదు వినుము,

చ. సవినయవృ త్తిఁ గొల్వమిట • చన్నదినంబుల వీరు నీఱు పైఁ
గవిన నిప్పులట్ల యధి • కం బగు తేజము దోఁప కున్కి న

ద్వివిధము సాపరాధతను • డెందము లూఱటఁ బొందియుండ నే
రవు మన కట్లుగాన తగఁ • బ్రార్థన సేయుట యుక్త మిత్తఱిన్.

వ అదియునుం గాక. 352

క ధన వర్గంబులు పీరి
చ్చినయవి యట్లగుట వేడ్క • సేయవు తగ నూ
తన మగుకానిక యీవల
యును వే తోడ్తెరఁ బనుపు • ముత్తరఁ బ్రీతిన్.

వ. అనిన విని మత్స్యమహీవల్లభుండు మనం బలర మంత్రుల మొగంబు సూచి కుమారిక నలంకరించుకొని తెం డని నియోగించిన వారును బ్రియంబునం జని తత్కార్యశ్రవణసంప్రీత యగు సుధేష్ణయనుమతంబున.

క. పదనికి దాఁ బులు గడిగిన
మదనాస్త్రములేఖ గలిగి • మానినిమెయి చె
న్నొందవఁ గయిసేసి రప్పుడు
ముదితాజనములు ప్రమోద • మున లలితముగన్. 355

—• విరాటునిమంత్రు లుత్తరను పాండవులయొద్దకుఁ దోడ్తెచ్చుట •—

వ. ఇట్లు శృంగారంబు సేసినయమ్ముద్దియకు ముక్తాఫలప్రాలంబమాలికల తోడి గొడుగులు వట్టించి యత్యాదరంబున నయ్యమాత్యులు దోడ్తెర [1]ధారాధరనికరమనోహర యగు పర్జన్యలక్ష్మియుం బోలె వచ్చుచున్నం గని విరాటుం డెదురువోయి పురోహితులును బంధుజనంబులుం దానునుం బొదివి వెంగొని పాండవాగ్రజునగ్రభాగంబునకుం దెచ్చి యచ్చెలువ నిలిపి సపరివారంబుగా దండప్రణామంబు సేసి చేతులు మొగిచి యి ట్లనియె.

1 అ. ధారానికర.

తని కౌశయెగ్గు సేఁత యుచి • తంబె యెఱింగెడునట్లు గాఁగఁ బో
యినఁ గనియెఁ దురుద్ధతి వ • హించినఁ జాతము గాక విస్మటన్.

వ. అని పలికి వారల[1]కందు మాన్పి యిది యట్ల కాక యొండు దగువె
యనుచుఁ దక్కినవారిదెసయుం గనుంగొనిన నెల్లవారు నుపశమించిరి
తదనంతరంబ తమ్ము నెఱింగించు తెఱంగు దలపోసి వా రందఱు
విరాటుకొలువుకూటంబునకుం బోయి బయలు మెఱసి యుండువారుగా
నిశ్చయించి యారాత్రి గడపి వేగుటయుం గృతస్నాను లయి పాండు
సూనులు సమయవిహితాచారంబులు నడపి యుచితప్రకారంబున. 314

క. తెలుపు లగుచీరలను బూఁ
తలఁ బువ్వుల నొప్పి రాజ • తనయానుగుణో
జ్జ్వలమాననీయవేషము
లలవడఁ గూడుకొని నగరి • కరిగిరి ప్రీతిన్. 315

క. చని ధర్మసుతుఁడు సింహా
సనమున భీమాదు లాత్మ • సముచితరుచిరా
సనముల సభాస్థలిం గయి
కొని పంచాగ్నులనుబోలెఁ • గూర్చున్నంతన్. 316

తే. వేడ్కఁదొడిపూసికట్టి య • వ్విరటుఁ డుత్త
రుండు దోఁజనుదేరఁగొ • ల్వుండుబుద్ధి
నచటి కేతెంచి కని విస్మ • యంబు నొంది
యెల్లిదంబుగఁ దలఁచుచు • నిట్టు లనియె. 317

క. ఇదియేమి కంక నీ వు
న్మదవృత్తివు కంక దక్కి • నాగద్దియపైఁ

1. కుందు.

బదిలంబుగఁ గూర్చుండితి
వదియును గా కిపుడు డిగ వ • హంకారమునన్. 318

వ. అనిన విని మందహాసంబు సేసి సంక్రందననందనుం డతని కిట్లనియె.

సీ. నడవిదీవియలు సేసె • నగరికి మాణిక్య
మకుటముల్ పూనిన • మనుజపతులఁ
దగునాజ్ఞసూయాణ • ముగ నొనరించె మం
చిగ నేలనాలుగు • చెఱఁగులకును
బీత్రార్థిజనుల స • చేతనత్యాగధ్వ
జములుగా నన్నిదే • శ ములఁ బఱపె
దిక్కులన్నింటను • దెలుపారుపూఁత గా
వించె నుజ్జ్వలయశో • విభ్రమంబు

తే. రాజసూయాధ్వరప్రవ • ర్తకుఁడు నిత్య
సత్యభాషామహావ్రత • శాలి పాండు
రాజదుగ్ధపయోనిధి • రాజు ధర్మ
రాజు సుమ్ము మత్స్యావనీ • రమణ యితఁడు.

ఉ. ఈతఁ డజాత శత్రుఁడు మ • హిందగ దిగ్విజయంబు సేసె వి
ద్యాతిశయార్థి వాసవు మ • హాసవ మైనను నెక్కు వర్చుఁ డు
ద్ద్యోతితమూర్తి కౌరవకు • లోద్వహుఁ డార్యనికాయసంతత
ఖ్యాతచరిత్రు డీచిఱుత • గద్దియకుం దగఁడే నరేశ్వరా. 321

—• అర్జునుఁడు విరాటునకుఁ దమ్మెఱిఁగించుట •—

వ. అనిన విని యతండు విస్మయసంశయంబులు మనంబున బెనంగొన నితండు ధర్మతనయుండయేని భీమార్జుననకులసహదేవులుం బాంచా

లియు [1]వేరి యని యడిగినఁ గవ్వడి యి ట్లనియె. 322

చ. వఁలుఁ దనంగ నీ నగర • వంటలవాఁ డయి నిల్చి వేక్క_కుం
బులిఁ గరిఁ గేసరిం దొడరి • పోరఁగఁ బంచినఁ బోరు జెట్టిమ
ల్లుల విఱుచుం గడంగి ప్రబ • లుం డనఁగాఁ జరియించు చుండు వి
చ్చలవిడి భీముఁ డీతఁ డవి • షహ్యపరాక్రమదుర్దముం డనిన్. 323

తే. బకమహాసురు నిర్జించి • బ్రాహ్మణులకుఁ
బ్రీతిఁ గావించెఁ గిమ్మీరు • పే రడంచి
వనము నిష్కంటకము సేసె • ఘను హిడింబుఁ
గూల్చి యాతనిచెలియలిఁ • గొనియె నితఁడు. 324

క. నీమెచ్చు వారువంబులఁ
దా[2]మచ్చగ నరయు నిత్య • తాత్పర్యమునన్
దామగ్రంథి యనఁగ నొక
నామము ధరియించె నితఁడు • నకులుం డధిపా. 325

క. శత్రునృపకాలకూటము
మిత్రామృతవృష్టి బుధప • మీహిత[3]సిద్ధి
క్షేత్రము సజ్జనసంస్తుతి
పాత్ర మితఁడు మాద్రితొలుత • పట్టి నరేంద్రా, 326

క. నీపాఁటికి వచ్చి నిఖిల
గోపాలకముఖ్యవృత్తిఁ గొలు వడసి తం
త్రీపాలుఁ డనఁగ మత్స్య
క్ష్మాపాలక మెలఁగు వీఁడె • సహదేవుండున్. 327

---

1 గ. నేరి, 2 జ. మెచ్చగ, 3 క. సిద్ధ, గ. బుద్ధి.

క సుకుమారమానసుఁడు గొం
తికిఁ బ్రాణము ప్రాణ మిత్రఁడు • తేజోగణ్యుం
డకుటిలుఁడు రాజనీతి
ప్రకారసంవేది వంశ • పావనుఁడు నృపా. 328

వ. అని యిట్లు ధర్మజభీమనకులసహదేవులం గ్రమంబునం జూపి చెప్పి
మఱియు ని ట్లనియె. 329

క. విను సైరంధ్రీవేషం
బున మాలిని యనఁగ బరఁగి • పూతచరిత్రం
బునఁ గేకయభూవరనం
దనకడ మెలఁగునతి ద్రుపద • తనయ మహీశా.

క. ఆచపలాక్షికిఁగా మన
కీచకు లందఱును రాత్రి • గీటడఁచె రహ
స్యోచిత విధమున గంధ
ర్వాచరణము పేర భీముఁ • డతిభీమముగాఁ. 331

—• విరాటునకు భీముఁ డర్జును నెఱింగించుట •—

వ. అనియె నప్పుడు వృకోదరుండు. 332

సీ. షండరూపమునఁ బ్ర • చ్ఛన్నుఁడై వచ్చి క
న్నియలకు నెల్లను • నృత్తగీత
వాద్యనైపుణ మన • వద్యశిక్షావిధి
నలవరించుచు బృహ • న్నల యనంగ
బరఁగునీతండు బీ • భత్సుండు సు మ్మని
చూపి యమ్మత్స్యధరా • జునకుఁ జెప్పి

వెండియుఁ బలుకు నా • ఖండలు నోడించి
ఖాండవ మేర్చె నా • తండు దన్ను

తే. గారవించిన నెక్కటి • కాలకేయ
వర్గములఁ బరిమార్చె ని • వాతకవచ
సంఘములనోర్చె గంధర్వ • సమితిగెలిచి
ధార్తరాష్ట్రాగ్రజుని చెఱఁ • దలఁగె నితఁడు.

వ. అనిన విని యద్భుతరసాక్రాంతం బగునంతరంగంబునం గలుగుసందే
హావేశంబువినయసంభ్రమంబుల నిగుడ నీ కునికిం జేసి చిక్కువడి
యున్ననిజజనకునకు నర్జునుం జూపి యుత్తరుం డి ట్లనియె. 334

తే. ఈతఁ డింతకు మీకుఁ ద • న్నెఱుఁగఁ జెప్ప
వలవ దని నియమించినఁ • దెలియఁ బలుక
నలికి యొక దేవసన్నిభుం • డంటిఁ గాని
నిన్న యంతయుఁ దాఁ గదా • నిర్వహించె. 335

చ. ఒకరుఁడ తాను భీతి వెగ • [1]డొందెదురెండవనన్ను నెట్టకే
లకుఁ దగఁ దేర్చునప్పుడు బ • లంబులతోఁ గుపరాజు సూడ దా
నికి మది శంకలేమి మహ • నీయపరాక్రమున్ దైనయాకిరీ
టికిఁ జనుఁగాక యిన్విధము • దెప్పర మన్యుల కోర్వ వచ్చునే.

చ తము నెఱిఁగించి యల్ల నుచి • తప్రియభాషల నన్ను సూతకృ
త్యమునకుఁ జొన్ప నేను భ్రమ • దంబున [2]నప్పటి కియ్యకొంటిలో
కము సమరంబునట్ల యని • కయ్యముతీవ్రతకుం దగంగ ర
థ్యములఁ జరింపఁజేత భర • మై తుదిఁ బల్కుఱు నోహటించితిన్.

1 గ. డొందఁగ రెండవయేను, జ. డొందెదు రెండవునేను-నెట్టకేలకు
నన్నుఁ దేర్చు, 2 జ. నప్పని

క మొగ మోడఁ డితఁడు కౌరవ
జగతీశుఁడు విజిగినపుడు • జవమున వెనుకం
దగిలి యిచె జూద మాడఁగ
నగునెడగా దఱుమ వలయు • నతనితోన్.

ఆ అనిన నితఁడు వెఱపు • నత్యాదరంబును
సంతసంబు మాన • సమున బెరయ
నవయవముల సంభ్ర • మావేశ మేర్పడ
గారవమున విజయుఁ • గౌఁగిలించె. 339

క. వినయంబు మిగులఁ గుంతీ
తనయాగ్రజు పాదపీఠ • తలమున ఫాలం
బును బొందఁ జాఁగి మ్రొక్కియు
తని కౌఁగిలి వడసె సమ్మ • దము చెలకొత్తన్. 340

ఆ. ప్రీతి నలుమడింప • భీమునిఁ గవల నా
లింగనంబు సేసి • యంగకములఁ
బులక లెఁయఁ గేలు • దల మోడ్చి ధర్మజు
నాననమున దృష్టి యడర నిలిపె.

ఉ అత్తఱి లేచి వచ్చి తన • యన్నలఁ దమ్ములఁ గానిపించె న
య్యుత్తరు నర్జునుండు దగ • నౌఁదఁగ నప్పుడ పిల్వఁ బంచె మా
త్స్యోత్తముఁ డార్యమిత్రసచి • వోత్కరసోదగవర్గపుత్రకో
దాత్తభటాదియోగ్యుల ము • దంబునఁ బాండదర్శనార్థమై. 342

వ. ఇట్లు సమస్తజనసమేతంబుగాధర్మతనయ సేవాతత్పరుండై తదనుమతి
సముచితరుచిరాసనంబున నుండి విరాటుం డంతఃపురవర్తులం బిలిచి
యంతయు సుధేష్ణ కెఱింగింపం బనిచి పాంచాలిం దగిన తెఱంగున

గారవించునట్లుగా గావఁ చె నట్టియెడ ధనంజయుం డి ట్లనియె. 343

తే. చాల దుస్తరమైన య • జ్ఞాతవాస
వత్సరంబు భవద్గర్భ • వాసగుప్తి
వలనఁ గడపితి మతి సుఖా • వాప్తచిత్త
వృత్తి నేము నిర్భయులమై • విందులట్ల. 344

వ. అనిన విని విరాటుం డతని కి ట్లనియె. 345

ఉ. ఏ నన వేఱ యొక్కఁ డనె • యి ట్లనఁగాఁ దగునయ్య యిమ్మెయిం
గానన దేశవాసములఁ • గాఱియ కోర్చి యడంగి యుండి మీ
పూనిక దీర్చి మీ రెలమిఁ • బొందుట యెల్లను బుణ్యదేవతా
నూనదయాసమృద్ధి నను • నొందుట గాదె సురేంద్రనందనా. 346

వ. అని పలికి ధర్మనందనుం జూచి.

చ ధరణియుఁ బట్టణంబు హయ • దంతి రథంబులు గోవులుం భటో
త్కరము నమాత్యవర్గమును • గాఁ గలరాజ్య మితండ యేలు ని
ర్భరమున నేనుఁ బుత్రులును • బంధులుఁ దమ్ములుఁ గొల్చియుండెదం
గరిపురి కెత్తునట్టిపని • గల్గిన నోపినయంత సేసెదం.

చ. అన విని యుత్తరుండు దగ • నజ్జనపాలకుతోడ ని ట్లను
న్మన కొక రాజ్యముం గలదె • నన్నును నిన్నును నిన్న మొన్న పీ
రనితరసాధ్యశత్రువిజ • యంబునఁ గాచినయప్డు గల్గఁ జే
సినయది దక్కఁ దాని మఱి • చెప్పఁగ నేటికి నింతవింతగం. 349

వ. అది సిద్ధం బట్ల చెల్లం గాక యెంచుక విశేషంబు గలదు వినుము,

చ. సవినయువృత్తిఁ గొల్వమిట • చన్నదినంబుల వీరు నీఱు పైఁ
గవిన నిప్పులట్ల యుధి • కం బగు తేజము దోఁప కున్కి న

ట్ఠివిధము సావలాధతను • డెందము లూఱటఁ బొంది యుండ నే
రవు మన కట్టుగాన తగఁ • బ్రార్థన సేయుట యుక్తమిత్తఱిన్.

వ అదియునుం గాక. 352

క ధన వర్గంబులు పీ రి
చ్చినయవి యట్లగుట వేడ్క • సేయవు తగ నూ
తన మగుకానిక యీవల
యును వే తో డ్తెరఁ బనుపు • ముత్తరఁ బ్రీతిన్.

వ. అనిన విని మత్స్యమహీవల్లభుండు మనం బలర మంత్రుల మొగంబు
సూచి కుమారిక నలంకరించుకొని తెం డని నియోగించిన వారును బ్రి
యంబునం జని తత్కార్యశ్రవణసంప్రీత యగు సుదేష్ణయనుమతంబున.

క. పదనికి దాఁ బులు గడిగిన
మదనాస్త్రములేఖ గలిగి • మానినిమెయి చె
న్నొందవఁ గయిసేసి రప్పుడు
ముదితాజనములు ప్రమోద • మున లలితముగన్. 355

—• విరాటునిమంత్రులు ఉత్తరను బాండవులయొద్దకుఁ దోడ్తెచ్చుట •—

వ. ఇట్లు శృంగారంబు సేసినయమ్ముద్దియకు ముక్తాఫలప్రాలంబమాలికల
తోడి గొడుగులు వట్టించి యత్యాదరంబున నయ్యమాత్యులు దోడ్తెర [1]ధారా
ధరనికరమనోహర యగు పర్జన్యలక్ష్మియుంబోలె వచ్చుచున్నం గని
విరాటుండెదురువోయి పురోహితులును బంధుజనంబులుం దానునుం
బొదివిగొని పాండవాగ్రజునగ్రభాగంబునకుం దెచ్చి యచ్చోట నిలిపి
సపరివారంబుగా దండప్రణామంబు సేసి చేతులు మొగిడ్చి యి ట్లనియె.

1 అ. ధారానికర.

చ్చో నొకయింతసేపు నెడ • సొచ్చుట కోర్వక యుండ నున్నయ
మ్మానినియుం గుమారుఁడును • మారవికారము లంకురింపఁగన్. 393

వ. అన్యోన్యావలోకనంబు సేయునప్పుడు.

సీ. వరుచూడ్కి ముద్దియ • వదనంబుపైఁ బాఱి
తివుట మై నునుఁగాంతి • తీపు గ్రోలు
సుందరీరత్నంబు • చూపు మనోరము
నడుగులయొప్పుపై • సల్లనడరుఁ
బతివిలోకనములు • పడఁతుక మైఁదీవఁ
గాలయంగఁ బలుమఱు • మెలఁగుచుండు
వెలఁదికటాక్షముల్ • విభునిపై గ్రమమున
నెగసి మోమునఁ జోఁకి • మగిడివచ్చు

తే. నొండొరువులలేఁజెమటల • నూని వ్రేఁగు
పడినచాడ్పున నవయవ • భంగులందుఁ
దగిలి మఱుపునఁ దడయని • ద్రువిశాల
నయనదీప్తు లునేఱుకువ • బయలుపడఁగ. 395

వ. తదనంతరంబ. 396

తే. ఒండొరులదోయిటల నిను • పొంపఁ జేయు
నక్షత్రప్రకరంబు ల • న్యోన్యమ త్త
కములఁబోసిది మందార • కల్పలతలు
విపులగమియనొండొకటిపైఁ • గురియునట్లు.

1 క గ, వ్రేక. 2 ఙ. మఱువునన్.

చ. లలితతనూవిలాసముల • లజ్జకతంబునఁ జేసి మున్ను వి
చ్చలవిడిఁ బట్టఁగా వెరవు • సాలక యోరలు వాఱుచూపులం
ఒలిఁ దలఁబ్రాలు వోయునెడ • లం దగవొందిన నాలుకొల్పి యి
మ్ములఁ [1]బచరింతు రొండొరుల • మోహనమూర్తులపై వధూవరుల్.

తే. చిత్తమున గాఢరాగంబు • చేతకి జూపు
తెఱఁగు దోఁప గెంపారెడు • తీఁగబోఁడి
మృదులపాణిఁ గుమారుండు • మెలపుమైఁ గ్ర
హించెఁ బల్లవాలంబిమ • త్తేభలీల.

వ. ఇట్లు పాణిగ్రహణం బాచరించి. 400

క. పెనుఁగుదుట నిడినచూతం
బును నవమాలికయుఁబోలెఁ • బొలు పొంది రతం
డును నమ్ముగ్ధయు నేకా
సనమున నున్నపుడు నూత్న • సౌభాగ్యమునన్. 401

సీ. కోర్కులు గెడఁగూడు కొని పార [2]మెయ్దిన
చిత్తంబు లూఱటఁ • జిగురులొత్తఁ
బులకాంకురములకుఁ • [3]దలతాకుదై యిరు
మేనను సర్వంబు • మిగిలి పొదలఁ
దఱి వేచి చనఁబోయి • తడఁబడి [4]మార్గతి
వడిచూపు లాడట • [5]బయలుపఱువఁ
జెమటలతావులు • తమలోనఁ గలసి వే
ఱొక్కసౌరభము నై • చొక్కుసేయ

1 క. బరఁగింతు, 2. మెయ్దంగఁ జిత్తంబు 3 దలతాకులై ... మేనున,
4 గ మార్పడి, ఖ. మార్గడి. 5 గ బయ్యలుపడఁగ,

తే. గాఢసంస్పర్శభంగులు • గలుగునట్టి
హోమసమయకృత్యంబుల • నొదవి సౌఖ్య
రసమ్ము[1] పెన్నిట్టవోరిఁ బొరి • గ్రమ్ముదేర
సమ్మదాంబుధిఁ దేలిరి • సతియుఁ బతియు.

వ. ఇవ్విధంబున వివాహంబు నిర్వహించి మత్స్యమహీనాథుండు మణిభూషణంబులు రుచిరాంబరంబులుఁ కర్పూరాదిసుగంధద్రవ్యంబులుఁ తాంబూలంబులతోడిపళ్లెరంబులఁ బచరించి పాండవులకు వాసుదేవపూర్వకంబుగాఁ బురోహితప్రకరంబు నకుం గట్ట నిచ్చి యాజ్ఞసేనీసుభద్రలకు ననురూపాభరణపరిధానంబు లంతఃపురవరు లైనయర్హ జనంబులచేతం బుచ్చి సౌభద్రునకు భద్రసామజసప్తశతియును లోకోత్తరతురంగదశసహస్రంబును సలక్షణగోపంచలక్షయు రథంబులు రెండువేలును దాసదాసీజనంబు లక్షయు మఱియు నానాప్రకారంబు లగుధనంబులు వరణం బిచ్చె నమ్మహనీయ మహోత్సవంబు మంగళసంవిధానసావధానపుణ్యాంగనలవలనను నృత్తగీతాదివైచిత్ర్యమనోహరవారనారీజనంబులవలనను వినూత్నరత్నమయభూషణాది[2]దీప్తవేషవిరాజమానులగుకుమారులచతురపరిహాసాదివిలాసంబులవలనను ప్రభూతవిభవవిభ్రాజితు లగురాజసూనులమాననీయగరిమదళితవిహారవిశేషంబులవలనను బాంచాలయాదవకేకయాది బాంధవసహితమహిమాంచితసంచరణంబులవలనను నానందనిష్యందిపాండునందనసౌహార్దంబువలనను మత్స్య[3]మనుజపతిమందిరంబు పరమసంపత్పూరితం బై యుండె ననిచెప్పిన విని వైశంపాయనునితో జనమేజయుండు. 403

క. కుంతీనందను లట్లు
త్యంతవిభవ మెసఁగఁ బరిణ • యము సేసి సుహృ

1 పెన్నింట 2 గ. దీప్తవిశేషవిధా, 3 ఖ. నగరంబు.

త్పుంశోషోజ్జ్వలులై తన
నంతర మెబ్బంగి నడచి • రవపుడుఁ బ్రీతిన్. 404

చ. అమృతమయాత్మ భక్తి[1]సుగ • మానుభవోజ్జ్వలదివ్యవర్త్మ ష
ట్పమయగతానుభావ పురుష • త్రయతా[2]వివృతస్వభావ వి
ర్మమహృదయైకవాస ముని • రంజననిత్యవిలాసదోషసం
గమవినివర్తనా పరమ • గౌరవధుర్యపదప్రవర్తనా. 404

క. దుర్వహపటుతాపత్రయ
నిర్వాపణకరణబోధ • నిర్మలజనహృ
త్పర్వాచరణ మహాసుర
[3]గర్వాపహరత్వసంప్ర • కాశైకరణా. 406

మాలిని. నిగమకుసుమగంధో • న్మేషభూతాభిధానా
సగుణవిగుణలీలా • [4]సౌమ్యసాక్షిత్వనానా
జగదవన[5]విధానా • స్థైర్యదత్తావధానా
నగ[6]శరధినివాసా • నంద[7]సంస్తూయమానా. 407

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధన విరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వమునందు సర్వంబును బంచమాశ్వాసము. 408

శ్రీమదాంధ్రమహాభారతమునందలి విరాటపర్వము సమాప్తము.

---

1 క. నిగమా, 2 గ. వృతనిస్వభావ, 3 చ. గర్వాపహతత్త్వసంప్ర • కాశనమూర్తీ. జ. గర్వహరణతత్త్వసంప్ర • కాశన కరుణా, 4 క. స్వామ్య, గ. సౌమ్య, 5 అ. పిధాన, 6 గ జ ధరణినివా, 7 గ సంధార్యఘూణా.

శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

# టిప్పణి

## విరాటపర్వము - తృతీయాశ్వాసము

1. శ్రీత్వశివాత్వాలంబన . . . హరిహరనాథా! అను ఆద్యపాది పద్యమునఁ గవిబ్రహ్మయు ఉభయకవిమిత్రుఁడు నగు శ్రీతిక్కయజ్వ సమస్తదోషనివారకంబును శుభదాయకంబు నగు శ్రీకారంబును దొలుతఁ బ్రయోగించి పాఠకలోకమునకు శుభపరంపర నాకాంక్షించుచుఁ గృతిపతి యగు శ్రీహరిహరనాథుని సంబోధించుచున్నాఁడు.

శ్రీత్వ = శ్రీశబ్దప్రవృత్తినిమిత్త లక్షణీయత్వరూప శ్రీదేవీ ధర్మము, శివాత్వ = మంగళప్రదత్వరూప శివాశబ్ద ప్రవృత్తినిమిత్త పార్వతీధర్మము ఇవియే ఆలంబన = పట్టుగాఁ గల, తత్త్వ = స్త్రీ వ్యక్తులయొక్క, శ్రీ యన గౌరి నాఁబరఁగు చెలువలయొక్క యనిభావము. ఆశ్లేష = కౌఁగిలింతలచే, ఆత్త = పొందఁబడిన, శబలతా = చిత్రవర్ణముతో, సంగత = కూడినవాఁడా! కర్తృత్వ = (పాలన) కర్తృత్వము, అదిక = సంహారకర్తృత్వము మొదలగు, లీలా = విలాసములచే, ఆత్త = పొందఁబడిన, మహత్త్వ = మహిమయు, అహంకారభావ = అహంకారత్వమును గలవాఁడా!

హరిహరనాథా = హరిహరస్వరూపుఁడవగు ఓదేవా! అని యీ సంబోధనముల కర్థము.

ఈ పద్యములోని నాల్గవపాదమునఁ బ్రాసలోఁ బడినమహాత్వా. . అనుచోటఁ గలతకారము ద్విత్వకారము గమక ప్రాయశస్సర్వేషు చైః ఏత

స్యాత్ అను నియమానుసారము తక్కినమూఁడు ప్రాసలను గూడ వస్తుతః అవి ఏకతకారములే యైనను ఛందోనియమభంగపరిహారార్థము అనచి చ అను మాత్రముచేత 'త' కారమునకు వైకల్పికముగా ద్విత్వము చేసికొని ప్రాసవ్యత్యాసమును సవరించుకొనవలెను.

2. మహానస = వంటయిల్లు (వ్యు) మహత్ × అనస్ — శకటమువలె మహోపకారక మైనది. మహచ్ఛబ్దమునకు ఆ కారము, అనస్ శబ్దమునకు టచ్ (అ) వ్యాకరణ కార్యములు వచ్చినవి.
యాజ్ఞసేని = ద్రౌపది (వ్యు) యజ్ఞసేనుని (ద్రుపదుని) కూఁతురు.

3. చేకడి = చిక్కి,

4. కోలదివియలు = వెలుతురు కట్టెల దివిటీలు. ఉల్కాః అని మూలము.

7. విసుమానపుఁ బీసాఁగులు = ఆశ్చర్యకరమైన శవములు.
తక్కినమనంబు = మూర్ఖునిచిత్తము.

11. పలవి = ప్రలపించి

16. అంగజ, రాగ, మత్తుఁడు = మన్మథ ప్రేమచేత మదించినవాఁడు.

17. ఇందు ద్రౌపదికి సేసిన-నిత్యశుచి, పుణ్యశీల, ఉదాత్త, అను విశేషణములు సాభిప్రాయము లగుటచే పరికరాలంకారము - లక్షణము.

అలంకారః పరికరః సాభిప్రాయే విశేషణే-చంద్రాలోకము. కరదీప, నికాయము = (3) కాగడాల సమూహము

16 కుజటి = కులట (కొరంకుటాలు) హాస్యకాంక్షు మహతి యుక్త్యతే కీచకో హతః అని సంస్కృతభారతము. మూలములో అపతీ అని ఉండుటచే కులట యనుయర్థము వ్రాయఁబడినది. ఉపకీచకుల దృష్టిలో సైరంధ్రి యట్లే గోచరింపవచ్చు.

18. పితృవనము = వల్లకాడు. అతిరావము = పెద్దధ్వని,

19. అనదన్ = దిక్కులేనివానను, ఆలికయ్యె = భార్యమైతి,

20. ఈ పద్యమునందలి ఓజయ ! ఓజయంత ! ఓవిజయాభిధాన ! ఓజయత్సేన ! ఓజయద్బలా ! అను సంబోధనములు వరుసగా ధర్మజ, భీమా, ర్జున, నకుల సహదేవులకు గుప్తనామములు, వానికిఁజేర్చిన విశేషణములు ఈవిషయమును స్ఫురింపఁ జేయుచున్నవి. జయో జయంతో విజయో జయత్సేనో జయద్బలః అని మూలము। అనతవైరి = శత్రువులచే నమస్కరింపఁ బడినవాఁడా ! దుర్మాన, విఘూర్ణమానరిపు మర్దన = దుర్మానాకారముచేఁ గన్నులు తిరుగు శత్రువులను మర్దించువాఁడా ! విరోధి, బాహు, బల, జృంభణ, భంజన ! = శత్రువుల భుజబలము, యొక్క యతిశయమును భంగము చేయువాఁడా,

21. తొడఁగినపని = ప్రారంభించిన కార్యము, (పాఠాంతరము) తొడరినపని = ప్రాప్తించినపని, వైవస్వతుని = యమధర్మరాజును, కడిమిమైన్ = పౌరుషముతో, వ్రేళ్మిడిన్ = చిటికలతో తమకించి = త్వరపడి,

22. పవమాన, తనూజుఁడు = వాయుపుత్త్రుఁడు (భీముఁడు) ఆయితము, ఐ = తయారై వంటలవానివేషము మార్చి గంధర్వుల వేషమును ధరించి సిద్ధమై

వప్రలంఘనము = ప్రాకారము దాఁటుటను, గుప్తముగన్ = చాటుగా,

23. శకేరభూమి = స్మశానభూమి, ఉన్నత, అవనీజంబు = పొడవైనచెట్టు, భుజశిఖరంబునయందు = మూపుమీఁద,

24. వికట = వంకర యైన, భ్రూకుటి = కనుబొమ ముడిచేత, ఘోర = భయంకర మైన, ఫాలభాగ = నొసట, కలిత = కూడిన, స్వేద = చెమటచే, ఉద్భటుండున్ = అధికుఁడును, చిట్లించిన కనుబొమముడిచే భీకర మగునొసట చెమటబొట్లతో

నిండినవాఁ డని భావము. చలత్, వికృత, ఓష్ఠద్వయుఁడున్ = కదలుచున్నట్టియు, మార్పుచెందిన పెదవులజంట గలవాఁడును, వికృత × ఓష్ఠ = వికృతోష్ఠ-పరరూపసంధి సమాసమున అకారమునకు ఓతు, ఓష్ఠ, శబ్దములు పర మగునపుడు వికల్పముగా పరరూప సంధి వచ్చును.

ప్రమర్దన, దశా, అవిర్భావ, సంభావిత, అంగకుఁడున్ = సంహారావస్థావిర్భావమునకు ఊహింపఁబడిన దేహము గలవాఁడును, చిత్త, విదాహ, దోహల, సమగ్ర, క్రోధ, వేగుండున్ = మనస్సును మిగుల దహింపఁజేయు ఉత్సాహము గలనిండుకోపావేశము కలవాఁడును, ఒక విధ్వంసకుఁడు = భీముఁడు,

శుంభత్ × మూర్తి, విస్ఫూర్తితోన్ = ప్రకాశమాన మగు శరీరము యొక్క విజృంభణముతో,

ఈపద్యము సమాసబహుళము అత్యుత్కటపదభూయిష్ఠము నై ఓజఃకాంతిమతి గౌడీయా అను వామనాచార్యునూక్తికి లక్ష్యమై తాత్కాలికభీమ భీకరాకారమును పాఠకుల కనులయందు గోచరింపఁజేయుచు నిఘట్టమున కలంకారభూతమై కవి వృషభుల మహాకావ్య మనియు అన్న శ్రీ నన్నయభట్టారకుని భారత ప్రశంసను స్మృతికిఁ దెచ్చుచున్నది.

27. బెగడు = భయము,

31. పొరువునన్ = (ప్రక్క-రూపాంతరము)

34. కుంతీనందన = పాండవులయొక్క, కాంతా = ప్రియురాలగు ద్రౌపదియొక్క, చింతా = దుఃఖము నెడు, మహాత్, అంధకారముతో, = పెనుఁజీఁకటితో, సంతమసంబు కటిక చీఁకటి,

44. వచ్చితి × అమ్మ = వచ్చితమ్మ. సూ॥ మధ్యమపురుషక్రియలకు సంధి నిత్యము.

జనునిన్ = యమధర్మరాజును,

ఐశ్వర్యము సమృద్ధిగా వర్ణించుటచే ఉదాత్తాలంకారము. ఈ సందర్భమున మూలములో నింత హెచ్చుగాఁ గనిపింపదు.

97. క్షాత్రసమగ్రులు = శౌర్యముతో నిండినవారు.

ఆర్య, సత్, గౌరవ, దీప్తులు = పెద్దలచేఁ బొగడఁబడిన గౌరవము తేజము గలవారు లేదా గౌరవముచేఁ బ్రకాశించువారు. వర్ణనీయ, సౌభ్రాత్రులు = వర్ణింపఁ దగిన మంచి సోదరభావము గలవారు.

ఉదాత్త, దైవ, బల, భవ్యులు = గొప్ప దైవబలముచే క్షేమము గలవారు, పృథాపుత్రులు = కుంతిసుతులు (పాండవులు) ఇందలి విశేషణములు పాండవుల నాపదలు పొందిన వనుటను రూఢిచేయుచున్నవి.

ఇందు ప్రాసస్థానములోని క్షాత్త్ర, పుత్త్ర, శబ్దములు ద్విత్తకార ములు గాన సౌభ్రాత్ర, ధాత్రీ శబ్దములనుగూడ వైకల్పిక ద్విత్వముచే ద్విత్తకారములఁ గావించుకొని ప్రాసదోషమును వారించుకొనవలెను. ఈయూ వ్యాసములోని మొదటి పద్యమును జూడుఁడు.

102 భవ్యవిభూతియు = మేలగు సంపద లేదా మంచి ఐశ్వర్యము అప్రతిహతమును = లోటుపాటులేని అంతరింద్రియ నిగ్రహము అక్షీణ పుణ్యాదోహాలుఁడు = తఱుగని పుణ్యకార్యములందు ఆదరము గలవాఁడు,

116 అంధతమస, గూఢవృత్తిన్ = కటికచీకటియందు రహస్య వర్తనముతో (అంధ × తమము = (అంధతమసము)

118. భండనము = యుద్ధము,

119. సప్తాంగము = రాజ్యము (స్వామి అమాత్య, సుహృత్, కోశ, రాష్ట్ర, దుర్గ, బలములు.

125 వెన్నడి = వెంటాడి (వెన్నాడి–రూపాంతరము)

130. జోడు=కవచము, పక్కెర = గుఱ్ఱములోనగు వానియంగి
కైదువు=ఆయుధము, బిరుదురవణంబు = సామర్థ్య చిహ్న
మగు భూషణంబు, సవరణంబులన్ = వాహనాద్యలంకార
ములను, అక్కజంబుగాన్=ఆశ్చర్యముగా, ఆపోశనంబు
(ఆపః×అశనంబు) భోజన ప్రారంభమున మంత్ర పూర్వక
ముగాఁజేయు జలపానము. పరిషేచనము.

145. లోకస్తుత్య=వీరలోకముచే స్తుతింపఁ దగిన, — విభూతిన్=
ఐశ్వర్యముచే, అన్య=శత్రువులయొక్క, పృతనా = సేనను,
లుంటాక=దోఁచివేయునట్టి, బాహా, బల, శ్రీ = భుజపరా
క్రమ సంపద, కల్మిన్=కలిగియుండుటచేత, రథదంతి . . .
విభ్రమంబునన్=రథములు, ఏనుఁగులు, గుఱ్ఱములు, కాలు
బలములు, వీని పంక్తులచేత అతిశయించిన, సేనయొక్క కల్ప
నృత్త పతాకా విలాసముతోఁ,

146 సముజ్జ్వల=ప్రకాశించుచున్న, హేమవర్మ=బంగారు కవచము
నుండి, నిర్యాత=బయలు వెడలిన,
రుచిచ్ఛటా=కాంతిపుంజములయొక్క,
పటల=సమూహముచే, రంజిత=పూయఁబడిన
హేతి=శస్త్రులచే, మహోగ్ర=మిక్కిలి భీకరమగు,
సైన్యుఁడు=సేన గలవాఁడు.

156 గంధదంతావళ కర్ణమారుతహతిన్=మదపుటేనుగుల చెవులచేఁ
గలిగిన గాడ్పుల తాఁకిడిచేత, తురగఖుర×ఉద్ధూత, ధూళి=
గుఱ్ఱముల గిట్టలచేత, లేఁగఁ గొట్టఁబడిన దుమ్ము,

229. కంధరములు=కంఠములు. అతిపక్వ, తాల, సుభగ, ఫల, ఆళి,
బంధురతన్=మిక్కిలి పండిన అందములగు తాటిపండ్ల పంక్తు
లట్లు దట్టముగా

230. అక్కజమగు కడిమి=అచ్చెరువగు పరాక్రమము

**231.** చెలికన్=మిత్రునకు, ఎదరు=ఆతడు.

232. దేవనితంబినీజన=అప్సరః కాంతలతో. సదృక్ష = సమాన లగు, మృగాక్షులు=లేడికన్నులవంటి కన్నులుగల స్త్రీలు.

237. 238. 239. } ఈ ధయ కవిమిత్రులగు శ్రీ తిక్కయజ్వాగారు ఈ మూఁడు పద్యములతో ఆశ్వాసాంతమున అంత్యానుప్రాసములలో కృతిపతియగు శ్రీహరిహరనాథుని సంబోధించుచున్నారు.

237. విసరస్త, సమస్తవికార! = పోయిన సమస్త వికారములు గలవాఁడా! నిర్వికారుఁడా! యనిభావము.

షట్ ప్రమాణ పరిమదూర! = ఆఱు ప్రమాణములకును దవ్వైన నున్నవాఁడా! ఏ ప్రమాణమునకును అందనివాఁడా! యని తాత్పర్యము. షట్ ప్రమాణములు. 1. ప్రత్యక్షము 2 అనుమానము 3 ఉపమానము 4 శాబ్దము 5 అర్థాపత్తి 6 అనుపలబ్ధి.

శాంతిపరమహాత్మ సంపరణదూర!=శాంతిపరులగు మహాత్ములకు సంసారవారాశితీరము వంటివాఁడా!

**238.** విజ్ఞాన . . . హంస! విజ్ఞానరసమును ఆనందరసమును తెలిసిన జ్ఞానులయొక్క హృదయపద్మములను వికసింపఁజేయు సూర్యుని వంటివాఁడా!

139. త్రిజగత్ . . . ప్రమోదా! = మూఁడులోకములను రక్షించుట యనెడు నిత్యక్రీడవలన ఉదయించుచున్న ఆనందము గలవాఁడా!

ఈయాశ్వాసాంత సంబుద్ధులన్నియు హరిహరులకు సమన్వయించుకొనవలెను.

శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

# టిప్పణి

## విరాటపర్వము-చతుర్థాశ్వాసము

1. క॥ శ్రీమదరేఖ . , . హరిహరనాథా !
శ్రీ మదరేఖ ! లక్ష్మీసంబంధములగు కస్తూరీరేఖలు గలవాఁడా!
(హరిపరమున) శ్రీ మదరేఖ ! = పార్వతీసంబంధి కస్తూరి
రేఖలు గలవాఁడా ! యని హరపరమున అర్థము.
విషాదవిరామా ! = భక్తుల దుఃఖమును బోఁగొట్టువాఁడా !

హిత . . . నివాస ! = హితమును దృఢమును అగు శాంతిభర
ముతో నిండిన నిష్ఠచే వర్తింపఁబడిన వివిధవికారములు గల
సజ్జనులయొక్క మనస్సే నివాసముగాఁ గలవాఁడా! అని
యుభయత్ర అర్థము సమానము.

3. భీష్మాచార్య . . . సంఘోద్భటము గని =
భీష్ముఁడు ద్రోణాచార్యుఁడు కర్ణుఁడు మొదలుగాగల యోధ
సమూహముతో అధికమై,

ఈ సమాసములోని ఆచార్య శబ్దము ధనురాచార్యుఁడగు ద్రోణ
వాచకముగా వాడఁబడినది, పూర్వపదముతోఁ జేర్చుకొని
యన్వయింపరాదు,

4. ప్రముక్కడిమూఁకలు = అల్పములగు సేనలు—శరాసారంబునబడి
బాణముల ధారావర్షముచేత (జడివానచేత)
బెగ్గలించి భయపడి,

గవాధ్యక్షుండు = గోవులమీఁది యధికారి, గో × అధ్యక్షుండు = గవాధ్యక్షుండు, గోశబ్దమునకు అవజాదేశము.

6. దృఢతమత్రాణము = గట్టి కవచము,
ఉగ్రచాప = భయంకరమైన విల్లు, బాణ, పూర్ణ, తూర్ణ = బాణములతో నిండిన యంబులపొది, ఘనగదా = పెద్దగద, అసి = ఖడ్గము, తోమర = ఇనుపగుదియ; చక్రాదులు = చక్రము మొదలగునవి,

7. కాతర పరిరక్షకుండు = భయపడిన వారిని రక్షించువాఁడు.

8. అర్గించుటకున్ = స్తుతించుటయు,
దర్పోద్ధతి = గర్వాతిశయము

15. పడిపన్నయేత్రైల = ప్రసిద్ధగలకేగము.

18. ఆలి = పరిహాసము

26. అపదుకాఁదీగ = పన్నని తీఁగవంటి నడుము.
కాను × తీగ = కాఁదీగ.
కర్ణభూషణ మౌక్తిక ప్రభాడోలనము = చెవి కమ్మలలోఁ జెక్కిన ముత్యాలకాంతుల యూగుటలు.

27. ఇందకీయుపమకు మూలము—తిన్న త్రకాగార మహాకశిష్ట్ర శత హ్రాదా మేఘ మివాన్వపద్యత॥

32. మత్తశుండాలంబునబోలె = మదించిన యేనుఁగువలె.

34, మైమఱువు = కవచము, తొడి = తొడిగి,
పెంపు = అతిశయము, లావు = బలము, కరవు = ఉపాయము.

39; ఒలువలు = వ్యతిక్రమములు (విక్రమము)
అబలాజనమున్ = స్త్రీ జనమును

40. వ్యూఢోదాత్తంబు = ఘనోదారమును ఉత్తమమును
కంకటము = కవచము ఛిడిముడి = తొట్రుపాటు.

42. సిడము = ధ్వజము, గోచయము = ఆలమంద

45. కాంచన, జాల = బంగారపువలచేత, అలంకృత = అలంకరింపఁబడిన, చంచత్ తనులీల = ఒప్పిదమగు శరీరవిలాసము, జవసాశ్వములన్ = వడిగల గుఱ్ఱములను, మణిమయ = మణివికారమగు, పంచానన కేతువు = సింగపు టెక్కెమును

47. తదంబరములలోన్ = వారి వస్త్రములలో, చిత్రవర్ణ భాసురములు = పెక్కు రంగులతోఁ బ్రకాశించు ననియు, తరము = మేలు,

49. నిరర్గళ పరాక్రముండు = అడ్డులేని బలము గలవాఁడు, వల్గదశ్వంబు = దౌడుదీయు గుఱ్ఱములుగల,

50 ఎడలు = ప్రదేశములు, ఆకు జొంపంబుల = ఆకుల గుబురుల; కిసలయోత్కరముల్ = చిగురుటాకుల మొత్తముల, శ్రేణి సేయున్ = పరిహసింపఁగా, తావుల = తావులు,

51. గరుపాటిన మేను = గగుర్పొడిచిన శరీరమును, తలఁకు మనము = తలఁకు చెందిన మనస్సును, ఱిచ్చపడిన చూపును = చేష్టలులేని చూపును (దృష్టియు)

52: భీష్మద్రోణ . . . అభీలంబు, భీష్ముఁడు, ద్రోణుఁడు, కృపాచార్యుఁడు, మొదలుగాఁగల విలుకాండ్ర సమూహముచే భీకరమును, దుర్యోధన . . . ఆకీర్ణంబు = దుర్యోధనుఁడను పెను గ్రీష్మకాలమునందలి సూర్యునియొక్క సమర్థమగు ప్రతాపమను ఆతప సమూహముతో వ్యాపించినదియు, శస్త్రాస్త్ర . . . అత్యుగ్రంబు, శస్త్రముల అస్త్రముల సమూహముల వేడిమిచేఁ బ్రకాశించుచున్న నానావిధములగు (శౌర్యముతో) వెలుగు బలముతో మిక్కిలి భయంకరమును, ఉదగ్రధ్వజా . . . ఆకలితంబు = ఉన్నతములగు ధ్వజముల దీప్తులతోఁ గూడినదియు,

ఈ పద్యము అఖిలాజనము ముందట అట్లు ప్రగల్భములాడి కౌరవ సేనను చూచినంతనే కాళ్ళుచేతులు చల్లఁబడిన యుత్తర

కుమారుని పితృకీర్తనము ప్రపంచమునకుఁ జాటుచుఁ బద్యమున వర్ణింపఁబడిన భీష్మద్రోణాది ధన్వినికరముల యజయ్యతను నిరూపించుచు, ఇట్టి వీరాతివీరులగు కౌరవయోధుల నెల్లఁ బేడిరూపమున మఱుఁగుపడియున్న యర్జునుఁడు, ఎవరిసాయము లేకుండఁగనే యేకాకియై జయించుటచేత తజ్జయాన్నాయకోత్కర్ష వర్ణనం చ ధినోతినః అన్న ఆచార్య దండి వాక్యమును స్మృతికిఁ దెచ్చుచు విజయుని జగదేక వీరత్వమును స్ఫుటీకరించుచున్నది. వేయేల? యీ యుత్తర గోగ్రహణము భారతయుద్ధ పర్యవసానమును సూచించుచున్నది ఈ ఘట్టమున సమగ్ర కావ్యగుణోపేతముగా నీ పద్యమును చిత్రించి సహృదయ హృదయముల నాకర్షించిన ఉభయ కవిమిత్రుల నిరుపమాన ప్రతిభకు జోహారులు.

58 దంతి, తురంగ, సద్భట, కదంబమున్ = ఏనుగుల, గుఱ్ఱముల, మంచి కాల్బలముల, గుంపులను,

59. పసులదయ్య మెఱుఁగుఁ బడఁతుల సంతోష
మేల, నాకు, ననికిఁ జాల నేను—ఇందులకు సంస్కృతమూలము.

శ్లో॥ కామం హరంతు మత్స్యానాం భూయాంసః కురవో ధనమ్
ప్రహసంతు చ మాం నార్యో నరా వాఽపి బృహన్నతే!
సంగ్రామే న చ కార్యం మే గావో గచ్ఛంతు చాపి మే॥

78 పరి = సేన, సైన్యవిస్ఫురణము = సేనయొక్క విజృంభణము

81. సాతోడి ప్రేముడిన్ = సామీఁది ప్రేమచేత
సమాసంబునఁ జేగ, తోడ, వలన లకర్థంబగు అను సూత్రము చేతతోడ కర్థము వచ్చినది.

88. చిచ్చఱపిడుగు = అగ్గిపిడుగు (మిక్కిలి బాధించునది)

86-87-88 పద్యములలోఁ గౌరవసేనలోఁ బొడమిన ఉత్పాతంబులు వివరింపఁబడినవి.